*Issued on 26-5-'59*




**Volume XXI**

**No 3**

**10th December, 1958.**
**(Wednesday)**

# Andhra Pradesh Legislative Assembly Debates

## OFFICIAL REPORT

### Part II—Proceedings other than Questions and Answers

CONTENTS



NOTE * at the commencement of the speech denotes confirmation from the Member not received in time

Printed by Ajanta Printers, Secunderabad,
for the Director Government Printing Press Hyderabad-A. P

# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

*[Part II – Proceedings other than Questions and Answers]*

## OFFICIAL REPORT

---

*Fifteenth day of the Eighth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 10th December, 1958*

The House met at Nine of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

### *Statement Re Universal Declaration of Human Rights*

మిస్టర్ స్పీకర్ ఇప్పుడు యూనివర్సల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్సు గురించి సభానాయకులు, ముఖ్యమంత్రిగారు కొంత చెబుతారు ముందుగా నేను ఒక రిమార్కు చేసి వారిని పిలుస్తాను

పూర్వం, 'హ్యూమన్ రైట్సు గురించి మీ అభిప్రాయం చెప్పండి' అని జీవెల్స్ మహాత్మాగాంధిగారిని అడిగినారు. అప్పుడు గాంధిగారు "మేము ఇండియాలో ధర్మంగురించి ఎక్కువగా చెబతాము, ధర్మం నెరవేరిస్తే హక్కులు వాటంతటవే వస్తాయి" అని అన్నారు కాబట్టి మన హిందూదేశం యొక్క నాగరికతాధర్మం ధర్మం చేయడమే ఈ విషయంలో యు ఎన్ ఓ ఇంతవరకు పురోగమించింది మనకు సంతోషమే కాని, మనం అంతకంటె ఒక పైననే ఉన్నామని నా ఉద్దేశం ఇక దీనిని గురించి ముఖ్యమంత్రిగారు చెబుతారు

శ్రీ యన్ సంజీవరెడ్డి అధ్యక్షమహాశయా, మానవుని హక్కులగురించి ఎక్కడాకూడ అభిప్రాయభేదం లేదు ప్రపంచంలోవున్న అన్నిదేశాలు అంగీకరించిన విషయమే యిది డిసెంబరు 10, 1948 వ సంవత్సరంలో– అంటే

సరిగా పదేళ్ళ క్రిందట ప్రపంచంలోని అన్నిదేశాలు మనుష్యుని మానవుని హక్కులు కాపాడబడాలనే నిర్ణయం చేసికొన్నాయి ప్రతిదేశంలోనివారు ఈరోజును జ్ఞాపకముంచుకొని మానవుని హక్కులను కాపాడడంకోసం ప్రయత్నంచేయడం జరుగుతోంది రాజ్యాల హక్కులుమాత్రమే కాకుండా, ప్రతిరాజ్యంలోని వ్యక్తులు స్వతంత్రమైన హక్కులుకూడా కలిగియుండాలని ప్రతి మానవుడు స్వేచ్ఛగా బ్రతకడానికి తనకిష్టమైన వృత్తిచేసుకోడానికి, ఇతరులకు నష్టం కలిగించకుండా తనకు తోచిన విధంగా జీవించడానికి, చదువుకోడానికి, వ్యవసాయం చేసుకోడానికి హక్కులను కాపాడాలని నిర్ణయం పలు మార్లు జ్ఞాపకం చేసుకొంటున్నాము కాని, ప్రపంచంలో హక్కులు కాపాడుకోవాలని తీర్మానం చేసుకొన్న కొన్ని దేశాలుకూడా స్వేచ్ఛలేకుండా పరాయిపాలనక్రింద జరుగుతున్న కోట్లాది ప్రజలు ఇంకా స్వేచ్ఛలేకుండా ఉన్నారు

మనుష్యుల విషయ మేమిటంటే అన్నిదేశాలకూ గలదేమనగా స్వేచ్ఛలేదు నల్లవారు, తెల్లవారు అనే రంగు భేదంతో అనేక లక్షల మంది ప్రజలు నేడు ప్రపంచంలో అణగద్రొక్కబడుచున్నారు ఇరవయ్యో శతాబ్దములో కూడా మానవులకు హక్కులు లేకపోవడం చాల విచారకరం కొన్ని దేశాలలో ఈ హక్కులకు భంగం కలుగుతున్నది. మానవులందరికీ సమాన హక్కులుండాలి, అందరూ అభివృద్ధి చెందేందుకు సమాన అవకాశాలుండాలి, అనే విషయాలు మనమందరం ఎలుపార్లు జ్ఞాపకంచుకొని అందుకు ప్రయత్నిస్తూండడం అవసరం "ప్రపంచ జనాభాలో కొన్ని లక్షల మంది తమ హక్కులను కోల్పోయినారు వారి స్వేచ్ఛకు భంగం కలుగకుండా, అన్నిదేశాల స్వేచ్ఛకూ ప్రతిదేశం ప్రయత్నించాలి" అని యునైటెడ్ నేషన్సులో చేసిన తీర్మానాన్ని అమలుపరచడానికి అన్ని దేశాలు కృషి చేయాలి

మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాం మానవుల స్వేచ్ఛను కాపాడడానికి భయంలేకుండా ప్రతివారు ఏ విషయాన్నయినా చెప్పేందుకు మనం పత్రికా స్వేచ్ఛను కల్పించాం ఈ విషయంలో ఇతర దేశాలకంటే మనం ముందంజ వేశాము మన దేశంలో వాక్స్వాతంత్ర్యముంది. వాక్ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య సూత్రాలను రక్షించుటకు, మానవ స్వేచ్ఛను కాపాడడానికి మనం కృషిచేయాలి ఈ విషయాన్ని మనం ఈ రోజున జ్ఞాపకం చేసుకుంటూ అందుకు కృషిచేద్దాం

మానవునికి స్వేచ్ఛకావాలి అతడు నిర్ణయించుకున్న వృత్తిచేసుకొన డానికి స్వేచ్ఛకావాలి దీనికి భంగము వాటిల్లకుండ ఎల్లప్పుడు పరిరక్షించ డానికిగాను మనమీనాడు నిశ్చయించుకొనవలెను

శ్రీ పి సుందరయ్య (గన్నవరం) అధ్యక్షా సభానాయకులు ప్రతిపాదించిన విషయముతో మేము పూర్తిగా ఏకీభవిస్తున్నాము

ఏదేశములోనైనను మానవుని ప్రాథమిక హక్కులకు రక్షణ యుండవలెను వాటిని కాపాడుట ప్రతి ఒకరి కర్తవ్యము అందుకు మనమందరము కలిసి కృషి చేద్దాము

శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్-జనరల్) అధ్యక్షా, సభానాయకునితో మేము పూర్తిగా ఏకీభవించుచున్నాము ప్రతిసంవత్సరం మనం ఈ హక్కులనుగురించి సెరిమోనియల్‌గా భావాలను వెల్లడించినందువలన లాభం లేదు ముఖ్యంగా అధికారంలోనున్న పార్టీకి ఈ హక్కులను రక్షించు బాధ్యత, అవకాశాలు ఎక్కువగా ఉంటాయని వారిదృష్టికితెస్తూ సెలవుతీసుకుంటున్నాను

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు (వదమలపేట) అధ్యక్షా, ఈవిషయంలో సభానాయకులతో పూర్తిగా ఏకీభవించుచున్నాను కేవలం మనం హక్కుల మీదనే దృష్టిని కేంద్రీకరించనక్కరలేదు మన ధర్మములను మనం గుర్తించి, ఆచరించుచుండినచో, హక్కులు వాటంతట అవియే మనకు సంక్రమించును అందువలన ముఖ్యంగా మన హిందూ ధర్మాన్ని కాపాడడానికి కృషిచేయగలమని ఆశిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా, సభానాయకుని అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవించుచున్నాను

ఉన్నతమైన ఆశయాలకొరకు పోరాడే యువతీ యువకులకు అండగా వుండవలయునని, మానవహక్కులను రక్షించ ప్రయతిస్తూ, మానవత్వాన్ని నిర్మించుకునేందుకు కృషిచేద్దామని చెబుతూ విరమిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ ఐక్యరాజ్యసమితివారు ప్రపంచానికి యిచ్చిన సందేశమిది ఈ హక్కులు తమ ఎదుట నున్నవి సభవారంతా ఏకగ్రీవంగా దీనిని ఆమోదిస్తారని ఆశిస్తున్నాను

## *Messages from the Council*

*Mr Speaker* I have to announce to the House the following messages from the Chairman, Andhra Pradesh Legislative Council

*Madras Estates (Abolition and conversion into Ryotwari) (Andhra Pradesh Second Amendment) Bill, 1958 (as passed and agreed to by the council)*

"In accordance with Rule 111 of the Andhra Pradesh Legislative Council Rules as adopted under clause (2) of Article 208 of the Constitution of India, I transmit a copy of the Madras Estates (Abolition and Cenversion into Ryotwari) (Andhra Pradesh Second Amendment) Bill, 1958 (L A Bill No 36 of 1958) as passed and agreed to by the Council on the 8th December 1958, without any amendment and signed by me"

*Motion passed by the council regarding setting up a Joint Select Committee on the Andhra Pradesh Bhoodan and Gramdan Bill, 1958*

"I transmit a copy of the following motion passed by the Andhra Pradesh Legislative Council on the 9th December 1958 concurring with the Assembly in setting up a Joint Select Committee to consider the Andhra Pradesh Bhoodan and Gramdan Bill, 1958 (L A Bill No. 40 of 1958)

*Motion*

'That this House concurs with the Assembly in setting up a Joint Select Committee of both the Houses consisting of 20 members (15 members of the Assembly and 5 members of the Council) to consider the Andhra Pradesh Bhoodan and Gramdan Bill, 1958 (L A. Bill No. 40 of 1958) and that the following members of this House be selected to serve on such a Joint Select Committee

1 Sri I Lingayya
2 ,, K Sherfuddin
3 ,, D Ramakanta Rao
4 Smt J Sitamahalakshmi
5 Sri A Lakshminarasimha Reddy' "

*Andhra Pradesh General Sales Tax Validation Bill, 1958 (as passed and agreed to by the council)*

"In accordance with Rule 111 of Andhra Pradesh Legislative Council Rules as adopted under clause (2)

of Article 208 of the Constitution of India, I transmit a copy of the Andhra Pradesh General Sales Tax Validation Bill, 1958 (L A Bill No 39 of 1958) as passed and agreed to by the Council on the 9th December, 1958 without any amendment and signed by me "

*Motion passed by the Council regarding setting up a Joint Select Committee on the Hyderabad Prevention of Fragmentation and Consolidation of Holdings (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958*

"I transmit a copy of the following motion passed by the Andhra Pradesh Legislative Council on the 9th December 1958 concurring with the Assembly in setting up a Joint Select Committee to consider the Hyderabad Prevention of Fragmentation and Consolidation of Holdings (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 (L A Bill No 41 of 1958)

*Motion*

'That this House concurs with the Assembly in setting up a Joint Select Committee of both the Houses consisting of 20 members (15 members of the Assembly and 5 members of the Council) to consider the Hyderabad Prevention of Fragmentation and Consolidation of Holdings (Andhra Pradesh Extention and Amendment) Bill, 1958 (L A Bill No 41 of 1958) and that the following members of this House be selected to serve on such a Joint Select Committee

1 Sri J. Raghotham Reddy
2 ,, J. C Nagi Reddy
3 ,, Ernest Gedion
4 ,, K Manohara Rao
5 ,, Kolla Venkaiah' "

*Calling attention to matters of urgent public importance re Withdrawal of large sums by the Deccan Engineering Company at Nagarjunasagar Project*

*Mr. Speaker* I have received notice of motion under Rule 74 of the Andhra Pradesh Legislative

Assembly Rules regarding withdrawal of large sums by the Deccan Engineering Co at Nagarjunasagar Project The Minister for Irrigation and Power will make a statement on the subject

*The Minister for Irrigation and Power (Sri J. V Narsinga Rao)* The contract for excavation of foundations for the dam from Chains 89 to 92 was let out to Messrs. Hyderabad Deccan Engineering Co after calling for tenders The work was under the Dam Division No (1) till 10-6-1958 and was later on transferred to Dam Division No (3) due to adjustment of work load between the divisions The contractor was paid in Dam Division No (1) 13 running bills totalling Rs 3,71,010 After the work was transferred to Dam Division No (3) the Assistant Engineer of that Division took levels of the work for preparing the 14th running bill. He found that the levels of excavtion were higher than the levels for which the contractor was paid in the previous bill, viz No 13 He reported the matter to the Executive Engineer, who arranged to take fresh levels jointly by the three Assistant Engineers, one of them being the Assistant Engineer of Dam Division No 1, under whom the work was executed before These joint levels confirmed that excess measurements were recorded and paid

The contractor was immediately informed and asked to depute his representative for taking the levels jointly The levels were again taken jointly by the Assistant Engineer, Dam Division No (3), the Assistant Engineer, Dam Division No. (1) and the Contractor's Engineer, and check measured by the Executive Engineer. Based on these levels it was found that the quantity paid to the contractor in running bill No. 13 was 357 units more than the quantity actually excavated resulting in an excess payment of about Rs 62,000. The amount of further security recovered from the Contractor's bills on this work was Rs. 22,448. After adjusting this, the amount remaining to be recovered from the contractor was Rs 39,475.

The contractor requested the department that the amount may be adjusted from his standing security deposit of Rs 50,000 available with the Department. The contract has been terminated and the final bill has been prepared adjusting this excess amount paid against the further security of Rs. 22,448 on this work and the standing security deposit of Rs. 50,000.

The balance work to be done was for about Rs 30,000 and it is being carried out through other agencies within the tendered rate of the previous contractor.

The case of excess payment was investigated It was found that the Supervisor who was in charge of the work, and who was recording measurements in the running bills had entered wrong levels from running bills No 7 onwards. In his explanation he has stated that the levels taken by him were entered in the field books and he used to hand over the latter to the contractor's supervisor for plotting cross sections and for working out quantities and that he was merely copying the levels in the measurement books from the cross-sections without referring to the field book. The Assistant Engineer concerned who has recorded his check-measurement on all the running bills has admitted that he did not compare the levels in the Field Book with those entered in the Measurement book and was relying on the Supervisor for correctly transferring the levels to the measurement book. Both the Supervisor and the Assistant Engineer have been placed under suspension and proceedings have been instituted under the rules for taking disciplinary action against these officers

The Executive Engineer Dam Division No. (1) has explained that he had test-checked the levels initially when the work was handed over to the Contractor and then the levels for the running bill No. (5) and that he would have checked the work at the time of preparation of the final bill. The Executive Engineers are normally not enjoined to check-measure all running bills and according to Code rules they have to do 24 check measurements in a year. The number of check

measurements made by the Executive Engineer, Dam Division No (1) is much more than the prescribed limit However, a circular has been issued enjoining the Executive Engineers to test-check each running bill and to check the final bill 100% As a further safeguard, checking of the measurements now and then by the Executive Engineer, Inspection and Control is also being enforced

The contractors Messrs. Hyderabad Deccan Engineering Co have represented that they have been duped by their staff in this matter as they have paid to their job workers and labour for the extra quantity covered by the excess and that they are taking action against them It is proposed to levy penal interest on the contractor for the amount over-paid to him

The basic points thus are

1 The excess payment was on account of running bills

2. The excess payment was detected by the Executive Staff of the Division

3 The excess payment is covered by sufficient assets of the contractor in possession of the Department

Thus there is no loss to Government and further penal interest is proposed to be charged for the amount overpaid to him

## *Repairs to the Bridge at Sankili*

శ్రీ పి నరసింహప్పారావు (పాలకొండ) అధ్యక్షా, సంకిలి బ్రిడ్జి విజయనగరం, చీపురుపల్లి, పాలకొండ పాతపట్నం మొదలైన తాలూకాలలో దాదాపు 10 లక్షలమంది ప్రజలకు ముఖ్యమైనదిగా ఉన్నది బ్రిటిషు ప్రభుత్వకాలమునుండి దానికోసం agitation జరుగుతున్నది మన ముఖ్యమంత్రిగారు దానికి foundation వేసి ప్రారంభోత్సవము చేసినారు. చిన్న వరదకే ఆ foundation పడిపోయినది అక్కడి ప్రజలు దీనివలన చాలా యిబ్బంది పడుతున్నారు తక్షణమే తగిన చర్య తీసుకొని అక్కడ హైలెవెల్ బ్రిడ్జి కట్టించేందుకు పూనుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను డిసెంబరు నెలాఖరులోగాగాని జనవరి ప్రారంభములోగాని పని ప్రారంభింపచేస్తారని ఆశిస్తున్నాను

ఈ విధంగా చిన్న వరదలకే ఇది పడిపోవడానికి కారణము, ఇంకా ఇతర విషయాలు ఎంక్వయిరీ చెయించవలసినదిగా కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ యం నరసింగరావు అధ్యక్షా, గౌరవసభ్యులుఅడిగిన ప్రశ్న మేరకు సమాధానం చె..తాను

Government are fully aware of the need for taking early action to repair the damage that has been caused to the Sankili Bridge Whether the damaged units can be restored to normal position is the question that has to be considered Whether any modification in design is necessary to prevent the possibility of future damage is another aspect that requires examination These and other technical problems arising out of the damage are under examination Action will be taken for repairing the damage after examination of these problems by senior technical officers Members of the House will, I am sure, appreciate that these problems require careful study and investigation I would like to assure the House that prompt action will be taken for repairing the damage.

The matter relating to the Nandiwada Bridge comes under the Irrigation Branch and does not have any direct bearing on the Sankili Bridge

## PAPERS LAID ON THE TABLE OF THE HOUSE

### *Amendments to the Madras Public Service Commission Regulations, 1950*

*Sri N Sanjeeva Redddy* I beg to lay on the Table a copy of the Notification issued with G O. Ms. No 1230, General Administration (Services-A) dated 8th August 1958 making an amendmend to the Madras Public Service Commission Regulations, 1950 as adopted in Andhra Pradesh in accordance with clause (5) of Article 320 of the Constitution

I beg to lay on the Table a copy of the Notification issued with G.O Ms No 1591, General Administration (Services-A) dated 16th October, 1958 making an amendment to the Madras Public Service Commission Regulations, 1950 as adopted in Andhra Pradesh in accordance with clause (5) of Article 320 of the Constitution

*Mr Speaker* Papers laid on the Table.

*Leave of absence to Sri C Sriranganayakulu, M L A*

*Sri K Vijaya Bhaskara Reddy (Yemmiganur-General)* I move

"That under Rule 265 of the Andhra Pradesh Legislative Assembly Rules, leave of absence be granted by this House to Sri C Sriranganayakulu, Member, Andhra Pradesh Legislative Assembly for the present meeting of the Assembly as he is ill"

*Mr Speaker* Motion moved

(Pause)

*Mr Speaker* The question is

"That under Rule 265 of the Andhra Pradesh Legislative Assembly Rules, leave of absence be granted by this House to Sri C Sriranganayakulu, Member, Andhra Pradesh Legislative Assembly for the present meeting of the Assembly as he is ill"

The motion was adopted

## BUSINESS OF THE HOUSE

శ్రీ వి విశ్వేశ్వరరావు (మైలవరం) On a point of information, Sir నేను అయిదురోజుల క్రిందట adjournment motion ఒకటి యిచ్చాను దానినిగురించి తెలియచేస్తారా ?

మిస్టర్ స్పీకర్ అది యిప్పుడు చెప్పలేను ఆఫీసుకు పంపించాము వచ్చిన తరువాతగాని దానినిగురించి చెప్పలేను

పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తుల బిల్లువిషయంలో శ్రీ సుందరయ్య గారు యివాళ మధ్యాహ్నముకూడ సమావేశ మవుదామన్నారు దానికి సభానాయకులు ఎమి చెబుతారు ?

శ్రీ ఎన్ సంజీవరెడ్డి చాలామంది కావాలనుకుంటున్నప్పుడు మధ్యాహ్నంకూడా సమావేశమవుదాము కనీసం రెండుగంటలు అయినా దానిపై చర్చించడానికి అవకాశముండాలనుకుంటాను

మిస్టర్ స్పీకర్ మధ్యాహ్నం 2 గంటలకు సమావేశమవుదామా ?

శ్రీ ఎన్ సంజీవరెడ్డి 4 గంటలకు సమావేశమవుదాము

## GOVERNMENT BILL

## *The Andhra Pradesh Panchayat And Zilla Samithis Bill, 1958*

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు) పూజ్యులు నిన్న ఒక నిమిషమే నాకు మాట్లాడడానికి అవకాశమిచ్చారు

మిస్టర్ స్పీకర్ ఇవాళ యింకొక అయదునిమిషాలసేపు మాట్లాడండి

శ్రీ పి గున్నయ్య అధ్యక్షా, ఈ పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తుల బిల్లును ప్రభుత్వంవారు సెలెక్టు కమిటీకి పంపనుద్దేశించినట్లు చెప్పినారు

మన రాష్ట్రంలో గ్రామానికి ఒకటి చొప్పున మొత్తం 70 బ్లాక్సు వున్నాయి ప్రతిబ్లాకులో దాదాపు 20 మంది హరిజనులు వుంటారు ఇందులో స్త్రీల సంఖ్య కూడా సమంగానేఉంటుంది స్త్రీలకు, హరిజనులకు, వెనుకబడిన జాతులవారికి అందులో ప్రాతినిధ్యం యివ్వవలయునని వున్నది

ఈ ప్రభుత్వం హరిజనులకు, స్త్రీలకు అసెంబ్లీలో కావలసినంత ప్రాతినిధ్యం యిచ్చినది గాంధీగారు కలలుగన్న రామరాజ్యం స్థాపించడానికి ఈ పంచాయితీ సమితులు నాందివంటివి కాబట్టి ఈపంచాయతీసమితులలో కూడ, హరిజనులకు, స్త్రీలకు ఎక్కువ ప్రాతినిధ్యం యివ్వాలని మనవి చేస్తున్నాను ఈ చట్టంలో ప్రతి గ్రామంలోను, పంచాయతీకి ఒక్కొక్క స్త్రీని, ఒక్కొక్క హరిజనుని నామినేటు చేయాలని ఉన్నది అది చాలదు ఈ విషయమై ముఖ్యమంత్రిగారు తిరిగి మరొకసారి ఆలోచించాలని కోరుతున్నాను ప్రతి పంచాయతీలోను, పదిమంది స్త్రీలు, పదిమంది హరిజనులు, యింకా కొండజాతులు మొదలైన వెనుకబడిన వర్గాలకు ప్రాతినిధ్యం యివ్వాలని మనవిచేస్తున్నాను ఈ 447 బ్లాక్ సమితులు చిన్నచిన్న శాసనసభలుగా పనిచేస్తాయి కాబట్టి, బ్లాకు సమితుల అధ్యక్షులకు మంత్రిగారికి ఉన్నటువంటి కారు లేకపోయినా ఒక జీపు అనేది ఉన్నది గనుక, ఆ అధ్యక్షులకు తగినన్ని అధికారాలు యివ్వాలని కోరుతున్నాను (హర్షం) ప్రస్తుతం రెండవ పంచవర్ష ప్రణాళిక అమలులో ఉన్నది ఈ ప్రణాళికకు ఖర్చుపెట్టిన మొత్తంలో, సగంకంటె ఎక్కువ మొత్తం జాతీయవిస్తరణ కార్యక్రమాలకు ఖర్చు అయినది కొంతమంది ఈ కేంద్రాలలో జరుగవలసినంత అభివృద్ధి జరుగలేదని అభిప్రాయ పడుతున్నారు కాని నా ఉద్దేశంలో, ఈ జాతీయ అభివృద్ధి కార్యక్రమ కేంద్రాలల్లో ఎంతో అభివృద్ధి జరిగింది స్కూల్సు లేనిచోట్ల అవి పెట్టించారు పాఠశాలలకు చక్కటి భవనాలు కట్టించారు ఇదివరకు ఎన్నడూ అటువంటి భవనాలు ప్రజలు చూడలేదు 70 వేలు, 80 వేలు ఖర్చుపెట్టి పాఠశాలలకు భవనాలు కట్టించారు విద్యావ్యాప్తి బాగా సాగుతోంది వైద్య సౌకర్యాలు

ఎక్కువ అయ్యాయి ప్రతి అభివృద్ధి కేంద్రంలో ఒక ఏర్పాటులు పెట్టారు నా ఏరియాలో ఇదివరలో ఒక ఆసామీ ఎనబది రూపాయలు ఖర్చుపెట్టి కారులో ప్రసవం కావలసిన మనిషిని శ్రీకాకుళం తీసుకువెళ్ళడం జరిగింది అటువంటి కేసులు వేలకు తటస్థించినట్లయితే ఎక్కడ సాధ్యం అవుతుంది? అంత డబ్బు ఎక్కడ ఖర్చుపెట్టగలరు? ఈ కేంద్రాలు రావడంవల్ల ఆసుపత్రులు పెట్టి, అక్కడ ప్రసవించే వారికి [illegible] సౌకర్యాలు కలిగించారు హెల్తు డిపార్టు మెంటువారు మందులు సరఫరా చేస్తున్నారు అనేకమైన సౌకర్యాలు జాతీయవిస్తరణ కేంద్రాలలో జరుగుతున్నాయి చేపలు, కోళ్ళు, పందులు పెంచి ప్రజలకు ఉపయోగపడుతున్నారు అధికోత్పత్తికి మంచి విత్తనాలను సరఫరా చేయడం, బావులు లేనిచోట్ల వాటిని త్రవ్వించడం మొదలైన కార్యక్రమాలు చేస్తున్నారు బ్లాకులు లేనిచోట్ల ప్రజలు అవి కావాలని ఆందోళన చేస్తున్నారు

అధ్యక్షా! కాంగ్రెస్ సంస్థ ఆదేశానుసారం అక్టోబరు రెండు మొదలు 8 వ తేదీవరకు నా నియోజకవర్గంలో 60, 70 గ్రామాలను దర్శించాను ఆ గ్రామాలను దర్శించినప్పుడు, బ్లాకులులేని గ్రామాలవారు, సీతంపేటలో బ్లాకు వచ్చింది, నగరికల్లులో వచ్చింది మాకూ కావాలని ఆందోళన చూపారు ఆ బ్లాకు ప్రాంతాలను చూచినట్లయితే, ఒక ఊరికి ఇంకో ఊరికి వెళ్ళడానికి ఇదివరలో రోడ్లు ఉండేవికావు ఇప్పుడు చక్కగా తారురోడ్లు మెటల్ రోడ్లు వేసుకొన్నారు ఇదివరలో బండి వెళ్ళనటువంటి రోడ్డు మీద, ఇప్పుడు కార్లుపోతున్నాయి ఎంతో అభివృద్ధిని అయా గ్రామాలు, ఈ కేంద్రాలు రావడంవల్ల సాధించారు అందుచేత ఈ బ్లాకు సమితి అధ్యక్షులకు, ఎక్కువ అధికారాలు ఇవ్వడమే కాకుండా, ఆబ్లాకు సమితులలో స్త్రీలకు, హరిజనులకు తగినంత ప్రాతినిధ్యం ఇచ్చి రామరాజ్యస్థాపనకు పూనుకొంటారని ఆశిస్తున్నాను ఈ బిల్లును ఇప్పుడు జాయింటు సెలెక్టు కమిటీకి పంపిస్తున్నారు ఆ సెలక్టు కమిటీలో-జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతీల వ్యవహారాలలో ఆరితేరిన వ్యక్తులనే వేసి ఈ బిల్లును ఇంకా చక్కగా రూపొందించుటకు తోడ్పడవలెనని మంత్రిగారిని కోరుతున్నాను ఈ జాయింటు సెలక్టు కమిటీలో సభ్యులను వేసేటప్పుడు దీర్ఘంగా ఆలోచించి మరీవేయాలని మనవిచేస్తున్నాను

**శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్)** అధ్యక్షా! ఒక్కొక్కరికి టైము ఎంత ఇస్తున్నారు? కనీసం మా స్త్రీ సభ్యులకు అయినా ఎక్కువ ఇవ్వాలని కోరుతున్నాను

**మిస్టర్ స్పీకర్** పది నిముషాలు ఇస్తున్నాను వీరికి, వారికి అనేది ఏమి లేదు పేర్లు పంపించండి

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ కనీసం 15 నిమిషాలు అయినా ఇప్పించండి

మిస్టర్ స్పీకర్ చూస్తాం!

*Sri K Koti Reddy (Lakkiuddipalli)* Sir, In supporting this Bill, I would like to make some general observations, before I go in to the details of the Bill

There was a time when we all agitated that the administration of the State should be decentralised and as much power as possible should be entrusted to local bodies For one thing, it is the intention of the Government and country that we should train leaders in rural areas, in adition to those who have been taking part in Legislatures In the context of this, the intention that has been disclosed in this Bill is really commendable How far this intention will be carried out in actual working depends a good deal on many considerations

(*Mr Deputy Speaker in the Chair*)

The chief consideration mainly rests with the Government If the Government really carries out its commendable intention of entrusting full power to local authorities without interference and without importing into them its own ideas and without seeking any advantage that it may derive by virtue of its position as Government that is really healthy and conducive for a better state of affairs Nor should members of the ruling party try to interfere in any way with the due excercise of powers by the local authorities or obtain any undue preference as against others

I remember, Sir, some years ago, when I first entered the Legislative Assembly of Madras in 1923, a resolution had been passed to the effect that the Presidentship of the District Boards should be thrown open to election An exception, however, was made only in the case of backward districts. The Presidentship of Kurnool District was thrown open for elections, but in the suceeding year the Presidentship of District Board, Cuddapah, was not thrown open to election

It was felt that Cuddapah was probably more backward than Kurnool District at any rate, it was not less backward than Kurnool District, and we were

unable to understand why the Government which was a party to that resolution did not throw open Cuddapah District to elections They merely said that Cuddapah District was a backward area If Cuddapah was backward, Kurnool too was equally backward There should have been in the circumstances other considerations that must have weighed with the Government in throwing open one District to election, and denying elections to another. Might be, the member who was likely to enter into Presidentship was not a member belonging to the party in power at that time, and that was how one could explain why elections were not held in Cuddapah That is why I would submit to the Government that, if they are really very serious to carry out the intentions of the Bill, a good deal depends upon them In this Bill, as in any other, there has been ample scope for interference But Government should not step into and interfere, unless it became absolutely necessary For example, if the decision of a local authority is against law and manifestly unjust, or if the relevant section is so worded as to give the Government ample power to interfere, the Government, in such cases, could interfere. This was my main argument and I would earnestly ask the Government to bestow sufficient attention to this aspect of the problem

Secondly, the success of the intentions of the Government embodied in this Bill would depend a good deal on the type of Panchayat Presidents that we are going to elect In regard to this, it has been my conviction that the Andhra Pradesh Local Boards and District Boards Act requires a good deal of change. Unless the reassured changes are brought about, I believe, there would not be a successful working of the intentions embodied in this Bill.

I do not think I will have sufficient time to go into the detailed working of the Panchayat Board Act. I would like to bring to the notice of the Government, so far as the Andhra Pradesh Act is concerned, that when an amendment was moved, while this Act was passed in Madras, to the effect that secrecy of voting must be adopted, the reply of the Government was that they would adopt it in the rules The rules were framed, but the Government did not include this, viz.,

in all elections to Panchayats, secrecy of voting would be maintained In practice, we applied the principle of secrecy of voting in major panchayats, but so far as minor panchayats are concerned, secrecy of voting was not allowed, but mere raising of hands was allowed This, I know, in rural areas, has given rise to factions That elections should be based on the principle of secret voting is a healthy thing which admits of no doubt But still, we are prepared to go forward with the present method, provided sufficient precautions are taken to see that as far as possible factions did not result as a consequence of elections That is the one direction in which I believe the Hyderabad Act was much better Secrecy of voting was adopted in the said Act, as a matter of principle The Hyderabad Act, as I could see, is such ahead of our Act it mentions a number of subjects which could be entrusted for the administration of the Village Panchayats

Coming now to the details of this Bill, a number of suggestions would probably be necessary In two or three instances, I have noticed that the Bill was very badly drafted Probably there was very little time available to the Government and as a result some mistakes had crept in here and there They will have to be corrected So far as the merits of the Bill go, let us see what the intentions of the Government are If the intention of the Government is to enturst the administration of certain subjects to Samithis, it should be carried out The crux of the matter really is what exactly is the meaning of the word 'administration' The Samithies are entrusted with the power of administering the subjects entrusted to them, and it is mentioned that the H D Os are the real chief Executive Officers What is the 'execution of a Project', what is 'administration'? Sometimes, opinions differ in construing such words I would like to mention one or two instances where difficulties would arise Take for instance contracts I know, Sir in the giving of contract, as a measure of emergency or so, contracts are given where it is below the standard stipulated. You cannot throw open contracts like that on the ground of emergency

*Mr. Deputy Speaker*. Only ten minutes have been allotted. Will you please shorten your speech ?

*Sri K Koti Reddi* Then, the District Board or the Panchayat or the Samithi may pass some resolutions Who has to dispose it of? Is it the Executive Officer? He has full control in disposing of the contrcts He may like to give it to whomsoever he wants Can the President interfere in it? Or is it under the functions entrusted tothe President?

Take the question of transfer for instance, because that has been the question which has been agitating the minds of many people with regard to transfer of some of these officers I really believe that we have to take a step forward The last 40 years with regard to the administration of Local Boards has convinced me that we must either go forward or go backward Supposing we go forward, we must really trust the local board committees —the non-officials—and completely give them freedom. I know, sir, that even under the old Justice-Party regime more power was given to the Presidents of the District Boards There might be some abuses here and there The Government then had ample power to interfere. Even today, the Government have taken ample power to interfere But in between, unless the Government actually feels the necessity for interference, full powers must be entrusted to the non-official agencies Othervise, I do not think there will be any satisfaction that we are doing any justice

Then, sir, let us take the Standing Committees It is said that the Standing Committees are not being directly elected They may not prove to be democratic institutions I do not think it is the proper way of looking at things The main idea really seems to be to avoid elections as far as possible I know the difficulties in these elections But I do not find fault very much with them. I may believe that it is really much better to avoid as many elections as possible to the local boards But so long as the Presidents of the Panchayat Boards are elected in a proper way, I do not think there will be any necessity for any complaint I do not think the complaint of the leader of the Communist Party is proper because even today in the elections to Panchayat Board a Communist may come, a Socialist may come and the Panchayat President will still be there I do not think how it could be

said that the elections or administrations of the Panchayat Samithis will naturally go on party lines and not for the benefit of the country Since most of the powers are to be exercised by the Standing Committees, I would rather like to say that the number of members in the Standing Committees should be increased I do not think there is much of danger even if the whole Samithi is entrusted with the powers. After all, most of the members may not be present in these meetings Only a few of them may be present in these meetings. But, even if it is necessary to have the Standing Committees, I would rather like to repeat that the number should certainly be increased because most of them are after all experienced in the rural areas, in the Samithi Republics One is as good as another with regard to the administration of the functioning of various subjects that are entrusted to them

Secondly, sir, I say that it is absolutely necessary to demarcate the various powers and functions between the Panchayat Samithies and the Zilla Parishads. After all, the Parishads have not much of the powers They have merely supervising powers that are given to them, even in that case a question of maintenance is entrusted with regard to secondary education That is why I say that they may be given some general powers and functions I personally feel that the President of the Parishad should not be elected. In respect of making the Collector an ex-officio officer there may be some difficulties with regard to staff and other things

*Mr. Deputy Speaker* The hon Member may close his speech now, he has taken already five minutes more

*Sri K Koti Reddy* But, still sir, time has come when a step even in this direction must be taken The Presidents of the District Boards hitherto — some of them — have proved to be very efficient and very good Presidents. There may be a few — one or two — bad people But that is not the reason why we should want to entrust the whole powers to the public as such. It is the public that has to judge the character, honesty and integrity of the District Board and see that bad people are not elected. We must see the trustworthy people in the rural areas and allot

them certain functions or not trust them at all. If you are going to trust them, full powers must be given to them It was said, sir, during the time when we wanted the power from the British people

*Mr Deputy Speaker* (Ringing the bell continously) Order, order, please I think the hon Member has taken a long time and he is not doing justice to the other hon members, who are to speak

There are so many hon members who want to participate in the discussion Even if I allot 10 minutes to each hon member it is not sufficient at all Even though we are having a sitting in the afternoon, it will not be sufficient as per the list of hon. members I have got with me Therefore, as the hon Speaker had announced, 10 minutes will be alloted to each hon member and at the end of 8 minutes I shall ring the first bell and at the end of 10 minutes I shall ring the second bell I hope the hon. members will resume their seats at the second bell and co-operate with me.

శ్రీ బి రత్న సభాపతి (బద్వేలు) అధ్యక్షా, ఈ బిల్లు చూచిన తరువాత ప్రత్యేకముగా నాకు ఆశ్చర్యము కలిగింది ఈ బిల్లు శాసనసభకు రాక ముందు గౌరవనీయులైన మంత్రిగారితో యిష్టాగోష్టిగా మాట్లాడే అవకాశం దొరికింది వారు అప్పుడు హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభలలో ఈ decentralisation అన్న సిద్ధాంతాన్ని గురించి మాట్లాడినామని తెలియ చేశారు వారు తెలియచేసిన విషయానికి ఇందులో వున్న క్లాజులకు ఎలాంటి సంబంధము లేదు ఈ dictatorship గాని ఈ monarchy గాని చూచినపుడు అధికారము కొంతమంది చేతులలో, కొన్ని సంస్థల చేతులలో కేంద్రీకరింపబడి వున్నట్లు కనబడుతున్నది. పరిపాలన చేయు వ్యక్తులను ఎదుర్కొంటున్న సమస్య ఇది స్వేచ్ఛాయుతమైన ప్రజాస్వామిక సిద్ధాంతము అమలు జరగా లంటే ప్రజలకు యీ అధికారములన్నీ ఒప్పగించాలి ప్రజాస్వామికమును అనుస రించిన దేశాలు వారి Constitution వ్రాసుకొన్నపుడు ఈ సిద్ధాంతాన్ని అనుస రించాయి ఈ సిద్ధాంతము రెండు విషయాలను స్పష్టపరుస్తున్నది Parliament లేక కేంద్రప్రభుత్వము, రాష్ట్రము, రాష్ట్ర) ప్రభుత్వము వారికి సంబంధించిన హక్కులు, వారు చేయవలసిన బాధ్యతలు—అనేవిషయములు స్పష్టపరచబడినవి అది యింతవరకు ఉన్న వ్యవస్థ ఈ వ్యవస్థ పరిపూర్ణ ప్రజాస్వామిక వ్యవస్థ

కాదని ఆలోచించితే, పటిష్ఠ ప్రజాస్వామిక వ్యవస్థ రూపొందించవలసినదిగా ఆలోచనలు జరిగే పరిస్థితులలో ఆ రోజున వారి అభిప్రాయాలు, concept, కొద్దోగొప్పో ఆ మార్గంచూసే అవకాశం ఉన్నదని నేను ఆలోచనచేశాను ప్రజాస్వామికం అంటే వాళ్ళ అభిప్రాయాలకు అనువుగా వ్యక్తులను ఎన్నుకొని పంపించడమే కాదు ప్రజాస్వామికం అంటే అధికారంలో కూడ భాగస్వాములుగా ఉండి ఆ సిద్ధాంతాన్ని అనుభవంలో పెట్టె అవకాశం లభించాలి ఆ concept తో దీనిని తయారుచేశారని అనుకొన్నాను కాని దానికి ఈ చట్టానికి సంబంధంలేకుండా ఉన్నది మచ్చుకైనా యిందులో లేక పోవడం విచారకరమైన విషయం ఒకటిమాత్రం చేశారు ఒకఅభిప్రాయానికి ప్రచారం యిచ్చినట్లే యిచ్చి వెనక్కు తీసుకొన్నారు తాలూకాల్లో, జిల్లాల్లో వికేంద్రీకరణ జరుపుతున్నట్లు చూపించారు అక్కడ తమ మనుష్యులను పెట్టు కొన్నారు, కలెక్టర్సును పెట్టుకొన్నారు బ్లాక్ ఆఫీసర్సును పెట్టుకున్నారు ఎంతో ప్రచారం జరిగింది బలవంతరాయ్ కమిటీని నియమించి విచారణ చేసి నట్లేచేసి వికేంద్రీకరణ జరుగుతుందని ప్రచారం చేయించారు వారు ఎన్నో సిఫారసులు చేశారు నిన్న మంత్రిగారు వీటి ప్రసక్తి తెచ్చారు అందులో ముఖ్యమైనవి చదువుతాను ఆ సిఫార్సులననుసరించి యీ బిల్లును తయారు చేశామని మంత్రిగారు చెప్పారు అందులో- యీ వికేంద్రీకరణ ఎందుకు అవసరమయినదీ, యీ పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తులు ఎందుకు చేయ వలసివచ్చినదీ చెప్పారు

"People's participation is not merely their providing a certain proportion of the cost of a particular work in cash, kind or manual labour It is their full realisation that all aspects of community development are their concern and the Goverment's participation is only to assist them where such assistance is necessary It is the gradual development of their faith in the efficacy of their own cooperative action in solving their local problems This attitude can be developed by close mutual cooperation between the different sections of the community Such participation is possible only through the organisation of co-operative institutions and of elective democratic institutions '

ఇంకొక సిఫార్సు ఈ విధంగా ఉన్నది -

"So long as we do not discover or create a representative and democratic institution which will supply the local interest, supervision and care necessary to ensure that expenditure of money upon local objects

conforms with the needs and wishes of the locality, invest it with adequate power and assign to it appropriate finances, we will never be able to evoke local interest and excite local initiative in the held of development

In such a structure the functions of the popular body include the entire general administration and development of the area, other than such functions as law and order, administration of justice and certain functions pertaining to the revenue administration. We have now to examine whether the existing local bodies can take over and perform these functions and, if not, what new bodies should be created and with what jurisdiction, powers and resources."

ఈ విధంగా ప్రశ్నవేసుకుంటూ ,క ని తమైన సిఫార్సుచేశారు -

"With this background, we have to consider whether time has not arrived to replace all these bodies by a single representative and vigorous democratic institution to take charge of all aspects of development work in the rural areas. Such a body, if created has to be statutory, elective, comprehensive in its duties and functions, equipped with necessary executive machinery and in possession of adequate resources It must not be cramped by too much control by the Government or government agencies It must have the power to make mistakes and to learn by making mistakes In the ultimate analysis, it must be an instrument of expression of the local people's will in regard to the local development.

This body can function effectively only if it is the sole authority for all those development programmes which are of exclusive interest for the area In such matters the state government will cease to operate within the area and in special circumstances when it has to do so through the agency of this local body"

ఇది ముఖ్యమైన సిఫార్సు స్టేటు గవర్నమెంటు ప్రాధాన్యం తగ్గించి అధికారాలసు యీ పంచాయితీలు, జిల్లాపరిషత్తుల చేతుల్లో పెట్టదలచుకొన్నారు **Army, Police, Foregin Affairs, Justice, Law and Order** మొదలైన వ్యవహారాలు మినహాయించి మిగతా అధికారాలు జిల్లాపరిషత్తులకు, పంచాయితీలకు యిచ్చి వాళ్ళే దానికి సంబంధించిన **administration**

అంతా చేసుకొనేట్లు సిఫార్సు చేశారు ఆ సిఫార్సులకు యీ బిల్లుకు ఏమైనా సంబంధం ఉన్నదా ? అని అడుగుతున్నాను-- పంచాయితీ సమితులలో బ్లాక్ అఫీసర్సుకు అన్నిహక్కులు యిచ్చారు పంచాయితీ సమితులుచేసిన తీర్మానాలు వారు sabotage చేసి నిలిపివేయడానికి అధికారం యిచ్చారు జిల్లాపరిషత్తుకు జిల్లాకలెక్టరును చైర్మన్‌గా చేశారు ఆ పరిషత్తుచేసిన resolution చైర్మన్‌కు వ్యతిరేకంగాపోతే ఆ చైర్మన్ దానిని sabotage చేయుటకు, suspend చేయుటకు, గవర్నమెంటు పర్మిషన్ తీసుకొని దానికి రూపనామక్రియ లేకుండా చేయుటకు provide చేశారు ఇందులో ఒకదానికొకటి paradoxical గా ఉన్నది బలవంత్‌రాయ్ కమిటీచేసిన సిఫార్సులలోని decentralisation సిద్ధాంతానికి, ఈ బిల్లుకు ఏలాంటి సంబంధం లేకుండా ఉన్నది ఆ విధంగా ప్రజలలో ఒక వాతావరణం కలిగించాం కాబట్టి, దగాచేసి మళ్ళీ అధికారాన్ని సంపాదించుకొనుటకు చేస్తున్న ప్రయత్నంలా కనబడుతోందిగాని మరొకటిలేదు జిల్లా కలెక్టర్లుకు అధికారం యిస్తున్నారు ఆ అధికారంలో వారు objective దృష్టితో administration ను నడుపుతారనే విశ్వాసం ఎవరికైనా ఉన్నదా? అని అడుగుతున్నాను మా జిల్లాలో జరిగే వ్యవహారాలు చూస్తే యీ విధంగా ఆఫీసర్లకు అధికారాలు యివ్వడం పొరపాటని తేలి పోయింది ఆఫీసర్లు కేవలం కూలీలుగా, chauffers గా valets గా మినిస్టర్సుకు పనిచేస్తున్నారేగాని ప్రజాస్వామిక సిద్ధాంతాలకు అనుగుణ్యంగా ప్రవర్తిస్తూ ప్రజలకు ఉపయోగ పడుతున్నారా అని అడుగుకున్నాను కేవలం valets గా పని చేస్తున్నారని మంత్రిగారికి మనవిచేస్తున్నాను

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ అధ్యక్షా ! మంత్రిగారు నిన్న పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తుల బిల్లును ప్రవేశపెడుతూ దాని ఉద్దేశం వికేంద్రీ కరణమని, ఆ సంస్థలను ప్రజాస్వామిక ప్రాతిపదికపై build up చేయాలనే ఉద్దేశం వెలిబుచ్చారు బ్రిటిషు ప్రభుత్వ పరిపాలనలో వికేంద్రీకరణము లేకుండెను అధికారం అంతా ప్రభుత్వం చేతుల్లో కేంద్రీకృతమై ఉండెడిది అప్పట్లో ప్రజల initiative గాని, ఉత్సాహంగాని ప్రభుత్వ కార్యక్రమాలలో లేదు మంచినీటి బావులు కావాలన్నా, రోడ్లు కావాలన్నా, చిన్న స్కూలుబిల్డింగు కావాలన్నా ప్రభుత్వముపైననే ఆధారపడి ఉండేవారు అయితే స్వాతంత్ర్యం పొందిన తరువాత గాంధీగారి ఆశయములకు అనుగుణ్యంగా ఉండవలెనని, గ్రామాలను స్వయంపోషకాలుగా చేయాలని కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమా లను తలపెట్టాము ఈ కార్యక్రమాలలో ప్రజలు ఉత్సాహవంతంగా పాల్గొనడం, వీటియందు ఎక్కువ శ్రద్ధ చూపడం మనము చూస్తున్నాము శ్రమదానం, సంపత్తిదానంద్వారా అధికారులను ప్రజలు మాటిమాటికి మా ఊరికి స్కూలు

బిల్డింగు కావాలని, హాస్పిటల్ కావాలని, మంచినీటి వసతులు కల్పించమని, కమ్యూనిటి సెంటర్సు, మహిళా సెంటర్సు స్థాపించమని ప్రభుత్వ ఉద్యోగులను వత్తిడి చేస్తున్నారు ప్రభుత్వమునకు తెలుసు దానినిబట్టి మన దేశములో ప్రజలు, నిర్మాణ కార్యక్రమములలో, గ్రామ అభివృద్ధి కార్యక్రమములలో ఎంత ఉత్సాహాన్ని కనపరుస్తున్నారో, ఎంత సమర్థవంతంగా పాల్గొంటున్నారో మనము చూడగలుగుతున్నాము

భారతదేశములో పంచాయితీలచరిత్ర తీసుకుంటే, ప్రాచీన కాలములో పంచాయితీల చేతుల్లో పూర్తి అధికారాలు ఉండేవనే సంగతి మనకు తెలియ వస్తుంది మనదేశములో పంచాయితీలు ఎంతో జయప్రదంగా నిర్వహింప బడటం చూచి ఇతర దేశాలవారు కూడ ఆశ్చర్యపడినారు, విస్మయంచెందారు ఈ విషయం H D మాలవ్యా గారి పుస్తకంలో విదేశీయులు మన దేశంలో పంచాయితీలు గ్రామ సమస్యలను ఎంత తెలివిగా పరిష్కరించుకొనేవో చూచి విస్మయం చెందినట్లు వ్రాశారు —

"The whole village system indicates how power of Government can be divided up into hierarchical spheres of activity where each sphere with its quantum of allotted power can be made to function autonomously."

గాంధీజీ పాట్నాలో ఒక ప్రేయర్ మీటింగ్‌లో స్త్రీ పురుషులు తమ బాధ్యతనిర్వహించటమే పంచాయితీ రాజ్యము యొక్క ఆశయమని చెప్పారు

"Indian independence must be taken at the bottom Thus, every village will be a Republic or Panchayat having full powers."

జుడిషియల్, ఎగ్జిక్యూటివ్, లెజిస్లేచర్ పవర్స్ అన్నీ యీ పంచాయితీలకు ఉండాలని గాంధీజి అభిప్రాయము దీనినిబట్టి దేశములోని అభివృద్ధి కార్యక్రమాలలో పంచాయితీల యొక్క పాత్ర చాలా ముఖ్యమైనదని అర్థం అవుతుంది "ప్రభుత్వం జిల్లా పరిషత్‌ల బిల్లు తీసుకువస్తున్నది, విప్లవాత్మక మైన మార్పులు దేశంలో రాబోతున్నవి, అధికారాలన్నీ మీ చేతిలో ఉంచ బోతున్నాము" అని మనం మన గ్రామాలలోని ప్రజలకు చెప్పాము ఇప్పుడు యీ బిల్లు చూసిన తర్వాత, మనం తిరిగి ప్రజల దగ్గరకు వెళ్లి ఏమి చెప్పు కోవాలో అర్థం కావటంలేదు ప్రజల చేతిల్లో అధికారం పెడితే ఏమి ముప్పు వాటిల్లుతుందోననే భయంతో యీ బిల్లును తయారు చేశారు వారికి అధికారాలు ఇవ్వటానికి భయపడుతున్నట్లుగా యీ బిల్లుద్వారా తెలుస్తున్నది పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్‌లు కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రామ్‌లో ఎక్కువ బాధ్యత నిర్వహించవలసి ఉంటుందని యీ బిల్లులో

చెప్పారు అది కొంతవరకు తెలివైనపని అనే చెప్పాలి స్థానిక సంస్థలు నిర్మాణ యుక్తంగా పనిచేసే విధానం యీ బిల్లుద్వారా తెలుసుకోగలుగుతాయి దానివల్ల ప్రజలుకూడ తమ బాధ్యతలు గుర్తించ గలుగుతారు ప్రజలకు అధికారం అప్పగించటానికి ప్రభుత్వం భయపడటంవల్ల పంచాయితీ సమితి మెంబర్సులో, అధ్యక్షులలో నిరుత్సాహం ప్రబలగలదేమోనని అనుమానం వేస్తున్నది ఏ ఏ రంగాలలో మనం ప్రజలకు అధికారం అప్పగించ దలచామో, వాటన్నింటిలో వారికి పూర్తి స్వేచ్ఛ ఇవ్వాలని కోరుతున్నాను ఒకవేళ వారు ఏవైనా తప్పులు చేసినప్పటికీ, తప్పులు చేయటంద్వారా వారు ఎన్నో మంచి విషయాలు నేర్చుకోగలుగుతారు డెమాక్రసీలో తప్పులు చేయటానికి అధికారం ఉంది చేసిన తప్పులు దిద్దుకోటానికి కూడ అవకాశం ఉన్నది ప్రజలు మన మాస్టర్స్ వాళ్లు మనలను ఎన్నుకొని ఇక్కడకు పంపించారు వారు మనలను ఎన్నుకొని పంపటంలో ఏదైనా తప్పుచేశారా? వారు మనలను ఎన్నుకొని పంపటంలో ఏమీ తప్పు చేయలేదు ప్రజలు సమర్ధవంతులు వారు తెలివిగా ఆలోచించగలరు అన్ని విషయాలు వారికి తెలుసు కాబట్టి వారిని గురించి మనం భయపడవలసిన అవసరము లేదు ఒకవేళ వారు ఎప్పుడైనా తప్పు చేస్తారేమో అనుకొంటే, అలాంటి తప్పులు మనంకూడ అప్పుడప్పుడు చేస్తూ ఉంటాం కాబట్టి తప్పులు చేస్తారేమోననే సాకుతో మనం అధికారాన్ని పూర్తిగా వారి చేతులలో పెట్టటానికి భయపడవలసిన అవసరము లేదు బిల్లులోని 21 వ సెక్షన్ ప్రకారము పంచాయితీ సమితి సిబ్బంది బి డి ఒ అధికారం క్రింద ఉంటుంది ఆయన చేతిలో ఎడ్మినిస్ట్రేటివ్ కంట్రోల్, సూపర్‌విజన్ కంట్రోల్ ఉంటాయి ఆయన సమితి చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ బి డి ఒ స్టాఫ్ పైన డిసిప్లినరి యాక్షన్ తీసుకోవచ్చును 21 వ సెక్షన్ ప్రకారం ఆయనకు కొన్ని ఎమర్జెన్సీ పవర్స్‌కూడ ఉన్నవి ఇవి విభేదాలకు తావుఇస్తుంది మనము సమితియొక్క కలెక్టివ్ విజ్‌డమ్‌ను ట్రస్ట్‌చేయకుండా (సమితి అంటే ఇంతమంది పంచాయితీ అధ్యక్షులయొక్క సమూహము) ఏదో ఒక ఆఫీసర్ మాత్రమే ప్రజల ఇంటరెస్ట్‌లో పనిచేస్తాడని, యీ పవర్స్ అన్ని ఆ ఆఫీసర్ చేతిలో పెట్టడం సమంజసమైంది కాదు It is an insult to the collective wisdom of the Samithi. మనము వికేంద్రీకరణ సూత్రానికి ప్రాధాన్యత ఇస్తున్నాము కాని అన్ని పవర్స్ ఒక ఆఫీసర్ చేతిలో పెడుతున్నాము 1917 వ సంవత్సరంలో కలకత్తా కాంగ్రెసులో శ్రీమతి యానీబిసెంట్‌గారు ఈ విధంగా చెప్పారు—

"Tie up a baby's arms and legs and then leave it to teach itself to walk If it does not succeed, then

blame the baby The free baby will learn equilibrium through tumbles The tied up baby will become paralysed and will never walk "

ఒక ఆఫీసరు పై అధికారిక్రింద పనిచేయటమువల్ల అతడు గ్రామస్థుల వైపు చూడకుండా ఆఫీసర్ వైపు చూస్తాడని, అది మంచిదికాదని ఆవిడ చెప్పింది చాంబర్ ఆఫ్ మ్యునిసిపల్ చైర్మన్ ఎగిక్యూటివ్ స్టాఫ్ మీద అధికారాలు సమితికి ఉండాలని తీర్మానాలు చేసింది ఒక చేతితో అధికారాలు ఇచ్చి, ఇంకొక చేతితో ఆ అధికారాలను తీసుకొంటున్నారని రత్నసభాపతిగారు అన్నారు వారు చెప్పినదానితో నేను ఏకీభవిస్తున్నాను 30 వ సెక్షన్ క్రింద గవర్నమెంటుకు సమితి Chairman ను తీసివేయటానికి అధికారం ఉంది అయితే అది అత్యవసర సమయంలోగాని ఉపయోగించరని అంటున్నారు It should be sufficient safeguard against abuse of powers

ఒక స్త్రీని మాత్రమే పంచాయతీసమితిలో కో-ఆప్ట్ చేయటం గురించి చాలా మంది చెప్పారు స్త్రీలు సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడిఉన్నారన్న సంగతి కాన్‌స్టిట్యూషన్‌కూడ గుర్తించింది స్త్రీలు కమ్యూనిటీ డెవలప్‌మెంటు కార్యక్రమాలలో ఉపయోగపడతారు కాబట్టి, ఎక్కువమంది స్త్రీలను పంచాయితీ సమితులలో కో-ఆప్ట్ చేసుకోవాలని నేను కోరుతున్నాను పంచాయితీ సమితి అధ్యక్షుడు నాన్ అఫిషియల్, జిల్లాపరిషత్ అధ్యక్షుడు కలెక్టర్ ఇంకా కలెక్టర్ ఉద్దేశ్యంలో, దృక్పథంలో మార్పు రాలేదు అనేది ఈమధ్య జరిగిన కొన్ని సంఘటనలవల్ల నిరూపణ అయినది నాన్ అఫిషియల్ సభ్యుడే జిల్లా పరిషత్‌కు కూడ అధ్యక్షుడుగా ఉండాలి . .

శ్రీ ఎ బి నాగేశ్వరరావు (రాజమండ్రి) అధ్యక్షా, జిల్లాబోర్డులు రద్దు చేసి సుమారు ఏడు సంవత్సరాలు అయినప్పటికీ, ఇప్పటికైనా ఏదో ఒక రూపంలో ఈ బిల్లు తీసుకురావటం చాలా సంతోషము కాని బల్వంతరాయ్ మెహతా కమిటీవారు ఆశించిన ఆశయాలు మాత్రం ఈ బిల్లులో ఎక్కడా కనుపించటంలేదు అధికార వికేంద్రీకరణ చేయుటకు ఈ బిల్లు తెస్తున్నామని మంత్రిగారు వారి ఉపన్యాసములో చెప్పారు కాని ఈ బిల్లుచూస్తే ఒక విషయం బోధపడుతుంది అన్ని పవర్సు ప్రభుత్వంలోనే కేంద్రీకరింపబడ్డాయి. చాలాకాలంనుండి పంచాయితీలలో, మునిసిపాలిటీలలో పవర్స్ అన్నీ ఒక ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు చేతిలో పెడుతున్నారు ప్రజాస్వామ్యంలో, ప్రజలచేత ఎన్నుకోబడిన సభ్యులయందు నమ్మకము ఉంచి వారిచేతులలో ఈ పవర్సు పెట్టాలని చాలాకాలంనుండి పంచాయతీలు, పురపాలక సంఘాలు అందోళన చేస్తున్నాయి

ఇప్పుడు యీ బిల్లు చూ స్తే, మనం సుమారు 1930 సంవత్సరంకు వెనక్కు వెళ్ళామేమోనని మనం అనుకోవలసివస్తున్నది ఒకప్రక్క పంచాయితీ సమితులకు అధ్యక్షులను పంచాయితీ అధ్యక్షులచేత ఎన్నుకోబడాలని చెప్పాము రెండవ ప్రక్క జిల్లా పరిషత్‌లకు జిల్లా కలెక్టర్‌ను అధ్యక్షుడుగా పెడతారని చెప్పాము సుమారు ఆరు మాసాలనుండి, ఒక్కొక్క జిల్లాలో ఒక పంచాయితీ సమితి పనిచేస్తున్నదని, అవి సక్రమంగా అభివృద్ధికరంగా పనిచేస్తున్నాయని మంత్రిగారు తమ ఉపన్యాసంలో చెప్పారు కాని అవి చాలా అన్యాయంగా నడుస్తున్నాయని, అధికారాలన్నీ బి డి ఓ చేతిలో ఉన్నాయని, ప్రెసిడెంటుకేమీ పవర్స్ లేవని ప్రెసిడెంటుకు కాగితాల మోత తప్ప, మీటింగుకు అధ్యక్షత వహించటం తప్ప, అధ్యక్షులకు గాని, మెంబర్సుకు గాని ఏమి అధికారాలు లేవని కొన్ని పంచాయితీ సమితుల ద్వారా నేను తెలుసుకొన్నాను కనుక మంత్రిగారు సెలక్టు కమిటీ పరిశీలన సమయంలో యీ విషయాలన్నీ జాగ్రత్తగా ఆలోచించి, యీ అధికారాలన్నీ ప్రత్యేకంగా అనధికారులకు ఇచ్చి, వారు పంచాయితీ సమితులలో, జిల్లా పరిషత్‌లలో ఎలా పరిపాలన చేస్తారో చూడవలసిఉన్నది కావలసివస్తే ఫైనాన్సియల్ కంట్రోలు అథారిటీ ప్రభుత్వం చేతిలో ఉంచుకొనవచ్చును

పంచాయితీ సమితులలో పంచాయితీలు లేనిచోట జిల్లా కలక్టరులు నామినేటు చేస్తారని, జిల్లా పరిషత్తులలో పంచాయితీ సమితులు లేనిచోట బ్లాకులలో నామినేటు చేస్తారని అంటున్నారు దీనినిబట్టి నామినేటెడ్ మెంబర్సు ఎక్కువమంది కనబడుతున్నారు కాని ఎన్నుకోబడిన అధికారులు తక్కువమంది ఉంటున్నారు కొన్ని బ్లాకులలో పంచాయితీలు ఉన్నాయి, పంచాయితీ సమితులలో నాన్-రిప్రజెంటేషన్ వున్న పంచాయితీల అధ్యక్షులచేత ఎన్నుకోబడితే బాగుంటుంది కాబట్టి, ఆ విధంగా ఏర్పాటు చేయవలసినదిగా కోరుతున్నాను

జిల్లా పరిషత్తులలో జిల్లా కలక్టర్లు అధికారులుగా, అధ్యక్షులుగా వుండడం మాత్రం చాలా అన్యాయం, అక్రమం ఒక ప్రక్కన డెమోక్రసీ అని చెబుతూ రెండవ ప్రక్కన వారికి అధికారాలు ఇవ్వడం మంచిదికాదు జిల్లా కలక్టరులు ప్రభుత్వానికి బాధ్యులు కాబట్టి, జిల్లాలో ఏమి జరుగుతున్నదో వారికి తెలియాలి కాబట్టి వారిని అధ్యక్షులుగా పెట్టుతున్నామని చెప్పారు కాని, యీ సభలో రెండు సంవత్సరములనుంచి జరుగుతున్న వ్యవహారాన్ని బట్టిచూస్తే జిల్లా కలక్టరులు, స్పెషల్ ఆఫీసరులు జిల్లాబోర్డులను ఎట్లా పరిపాలిస్తున్నారో, ఎన్ని అక్రమాలు చేస్తున్నారో తెలుస్తుంది చాలమంది సభ్యులు యీ విషయంగురించి ఇక్కడే అనేక మార్లు చెప్పడం జరుగుతున్నది ఎప్పటికప్పుడే జిల్లా బోర్డులను రద్దుచేస్తామని చెబుతూకూడ యీవిధంగా చేయడం

సమంజసంగాదు పంచాయితీ సమితికి పంచాయితి అధ్యక్షులే సభ్యులుగా వుండాలనివున్నది కో-ఆపరేటివ్ ఫక్షులోకూడ అధ్యక్షుడుగాని, వారిచేత పంపబడిన డెలిగేట్‌గాని అధ్యక్షులుగా వుండవచ్చునని వున్నది జిల్లా పరిషత్తు లలోకూడ పంచాయితీ సమితి అధ్యక్షులే సభ్యులుగా కావాలనివున్నది పంచాయితీ సమితివారు ఒప్పుకొన్నట్లయితే ప్రెసిడెంటుమాత్రమే కాకుండా, వారు పంపిన డెలిగేట్ కూడ దీంట్లో సభ్యులుగా వుండడానికి ఏమి అభ్యంతరము వున్నదో నాకు అర్థంకావడంలేదు పంచాయితీ సమితి అధ్యక్షుడు జిల్లా పరిషత్తులో మెంబరుగా వుండడానికి ఏకారణంచేతనైనా నిరాకరించినట్లయితే పంచాయితీ సమితి అధ్యక్ష పదవికూడ పోతుందని ఒక స్కీనులో వ్రాయబడి వున్నది ఇది చాలా అన్యాయమైన విషయం ఏ పంచాయితీ ప్రెసిడెంటు అయినా పంచాయితీ సమితిలో మెంబరు అయితే ప్రెసిడెంటు పదవి పోతుం దనడం చాలా అన్యాయం బ్లాక్ డెవలప్‌మెంటు పనులన్నీ కూడ పంచాయితీలకు అప్ప జెప్పుతామని ఒకవైపున చెబుతూ రెండవ ప్రక్కన పంచాయితీలను తీసుకుపోయి బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుల, డిస్ట్రిక్టు ప్లానింగ్ ఆఫీసరుల చేతులలో పెట్టడం జరుగుతున్నదే తప్ప బల్వంతరాయ్ కమిటీ సూచనల ప్రకారం ఏమీ జరుగుటలేదు

ఒక మెంబరు రిజిగ్నేషన్ ఇచ్చినా, ప్రెసిడెంటు రిజిగ్నేషన్ ఇచ్చినా, అది బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరుకు చేరగానే ఆటోమేటిక్‌గా సీజ్ అవుతుం దనడం న్యాయంకాదు మా అనుభవంలో ఫోర్జరీచేసి పంపబడిన అనేక రిజిగ్నేషన్ లెటర్సు ఉండడం చూస్తున్నాము కాబట్టి, మెంబరు అయినా, ప్రెసిడెంటు అయినా కాని రిజిగ్నేషన్ ఇవ్వాలంటే పర్సనల్‌గా బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు దగ్గరకు వెళ్ళి రిజిగ్నేషన్ లెటర్ ఇవ్వాలని పెట్టినట్లయితే కొంతవరకు బాగుంటుంది లేక, రిజిగ్నేషన్ లెటర్ చేరగానే, ఆ మెంబరును పిలిపించి స్టేట్‌మెంట్ రికార్డు చేయవలసివుంటుంది. ప్రతి పంచాయితీ సమితిలో కూడ రెండు పార్టీలు ఉంటున్నాయనే విషయం అందరికీ తెలిసినదే ఎదుటి పార్టీలో వున్నవారిని తొలగించాలంటే యీ పార్టీవారు ఒక ఫోర్జరీ చేసి రిజిగ్నేషన్‌లెటర్ పంపించుతూవుంటారు. ఆ లెటర్ అందగానే సభ్యత్వం పోతుందనడం న్యాయంకాదు దానిని సవరించవలసిన అవసరం వున్నదని మనవిచేస్తున్నాను

ఇక, స్టాండింగ్ కమిటీలను ఏర్పాటుచేయాలన్నారు వాటి పవర్స్ గురించి కూడ బిల్లులో చెప్పినారు ఆ పవర్స్ అన్నీ కూడ నామినల్‌గా వుంటాయి తప్ప ఎమర్జెన్సీ పవర్స్ అన్నీ కూడ బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుల చేతిలోనూ, సెక్రటరీల చేతిలోనూ, కలక్టరుల చేతిలోనూ పెట్టినారు

స్టాండింగ్ కమిటీల యొక్క ప్రొసీడింగ్స్ రాటిఫై చేయడానికి జిల్లా పరిషత్తు ముందు పెడతారో, పంచాయితీ సమితి ముందు పెడతారో— వివరాలేమీ లేవు ఇన్ఫర్మేషన్ అయినా తెలియజేస్తారో లేదో తెలియదు ఒకవేళ వారి యొక్క పవర్స్ ఫైనల్ అవుతాయా? పంచాయితీ సమితులకు బై-లాస్ ఫ్రేమ్ చేసే ఒక్క సందర్భంలో మాత్రమే ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్‌ను కన్సల్ట్ చేయాలని 62 వ సెక్షనులో వున్నది అంతకు తప్ప డిపార్టుమెంటు యొక్క హెడ్‌కు ప్రాముఖ్యత ఈ బిల్లులో ఏమీచూపించలేదు

ఇదివరకు ఒక్కొక్కజిల్లాలో ఒక జిల్లా పంచాయత్ ఆఫీసరు, అసిస్టెంటు పంచాయత్ ఆఫీసరు, తాలూకాకు ఒక డిప్యూటీ పంచాయత్ ఆఫీసరు ఉండే వారు ఇప్పుడు, యీ బిల్లు ప్రకారం ఒక్కొక్క పంచాయితీలో ముగ్గురు, నలుగురు డివిజనల్ పంచాయితీ ఆఫీసర్సు ఏర్పడుతున్నారు వీరుగాక, ఒక్కొక్క ఫిర్కాకు ఒక్కొక్క డిప్యూటీ పంచాయత్ ఆపీసరు, జిల్లా పంచాయత్ ఆఫీసరు—వీరందరూ వుంటారు ఎస్టాబ్లిష్‌మెంట్ మాత్రం చాల పెరిగి పోతున్నది యీ పంచాయితీ ఆఫీసరులనందరినీ ఎక్కడ ఎబ్జార్బ్ చేస్తారో నాకు అర్థం కావడంలేదు ఒక్కొక్క పంచాయితీ సమితిలో 30 మొదలు 60, 80 గ్రామాలదాకా వుంటాయి ఒక్కొక్క సమితికి 8, 9 మంది ఆఫీసరులు ఉంటున్నారు 'బ్లాక్ డెవలప్‌మెంటు పేరుపెట్టి మనం ఇచ్చే డబ్బంతా యీ ఆఫీసరులు తినేయడానికా?' అని ప్రజలు అనుకొంటున్నారు ప్రభుత్వం చేసే యీ కార్యక్రమంలో ప్రజోపయోగంకోసం ఎంత ఖర్చు అవుతున్నది, ఆఫీసరులకు ఎంత ఖర్చు అవుతున్నది అని ప్రజలు శాసనసభ్యులను, అక్కడ వున్న పెద్దలను నిర్మొగమాటంగా అడుగుతున్నారు ఖర్చు చేసే డబ్బంతా దండుగ తప్ప, ప్రజలకు ఏమీ ఉపయోగంలేదని పబ్లిక్ ఫీలింగ్ వున్నది ఇంకా వివరాలలోనికి వెళ్ళినట్లయితే— కమ్యూనిటీ డెవలప్‌మెంటు, నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీసువల్లగాని— వీటికి అనేకకోట్ల రూపాయలు ఖర్చుపెట్టినా— ప్రజలకు ఏమీ సౌకర్యాలు కలగడంలేదని, కించిత్ పని అయినా జరగడంలేదని ప్రజలు చాలమంది అనుకోవడం తటస్థిస్తోంది ఇంకా మైనర్ డిటైల్స్ చాల ఉన్నాయి క్లాజువారీ చర్చ వచ్చినప్పుడు నేను వివరంగా మనవిచేస్తాను. సెలక్టు కమిటీలో అయినా, బల్వంతరాయ్ మెహతా కమిటీ సూచనలను, డెమోక్రసీ అనే సిద్ధాంతాన్ని దృష్టియందుంచుకొని యీ బిల్లులో పొందుపర్చ వలసినదిగా మంత్రిగారిని కోరుతూ సెలవు తీసికొంటున్నాను

**శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య** అధ్యక్షా, వికేంద్రీకరణ అనేది చాల కాలంనుంచి కలలు కంటున్నది దానినిగురించి మెహతాగారి ఆధ్వర్యాన ఒక టీమ్ వేశారు వారు అంధకారంలో బయలుదేరినారు అంధకారంలో

బయలుదేరి మద్రాసువచ్చేసరికి కాస్త వెలుగువచ్చింది దానికి కారణం 138 వ పేజీలో క్లియర్‌గా చెప్పబడినది

"During the past decade, the problems of local bodies have received, even less attention than before and indeed on the whole, the period has been one of retarded development in the field of local self-Government"

ఆ తరువాత అదే పేజీలో జిల్లాబోర్డులకున్న అధికారాలను తీసివేయాలని చెప్పారు జిల్లాబోర్డులను ప్రొవిన్షియలైజ్ చేయడమనే పేరుతో, జిల్లాబోర్డుల రోడ్డులు మొదలయినవి ప్రభుత్వం స్వాధీనం అయినందువల్ల సౌకర్యాల విషయం ఎలావున్నా జిల్లాబోర్డులు రద్దుఅయితే ఆఫీసరులకు ఇచ్చే జీతాలయినా మిగులుతాయనే ఉద్దేశంతో అందరుకూడ సంతోషించారు

"The Constitution has provided for democratic institutions at the Centre and in the States, but so long as local self-governing institutions are not conceived as parts of the same organic constitution and executive framework, the structure of the Government will remain incomplete"

ఈ సిద్ధాంతాలతో జిల్లాబోర్డులకు ఇప్పుడున్నటువంటి ప్రాణంపోయే విధానంలో పరిపాలన నడపాలనిచెప్పారు అదే సమయంలో జిల్లాబోర్డులను ఏమి చేయాలిఅనేసమస్యవచ్చినప్పుడు మద్రాసు రాష్ట్రంవారు కృష్ణకుట్టినాయర్ అధ్యక్షతన ఒక కమిటీని వేశారు వారు జిల్లాబోర్డులు ఉండాలి అన్నారు దానిమీద సలహాలు ఇవ్వమని సెక్రెటేరియట్ వారిని అడిగితే వారు ఒక్క జవాబుకూడ ఇవ్వలేదు మలబారులో కాంగ్రెసుకు వ్యతిరేకపార్టీవారు జిల్లాబోర్డులో అధికారంలోకి వచ్చినందువల్ల అక్కడి జిల్లాకలెక్టరు ఒక క్రొత్తనిర్ణయం చేశారు అది జిల్లాబోర్డులను రద్దుచేయాలని, బ్లాక్ డెవలప్‌మెంట్ ఏరియాలలో పంచాయితీ సమితులను ఏర్పాటుచేస్తే బాగుంటుందని చెప్పినారు మద్రాసురాష్ట్రం వారు పంచవర్షప్రణాళికను తయారుచేసేటప్పుడుకూడ ఈ విధానాన్ని ప్రాతిపదికగా తీసుకున్నారు బల్వంతరాయ్ మెహతా కమిటీ మద్రాసు వచ్చినప్పుడు వారి సలహాలనుకూడ పరిశీలించారు

"Very recently, a study team appointed by the Committee on Plan Projects set up by the Planning Commission visited the State and discussed with the State Government its conclusions regarding the progress of democratic decentralisation and the future pattern of administration in the State. It was found that there

was a large measure of agreement between the conclusions already reached by the Committee and the conclusion reached by the All-India Body."

ఇవన్నీ బల్వంతరాయ్ కమిటీవారు స్వంతంగా ఆలోచించి చేసిన నిర్ణయాలు కాదు మద్రాసు గవర్నమెంటువారు చెప్పిన సలహాలను ఈ కమిటీ వారు దాదాపుగా ఒప్పుకున్నట్లు వారి రిపోర్టులోనే చెప్పినారు బ్యురాక్రటిక్ విధానాన్ని డెమోక్రాటిక్ డిసెంట్రలైజెషన్ విధానంలోకి చొప్పించడానికి ఆలోచించి విపరూపంలో తయారుచేసిన వికృతరూపం ఇది అని చెప్పకతప్పదు

ఈ రిపోర్టుప్రకారం జిల్లాలలో అధికారులకు చాల అధికారాలున్నాయి

"Such a body, if created, has to be statutory, elective, comprehensive in its duties and functions, equipped with necessary executive machinery and in possession of adequate resources"

ఇది పంచవర్షప్రణాళికను అమలుపరచడానికి చేస్తున్న ప్రాతిపదికయా, లేక ఉన్నటువంటి పరిపాలనను డిసెంట్రలైజ్ చేస్తున్నటువంటిదా? ఇదివరకు బ్లాక్ డెవలప్‌మెంటుకమిటీలను నడుపుతున్నారు వాటిని సబ్‌స్టిట్యూట్ చేయడానికి యిప్పుడు పంచాయితీ సమితులను తెచ్చామని చెబితే వాటికంటె ఇవి మెరుగేనని ఒప్పుకోకతప్పదు

కానీ జిల్లా పరిపాలనా విధానంలో decentralisation తీసుకొనివచ్చి democratic functions అమలు చేస్తున్నాము అంటే, ఇదిమాత్రం అందుకు దోహదంకాదు శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూగారు స్వరాజ్యం వచ్చిన వెంటనే

"It must not be crammed by too much control by the Government or Governmental agencies. It must have the power to make mistakes and to learn by making mistakes, but it must also receive guidance which will help it to avoid making mistakes In the ultimate analysis, it must be the instrument of expression of local people's will in regard to local development"

"Local Self-Government is and must be the basis of any true system of democracy. We have got rather into the habit of thinking of democracy at the top and not so much below. Democracy at the top will not be a success unless it is built on this foundation from below."

అని 9-8-1949 వ తేదీన Local Finance Enquiry Committee కి ప్రారంభోత్సవం చేస్తూ చెప్పారు

ఇప్పుడు జిల్లా పరిపాలనావిధానాన్ని వారిచేతుల్లో పెడుతున్నారు జిల్లా బోర్డులను రద్దు చేస్తామని చెప్పారు జిల్లా బోర్డులను రద్దుచేసే సమయం వచ్చినప్పుడు, ఎన్నికలు జరపడం ఆలస్యం అయ్యేటట్లయితే, ఉన్న శాసన సభ్యుల తోటే జిల్లాబోర్డులను ఏర్పాటు చేయమని చెప్పారు శాసన సభ్యులను ఎన్నుకొన్నది శాసన విధానం కోసం కాని, జిల్లా పరిపాలనలో ఐక్యం కలిగించు కోవడానికి కాదు జిల్లా పరిపాలనా విధానానికి జిల్లాలోని ప్రజలు క్రొత్తగా ఎన్నికై, వారు ప్రజాస్వామికాన్ని నేర్చుకొనుటకు అవకాశం ఉండాలి గనుక, అన్నిచోట్లా ఈ శాసన సభ్యులే ఉండాలనే భావం పనికిరాదనే ఉద్దేశ్యంతో ఆనాడు తిరస్కరించారు ఈవేళ ఎన్నికలకు తీసుకొనిపోతే ఏమౌతుందో అనే భయంచేత జిల్లా ప్లానింగ్ కమిటీలో సభ్యులుగా ఇదివరకు వేశారు ఇప్పుడు కమిటీగా తీసుకువస్తున్నారు దీనిని మార్చేటట్లయితే జిల్లా కౌన్సిలు ఉండాలని చాలా రోజులనుంచి మనం చెబుతున్నాము ఈ జిల్లా కమిటీకి సర్వాధికారాలు ఉండాలి కొన్ని అధికారాలు ఇచ్చినంతమాత్రాన అది decentralisation కాదు

"It is not infrequently that delegation of power is mistaken for decentralisation The former does not divest the Government of the ultimate responsibility for the actions of the authority to whom power is delegated, this authority is under the control of the Government and is in every way subordinate to it."

అని శ్రీ మెహతా కూడ చెప్పినారు

ఈ రోజున అధికారాలన్నీ ప్రభుత్వం చేతుల్లో పెట్టారు ఈ వేళ ప్రభుత్వాన్ని ఎవరు నడుపుతున్నారు? స్వరాజ్యం వచ్చింది స్వరాజ్యంలో రౌతులం మనం కాని, గుర్రం మాత్రం మనదికాదు పాత ఆఫీసరులే ఉన్నారు పాతగుర్రం ఒక్కొక్కసారి ఎదురుతిరుగుతూఉంటే, మంత్రులు ఎక్కడికి పోతున్నారో తెలియని పరిస్థితిలో ఉంది Democratic decentralization లో అధికారాలన్నీ ఆ officers కే ఇచ్చారు ఈ విషయాన్ని నేను కాదు చెబుతున్నది గవర్నమెంట్ వేసిన Evaluation Committee Report లోనే ఈ విషయం చెప్పబడినది Block Development Officer కు అన్ని అధికారాలు ఇస్తున్నాము

"Three B. D Os out of the twelve who reported on the performance figures for area reclaimed,

considered them unreliable. Items like drinking water wells, community centres, which can be checked easily fare better, but the checking of new roads constructed. Six out of the 19 centres reported no checking of new roads constructed under the project In three out of 19 centres studied, there seems to be no field checking at all."

అనేది ఎవాల్యుయేషన్ రిపోర్టులో 143 వ పేజీలో ఉంది Mehta Committee Reports వచ్చిన తరువాత Blocks ఎట్లా ఉండాలనే విషయంలో సమగ్రంగా విచారించడంకోసం Planning Commission వేసిన కమిటీవారు Block Development Officers సరిగా పనిచేయడంలేదని, వారి యొక్క ఉపయోగం ఏమీలేదని, దీనితో మార్పు రావాలని చెప్పారు కానీ మన report B D Os కు సర్వాధికారాలు ఇవ్వాలని చెబుతోంది ఇది విధానానికి, సిద్ధాంతానికి, యదార్థానికి, కార్యాచరణకు తప్పు అందువల్ల సర్వసాధారణంగా ఎన్నుకోబడిన జిల్లాకమిటీలు ఉండాలి కాని, శాసనసభ్యులు దానిలో కూర్చొని monopoly చేయడం అనేది ప్రజలయొక్క సర్వసాధారణమైన హక్కులను encroachment చేయడమే అవుతుంది Block Committees ను కూడా సరాసరి ఎన్నుకోవాలి పంచాయితీల ద్వారా ఎన్నుకొన్నారని చెబుతున్నారు unanimous election అంటే ఏమిటో మీకు చదివి వినిపిస్తాను అదికూడా ఎవాల్యుయేషన్ రిపోర్టులోనిదే చాలా పంచాయితీలు ఉన్నాయి వాటి అన్నింటికి unanimous గా ఎన్నికలు జరుపుతున్నామని, ఆ పద్ధతిలో బాగా జరుగుతుందని ప్రభుత్వం చెబుతోంది కానీ

"However, unanimous election does not necessarily indicate solidarity in the village. It may only show the community's lack of interest in the Panchayat As the significance of Panchayats is better understood, the number of unanimous elections may decline. While unanimity arising from a feeling of solidarity already existing in the village is most desirable, conscious efforts by officials to promote unanimous elections are not likely to lead to happy results These may only have the effect of increasing corrupt practices and pressure tactics."

ఎన్నికలు ఏకగ్రీవంగా జరగాలని చెబుతున్నాము ఉద్యోగస్థులు గ్రామాలలోకి వెళ్ళి corruption practices తోటి pressure ఉపయోగించి, ఎవరైతే వ్యతిరేకంగా నిలబడతారో వారి పేర్లు కొట్టేసి, గ్రామం మొత్తం మీద ఏకగ్రీవంగా వచ్చిందని చెప్పి reports పంపిస్తున్నారు ఈ ఉద్యోగుల

మీదనే ఆధారపడి ఈ రకంగా వచ్చే కమిటీలనే ఇకముందు కూడా మెచ్చు కోవడం ఏలాగ? ఈ team ఇచ్చిన report లో ఇతర దేశాలలో ఉండే ప్రజా స్వామ్య ఉదాహరణలు ఇచ్చారు దానిలో వారు స్వీడన్, ఇంగ్లాండ్, అమె రికా, యుగోస్లావియాలను పేర్కొన్నారు యుగోస్లావియాను గురించి వారు కొన్ని విషయాలు చెప్పారు The peoples committee of the commune is elected on adult sufferage by secret ballot for a three years term అంతేకాకుండా single transferable vote తో proportionate propound తోటి నడపాలి అట్లా నడిపినట్లయితే lower level లో కూడా బాగా పని చేసిందని యుగోస్లావియా రిపోర్టులో చెప్పారు ఇప్పుడు వచ్చిన report ప్రజాస్వామ్యానికి తీసుకొని పోయేదికాదు బ్యూరోక్రసీ అధికారాలు ఇచ్చి, డెమోక్రసీ పేరుచెప్పి పంచాయితీ బోర్డుమెంబరుగా కాని, ప్రెసిడెంటుగా కాని ఉంటే, అతడు Block లో ఉండనంటే పంచాయితీబోర్డు membership కూడా పోతుంది నాకుకూడా భయం ఉంది రేపు పరిషత్‌లో శాసనసభ్యు లందరూ members గా ఉంటారు నేను ఏ కారణంచేతనయినా పరిషత్‌లో ఉండనంటే Assembly membership పోతుందేమో నాకు తెలియదు అందు వల్ల ఆ పరిస్థితి ఇంకా constitution ఇవ్వలేదు కానీ మనవారి చేతుల్లో ఉన్న Government వల్ల అది ఇస్తున్నారు అది సరైనది కాదు అధికారుల చేతులకు అన్ని powers ఇవ్వడం మంచిదికాదు దీనిని oppose చేస్తున్నాను ఈ విధానం బాగానే ఉన్నది కాని details తప్పు అని చెబుతున్నాను

శ్రీ వి కూర్మయ్య (గుడివాడ రిజర్వుడు) అధ్యక్షా! జిల్లా బోర్డులకు ఎన్నికలు జరపాలా, వద్దా? అని 7 సంవత్సరాలు ఆలోచించిన తరువాత, ఇప్పటికి పంచాయితీ సమితుల, జిల్లాపరిషత్‌ల బిల్లును మన శాసనసభముందుకు తేవడం జరిగింది ఈబిల్లును ప్రవేశపెడుతూ మంత్రిగారు కొన్నివిషయాలు చెప్పారు దీనిద్వారా decentralisation వస్తుందని, ఇది ఎంతమాత్రం centralsation కాదని చెప్పారు ఈ సమితులయొక్క constitution, composition ఏమిటో చూసినట్లయితే, ఇది ఏవిధంగా democracy అవు తుందో, ఏవిధంగా decentralisation అవుతుందో నాకేమీ అర్థం కావడంలేదు మనదేశంలో democracy ని పటుతరం చేయాలనే ఉద్దేశ్యంతో మన Costitution రచించబడింది ఈనాడు తేబడిన బిల్లులో పంచాయితీబోర్డు అధ్యక్షులు మాత్రమే జిల్లాసమితులలో సభ్యులుగా ఉండాలని ఏర్పాటు చేయ బడింది ఈ పంచాయితీబోర్డు అధ్యక్షులు ఓటర్లచేత ఎన్నుకోబడినవారే కానీ ఎన్నికలు ఏవిధంగా జరుగుతున్నది, ఈ పంచాయితీబోర్డు అధ్యక్షులు ఏవిధంగా ఎన్నుకోబడుతున్నది ప్రజలకు తెలుసు ఇంతకుపూర్వం మద్రాసు ప్రభుత్వంలో

పంచాయితీబోర్డుల చట్టం చేశారు దాని ప్రకారం పంచాయితిల అధ్యక్షులు గ్రామాలలోని ఓటర్లచేత ఎన్నుకోబడాలి కాని తరువాతవచ్చిన ప్రభుత్వాలు ఆచట్టాన్ని మార్చి, పంచాయితీబోర్డు అధ్యక్షులు ఆబోర్డుల సభ్యులచే ఎన్నుకోబడాలని తీసుకొనివచ్చారు పంచాయితీబోర్డు అధ్యక్షులు ప్రజలచేత ఎన్నుకోబడాలనే సిద్ధాంతంఉంటే ఎవ్వరికీ అభ్యంతరంలేదు కాని ఈనాడు ఆవిధంగా లేదు. ఏ చిన్నవార్డులోనో ఒక పంచాయితీబోర్డు సభ్యుడుగా రావడం, అతడు పంచాయితీబోర్డు సభ్యులందర్ని కొనివేసి పంచాయితీ అధ్యక్షుడుకావడం జరుగుతోంది అట్టి అధ్యక్షులు ఈనాడు పంచాయితీ సమితులలో సభ్యులుగా వచ్చి రాజ్యాన్ని ఏవిధంగా పరిపాలనచేస్తారో నాకు అర్థం కావడంలేదు కాంగ్రెస్‌సంస్థ ప్రజాస్వామ్యంకోసం పోరాడి, స్వరాజ్యాన్ని సంపాదించి, దానిని బలపర్చడానికి ప్రయత్నిస్తోంది

ఈమధ్యనే కేరళరాష్ట్ర ప్రభుత్వం ప్రజాస్వామ్యానికి విరుద్ధంగా వ్యవహరిస్తున్నదని కాంగ్రెస్ అధ్యక్షులనుంచి, పెద్ద పెద్ద కాంగ్రెస్ నాయకులు విమర్శచేయడం జరుగుతున్నది ఈ సందర్భంలోనే మనం ఏమిచేస్తున్నామో కూడా విమర్శన చేసుకోవడం అవసరం ఈ పంచాయితీ సమితులలో 60-70 గ్రామాలు ఉండవచ్చు ఆ 60-70 గ్రామపంచాయితీల అధ్యక్షులు దీనిలో సభ్యులుగా ఉంటారు ఈ సమితులలో ఒకస్త్రీని, ఒక హరిజనుని, లేక tribal community కి చెందినవానిని, public administration లో ఎక్కువ అనుభవం ఉన్నవారినొకరిని, సహకార సంస్థలతో సంబంధంకలవారి నొకరిని, ఈవిధంగా అయిదుగురిని co-opt చేసుకొనవచ్చునని చెప్పారు ఇక్కడ నేను ఒకవిషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసుకొనివస్తున్నాను నాకు మొదటినుంచీకూడా ఈకాంగ్రెస్ ప్రభుత్వంలో, కాంగ్రెస్ పేరుతో, ప్రజాస్వామ్యం అనేపేరుతో ప్రజలకున్న హక్కులను తీసివేసి, ఏకొద్దిమందో అధికారాన్ని శాశ్వతంగా తమ చేతుల్లో పెట్టుకోవడానికి ప్రయత్నాలన్నీకూడా జరుగుతున్నాయని నిజమైన అనుమానంవుంది ఈ అనుమానమునకు తార్కాణంగానే ఇప్పుడు ఈపనులు జరుగుతున్నాయి మనరాజ్యాంగం ప్రకారంగా హరిజనులకు వారి జనాభానుబట్టి అసెంబ్లీలో స్థానాలను కేటాయించారు ఈనాడు ఈజిల్లా సమితులలో ఆవిధంగా కేటాయించకుండా ఒక హరిజనుని co-opt చేస్తారట ఆ ఒక్క seat అయినా ఇవ్వకపోతే రేపు ఎన్నికలలో తమకు వారు ఓట్లు వేస్తారో వేయరోనని భయపడి ఆవిధంగా కేటాయించారు ఈవిధంగా ఏర్పడి సమితులు నిజంగా ప్రజానీకానికి సేవచేస్తాయా అని నేను అనుమానిస్తున్నాను నేను ఒక ఉదాహరణ చెబుతాను "డయార్కీ"లో బ్రాహ్మణేతరులకు కూడా Reservation ఉండేది కొద్దిమంది-3% మాత్రం-బ్రాహ్మణులకు భయపడి

తమకు Reservation కావాలనిచెప్పి Justice-Party ని ఏర్పాటు చేసినటు వంటి పెద్దలు, ఆకులాలకు చెందినవారే, ఈనాడు హరిజనులకు Reservation తీసివేసి, ఒక్క member ను మాత్రం co-opt చేయడానికి ఎందుకు ప్రయత్నం చేస్తున్నారు? ఈవిధంగా చేయడానికి కారణాలు ఏమిటి? ఈ విషయంలో నేను ఒక సలహా చెబుతున్నాను ఒకవేళ పంచాయితీబోర్డు అధ్యక్షులే సమితులలో సభ్యులుగా ఉండాలనుకొంటే, ప్రతిపంచాయితీబోర్డులోను, సమితిలోను హరిజనుల జనాభానుబట్టి స్థానాలు కేటాయించాలి co-opt పద్ధతిని నేను అంగీకరించను ఆ స్థానాన్ని ఎన్నుకొనేటట్లు చేయాలి ఈ Co-option లో వారియొక్క పెద్దపాలేరులే వస్తారు. ఈ పద్ధతిని పెట్టి ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేస్తున్నారని చెప్పకతప్పదు "The Congress is digging its own grave" గాంధీగారు ప్రజాస్వామ్యాన్ని గురించి చెప్పారు ఈనాడు ఈవిధంగా చేస్తే, రేపు ప్రజలవద్దకు ఏముఖం పెట్టుకొనివెళ్లాలో నాకుమాత్రం అర్థం కావడంలేదు ఈనాడు ప్రభుత్వం తెస్తున్న మార్పులు, అధికారాలన్నీ బ్రాహ్మణేతరులయిన advanced communities శాశ్వతంగా తమచేతుల్లో పెట్టుకోవడానికి జరుగుతున్నాయి నూటికి 50 మంది ఉన్న హరిజనులు, Backward and Tribal Communities చేతిలోకి అధికారం పోకుండా ఉండాలనే ఉద్దేశ్యంతోనే ఈ మార్పులన్నీ చేస్తున్నారని నా అనుమానం డయార్కీలోకూడా ప్రజలకు కొన్ని అధికారాలు- reserved half, transfered half అనే సిద్ధాంతంతో- ఇచ్చారు రాజ్యాంగం క్రింద ప్రజల ఎంక్కులను లాసివేసి, డయార్కీని తీసివేసి, decentralisation చేస్తున్నామనేది పూర్తిగా పొరబాటు కమ్యూనిస్టుదేశాలలో ఉండే dictatorship చేస్తున్నారా అంటే అదీకాదు Officialdom మాత్రం జరుగుతోంది ప్రజాస్వామ్యం కావాలంటే ప్రజలచేతుల్లోకి అధికారం పోవాలి MLA ల పైన ఎంత విశ్వాసం ఉంటుందో, జిల్లాపరిషత్, సమితుల సభ్యులపై అంతే విశ్వాసం ఉండాలి ఇంగ్లీషువారికాలంలో ప్రజలచే ఎన్నుకోబడిన జిల్లాబోర్డు అధ్యక్షులకు అధికారాలు ఉన్నప్పుడు, ప్రజాస్వామ్యంలో వాటిని తీసివేయడం చాలా అన్యాయం ఒక paid servant అయిన Collector కు అధికారాలన్నీ ఇస్తున్నామంటే ఇది ప్రజాస్వామ్యాన్ని ఖూనీచేయడంకాక మరేమి అవుతుందో సభ్యులందరూ ఆలోచించాలని కోరుతున్నాను ఓట్లు Collectors, B D Os ద్వారా రావు ప్రజలు చూస్తున్నారు పరోక్ష వోటింగు పొరపాటున ఇచ్చామని కొందరు అనుకొన్నారు. పొరపాటున ఇచ్చినా లేక గ్రహపాటున ఇచ్చినా ఆ పరోక్ష వోటింగు పద్ధతి ద్వారానే ఎన్నికలు జరిగితీరాలి ఎల్లకాలం కాంగ్రెస్ ప్రభుత్వమే ఉంటుందని అనుకోవడం పొరబాటు ప్రజల చేతుల్లోకి అధికారం ఇచ్చినప్పుడు ఏ ప్రభుత్వం వస్తుందో

రేపు నిజంగా కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చినా ఆశ్చర్యమేమీలేదు ఈనాడు జిల్లా పరిషత్తుల దగ్గరనుంచి వైస్-ఛాన్సలరు వరకు nomination జరుగుతోంది మంత్రులను కూడా nominate చేసుకోవచ్చు ముఖ్యమంత్రి మాత్రం ఎందుకు ? Chief Secretary ని తీసుకొనివెళ్ళి ముఖ్యమంత్రిగా పెట్టుకోకూడదా ? కేంద్రంలో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మాత్రం పరిపాలన చేయడం దేనికి ? ఒక Chief Justice ను తీసుకొని వెళ్ళి ఆ స్థానంలో పెట్టకూడదా ?

శ్రీ ఎ బాపినీడు (కొవ్వూరు) అధ్యక్షా, చాలాసంవత్సరాలనుంచి జిల్లా బోర్డులను Special Officers చేతుల్లో పెట్టి రాష్ట్ర పరిపాలన చేస్తుంటే, ఎట్టకేలకు ఈనాడు పంచాయతీ సమితుల బిల్లు ముందుకు వచ్చింది పంచాయతీ సమితి conference పెట్టాము. బహుశా నేను ఒక్కణ్ణె M L A గా పంచాయతీ సమితి అధ్యక్షుణ్ణి అయ్యానేమో ! ఇంతవరకు పంచాయతీ సమితి అధ్యక్షుణ్ణిగా మీటింగు పెట్టి సంతకం పెట్టడంతప్ప వేరే అధికారం ఏమీలేదు అక్కడ ఉన్న సిబ్బందిమీదకాని, అక్కడిపనులమీదగాని confidentialగా ఏదైనా విషయంవస్తే దానిని గురించి ఏమైనా చేయడానికిగాని ఏమీ అధికారాలు లేవు ఏవో అధికారాలు ఉంటేనే కాని పనిచేయడానికి వీలులేదా ? అని ప్రజాస్వామ్య సిద్ధాంతాల ద్వారా ఎన్నికైన మంత్రులు అడుగుతున్నారు ప్రజాస్వామ్యంలో చెప్పే విషయాలకు ఈ బిల్లుకు చాలా తేడా ఉంది

ఈ వికేంద్రీకరణ గురించి చెప్పే మాటలు అనేకరకాలుగా ఉంటున్నాయి ఇక్కడ వికేంద్రీకరణ అంటూ, జిల్లా ప్లానింగు ఆఫీసర్ల అధికారాలు, బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసర్ల చేతులలో పెట్టారు B D O ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అన్ని అధికారాలు ఆయన చేతులలో పెట్టడంతో పంచాయితీ సమితులకు గాని, జిల్లా పరిషత్తులకు గాని ఏమీ అధికారాలు లేకుండాపోయాయి మంత్రిగారు మాట్లాడుతూ "Co-ordination between the people and the Government" అన్నారు కలెక్టరు లేకపోతే ఈ పనులు జరగవని, సందేహం వెలిబుచ్చారు ఈ మధ్య నెహ్రూగారు "గ్రామ నాయకత్వం కావాలి, గ్రామ ప్రజల నైతిక స్థాయిని పెంపొందించాలి, గ్రామాలలో ప్రజలు చైతన్యవంతులైతేగాని దేశం అభివృద్ధిపొందదు" అని అన్నారు అటువంటి గ్రామ నాయకత్వాన్ని పెంపొందించడానికి గాని, గ్రామ ప్రజల నైతికస్థాయిని పెంపొందించడానికి గాని ఈ బిల్లు ఎంతవరకు ఉపకరిస్తుందని ప్రశ్నిస్తున్నాను అటువంటిది ఏమీలేదు ప్రజా నాయకత్వాన్ని పెంచడానికి తగినటువంటి అవకాశాలు కల్పించాలి అధికారం ఉన్నప్పుడే సాధారణంగా అవకాశాలు కలుగుతాయి ఇందులో అటువంటి అవకాశాలు ఏమీలేవు Powers ను transfer చేయడం

అనేది ఇందులో ఎక్కడా కనుపించడంలేదు ప్రజలచేత ఎన్నుకోబడినటువంటి ఒక సంఘానికి అధికారాలు యివ్వాలి ఈ బిల్లులో B D O లకే సర్వాధికారాలు ఉన్నాయి 10 వేల రూపాయలు ప్రోగుచేసి, 360 రూ లు సంపాదించుకొనే ఒక B D O చేతులలో పెట్టవలసివస్తుంది ఇందులో జరిగే కార్యక్రమాలు B D O లకు యిష్టంలేకపోతే D P O లతో కలెక్టర్లతో చెప్పి ఆపు చేయించవచ్చు ఈ విషయాలన్ని సలక్షకమిటి పునః పరిశీలనచేసి ప్రజాస్వామికసూత్రాలకు అనుగుణంగా సవరించాలని కోరుతున్నాను ప్రస్తుతం ఈ బిల్లు చాలా హాస్యాస్పదముగా ఉన్నదని మాత్రం మనవిచేయక తప్పదు ఏ గ్రామంలో, ఏ తాలూకాలో ఏ జిల్లాలో ఉన్న సమస్యలను అక్కడే పరిష్కరించేటట్లు ఉండాలి అంతేగాని, ప్రతిసమస్యను హైదరాబాదుకు తీసుకు వచ్చేటట్లు ఉండరాదు అప్పుడే వికేంద్రీకరణ జరిగినట్లు అర్థంఅవుతుంది ఆ సూత్రాన్ని యిందులో స్పష్టంగా గోచరించేటట్లు సవరించాలి "పంచాయతీలలో, ప్రజా ప్రతినిధులకు అధికారం యిస్తే, దుర్వినియోగం అవుతుంది" అని అనుకొన్నప్పుడు— ప్రజాప్రతినిధులైన మంత్రుల చేతులకు అధికారం యిచ్చినప్పుడు కూడ అంతేకదా అని, అనుకోవలసివస్తుంది ఆ ప్రశ్న తప్పకుండా ఉదయిస్తుంది ప్రభుత్వం యంత్రాంగం క్రింద పనిజేసే B D O లకు, కలెక్టరుకు అధికారాలుయిచ్చి, పంచాయితీల వశముచేశాము అని చెప్పడం సమంజసము కాదు గ్రామాలలో ప్రజలకు అధికారం యివ్వండి, వికేంద్రీకరణను అమలుపరచండి అప్పుడు గ్రామాలు ఎలా అభివృద్ధిలోకి వస్తాయో చూడండి అంతేగాని దీనివల్ల పెద్ద ప్రయోజనం ఉండదు నా స్వానుభవం మీద ఈ సమితులు ఏర్పడిన తరువాత ఏమి జరిగింది అంటే ఏమీ జరుగనేలేదని చెప్పవలసి వస్తుంది బ్రిటిష్ కాలంలో ఏర్పడిన జిల్లాబోర్డులు స్టేట్యూటరీ బాడిగా ఉండేది ఇప్పుడు అది తీసివేసి, అడ్వయిజరీ బాడీ క్రింద ఏర్పాటుచేయడం చాల విచారకరమైన విషయం లేకపోతే అలాగే స్టాట్యూటరీ బాడీగానే ఉంచమని కోరుతున్నాను కొన్ని అధికారాలు ప్రజల చేతులలో పెట్టి, ప్రజాస్వామ్యాన్ని స్థిరీకరించడానికి తోడ్పడవలెనని కోరుతున్నాను

శ్రీమతి ఎ కమలాదేవి (ఆలేరు) అధ్యక్షా! ఒకమనవి స్త్రీ సభ్యులు, సాధారణంగా మాట్లాడడం తక్కువ కాబట్టి, తమరు ఆలోచించి తగినటైము యివ్వాలని కోరుతున్నాను

ఈజిల్లా సమితులు, పంచాయతీ సమితులు సరాసరి ఎన్నికలద్వారా ఏర్పాటు చేసినట్లయితే, ప్రజాస్వామికముగాని, వికేంద్రీకరణంగాని, అందులో చూడగలుగుతాము. ఈ పంచాయితీ అధ్యక్షులు, జిల్లాపరిషత్తులలో సభ్యులుగా ఉంటారనేదిచూస్తే ఇదెక్కడి ప్రజాస్వామిక మో అర్థం కాకుండా

ఉన్నది ఈసందర్భంలో పంచాయితీ కమిటీల ఎన్నికలను ఒకసారి పరిశీలించుదాము పంచాయతీ కమిటీసభ్యుడు గ్రామంలో ఏదో ఒక వార్డు నుండి ఎన్నిక అవుతాడు. గ్రామం మొత్తంమీద పంచాయతీ అధ్యక్షుని హోదాలో ఎన్నిక జరగడంఅనేది ఉండదు పంచాయతీకమిటీ సభ్యులందరూ కలసి అధ్యక్షున్ని ఎన్నుకొంటారు జిల్లాసమితికి పంపేఉద్దేశ్యంతో ఇక్కడ అధ్యక్షుణ్ణి ఎన్నుకోవడం జరుగుటలేదు అంతేకాకుండా వంద, వందఎబది జనసంఖ్యఉన్న గ్రామంనుంచి పంచాయతి అధ్యక్షుడు వస్తున్నారు 5 వేల జనసంఖ్యఉన్న గ్రామంనుంచి అధ్యక్షుడు వస్తున్నాడు అందుచేత ఈసందర్భంలో నాదొక మనవి కొన్ని కొన్ని గ్రామాలను ఒక గ్రూపుగాచేసి ఎన్నికలను పెట్టినట్టయితే అన్నిగ్రామాలకు సభ్యత్వం యిచ్చినట్లు ఉంటుంది ఆగ్రామాలనుంచి ఎన్నిక అయిన అధ్యక్షుడే జిల్లాపరిషత్తులో సభ్యుడుగా ఉండవచ్చు ప్రజల నుండి ఎన్నికై వచ్చిన M L A లకు ఓటింగుహక్కు యివ్వడంలేదు ఇది ఏరకమైన ప్రజాస్వామ్యమో అర్థంకావడంలేదు, ఇక ఇందులో B D O లకు ఎలాంటి అధికారాలు ఉన్నవో చూద్దాము 21 వ క్లాజు ప్రకారం చూచినట్లయితే, అత్యవసర పరిస్థితులు అనుకొన్నప్పుడు, అన్ని అధికారాలు ఆయనే వశపరచుకోవచ్చు అదేవిధముగా 18 క్లాజు ప్రకారం వీటికి సంబంధించిన రికార్డులు అవి, ప్రజాశ్రేయస్సుకు భంగకరమని B D O అనుకొన్నప్పుడు, ఈకమిటీలకు చూపించకుండా ఉండవచ్చు, ఈక్లాజు యిలాగే ఉన్నట్లయితే, ఈ B-D O లు ఈ రికార్డులను ఈకమిటీలకు చూపించడం అనేది తటస్థించనే తటస్థించదు ప్రతిదానికి ప్రజాశ్రేయస్సు అనేసాకుతో రికార్డులు చూపించకుండా ఉండడం జరుగుతుంది నిన్న మంత్రిగారు తమ ఉపన్యాసంలో ఈ B D O. లు సమితికిలోబడి ఉంటా''రని చెప్పారు కాని ఈక్లాజులు అన్నీ చూచినట్లయితే లోబడి పనిచేసేసమస్యే లేదు ఈసమితిలో అతనికే అధికారాలు అన్నీ ఉన్నాయి ఈబిల్లువల్ల పంచాయితీ సమితులపై కూడ B D O లకు అధికారం ఏర్పడుతోంది ఇంతవరకు ఈపంచాయితీలపై Inspectors ఉంటూ ఉండేవారు వాళ్ళతోటే ఈ పంచాయితీలు బాధపడలేకుండాఉంటే, ఈ B D O లను కూడ తీసుకొచ్చి పెట్టారు, పైగా ఈ పంచాయితీ కమిటీలయొక్క బడ్జెట్టును ఈ B D O చెక్ చేస్తారట ఇది ఏమాత్రం సమంజసంకాదు సెలెక్టుకమిటీ ఈవిషయాలన్నింటిని పరిశీలించాలని కోరుతున్నాను ఇన్ని అధికారాలు B D O లకు యిచ్చినప్పటికి కూడ ప్రభుత్వానికి యింకా తృప్తిలేదు ఈపంచాయితీ సమితులుగాని, ఈ జిల్లా పరిషత్తులుగాని, ఏదైన ఒకతీర్మానం చేసినట్లయితే ఆ తీర్మానం ప్రజాశ్రేయస్సుకు భంగకరమని ప్రభుత్వం భావించినట్లయితే దానిని రద్దుచేసే అధికారం ప్రభుత్వం చేతులలో పెట్టుకొంది

ఒక్క తీర్మానాలపైనే అధికారము కాదు అక్కడ పంచాయితీ సమితి ప్రెసిడెంటును తొలగించాలనుకున్నా అవిశ్వాస తీర్మానము తీసుకరావాలన్నా ఐదింట మూడు భాగాలు వోటుచేస్తేనేగాని ఆ తీర్మానము నెగ్గదు అక్కడ majority వుంటుందన్న ఉద్దేశంతో ప్రభుత్వం పంచాయితి President ను కాని ఉపాధ్యక్షుని కాని తొలగించే అధికారము తన చేతులలోనికి తీసుకుంటుంది తొలగించిన అధ్యక్షులు తిరిగి రెండు సంవత్సరాల వరకు అధ్యక్షులుగా రావడానికి వీలులేదు అది 53 clause ప్రకారం వున్నది Section 54 ప్రకారం majority తో వున్న opposition party కాని ప్రభుత్వానికి లోబడని పార్టీగాని ఎచ్చినట్లైతే ఆ సమితిని కూడా వుండనిచ్చే దానికి వీలు లేనట్లుగా వుంది ఇక Executive committees విషయముంది Sub-committees ను ఏర్పాటు చేసినపుడు ఆ తాలూకా సమితి President వీటికి President గా వుండాలట అదికూడా సరియైంది కాదు కాని ఆ Sub-committees ను ఏర్పాటు చేసినపుడు ఆ Sub-commmittees కు ఇష్టమున్న వారినే President గా చేసుకోడానికి అధికారమివ్వవలెను కాని అటువంటి అధికార మివ్వలేదు ఈ clause కూడా సరియైంది కాదు ఇక జిల్లా సమితులు వున్నవి అవి ఏ విధంగా వున్నవి? జిల్లాబోర్డులను రద్దుచేసి జిల్లా పరిషత్తులను వేస్తామన్నారు కాని వీటికంటే ప్లానింగ్ కమిటీలే మేలేమోనని అనుకుంటున్నాను ఈ జిల్లా పరిషత్తులకు కూడా కలెక్టరే అధ్యక్షుడుగా వుంటారు యీ ప్రజల కమిటీలకు ఎక్కువ అధికారాలు వున్నట్లు దీనిలో లేదు, 5 సంవత్సరముల కొకసారి అసెంబ్లీ ఎన్నికలు జరిగిన సందర్భంలో జిల్లాబోర్డు ఎన్నికలు జరిగే అవకాశముంది ఆ మాదిరిగనే Block సమితీలకు కూడా ఎన్నికలు జరిపే అవకాశము కలుగజేయాలి. డబ్బు ఖర్చు కావలసిందేమీ లేదు M L A's ఎన్నిక రోజునే పంచాయితి సభ్యుల ఎన్నికకూడా జరిపిన ఆ ఎన్నికైన సభ్యులతో పనిచేయించగలము కాని ఈ విధంగా సమితుల పేరు పెట్టుకొని ఈ nominated bodies తో ఏపని చేయించలేము కలెక్టర్ అధ్యక్షుడుగా వుండడము సమంజసంగాలేదు ఈ జిల్లా పరిషత్తులు ఏర్పడిన తర్వాత ఆ సభ్యులే వారి ఇష్టమువచ్చిన President ను పెట్టుకొనే అధికారమువుండాలని నా అభిప్రాయము మంత్రిగారుచెప్పినట్లు 447 బ్లాకులు ఏర్పాటు చేయడం జరిగింది 7-8 సంవత్సరాలైన తర్వాతకూడా ఇంతవరకు సగమువరకు మాత్రమే బ్లాకులు ఏర్పాటు ఐనవి ఆ బ్లాకులలో ఎంతవరకు పని progress ఔతుందోఅది వేరే విషయము. ఈ బ్లాకు గ్రామాలలో మాత్రమే ఈ planning కు సంబంధించిన డబ్బు ఖర్చుపెట్టడం జరుగుతుంది. ఈ non-Block areas వారు ఈ బ్లాకులకొరకు 10 సంవత్సరాలవరకూ ఎదురుచూడడం జరుగుతుంది కాబట్టి ఈ అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించిన డబ్బును కొంత non-

Block areas లో కూడా ఖర్చుపెట్టడము సమంజసముగావుంటుందని నా అభిప్రాయము తెలంగాణాకు సంబంధించినంతవరకు 2 సంవత్సరముల క్రితము District Board Act pass చేసుకొన్నాము ఇక్కడ nomination లేదు ఎన్నికలద్వారా జరగాలని ఒక Act చేసుకోవడము జరిగింది కాని రెండు సంవత్సరాలు అయినతరువాత దానిని మార్చి సమితుల పేరుతో nominated bodies ను పెట్టడము సమంజసముగా లేదు కాబట్టి సమితులు కానివ్వండి, District Boards కానివ్వండి, ఎన్నికలద్వారా వచ్చిన కమిటీలే సరిగా పని చేయగలుగును వాటికి అన్ని అధికారాలు యివ్వాలి B D Os కు యిచ్చే అధికారాలు తగ్గించి యీ B D Os ను సమితి ఆధీనంలో వుండేటట్లు చేయాలి B D Os కు జీపులు యివ్వడం జరుగుతుంది ఆ జీపులను ఎవరు ఉపయోగించాలనే విషయం సమితికే యివ్వాలి కాబట్టి దానినంతాబాగా ఆలోచించి Select Committee Stage లోనే మార్చివేయాలని అభిప్రాయ పడుచూ ఇంతటితో నేను విరమిస్తున్నాను

శ్రీ సి పి తిమ్మారెడ్డి (సిరివేలు) అధ్యక్షా, ఈ బిల్లును గురించి మాట్లాడవలసి వచ్చినపుడు, ఇది అతి ప్రాముఖ్యమైన విషయమని నేను మనవి చేస్తున్నాను వ్యక్తిమీద వుండే నమ్మకము పోయింది కాబట్టి సంఘ పరిపాలన కావలసిన రోజులు వచ్చినవి పరిస్థితులకు అనుగుణముగా వున్న పరిపాలన అవసరము కాబట్టి నేడు రాజకీయ పరిపాలన, ఇంతకంటే నైతికమైన పరిపాలన దేశములో వచ్చింది ఇంతకు మునుపు వ్యక్తిగా వున్నప్పటికినీ సక్రమమైన పరిపాలన సాగించగలడనే నమ్మకము అతనియందు వుంటూ వచ్చింది ఇప్పుడు నీతి నిజాయితీ తగ్గిపోయింది కొంతమంది వ్యక్తులు వారి స్వార్థముకొరకు అధికారాన్ని ఉపయోగించుకొన్నారు కాబట్టి ఇపుడు ఒక group గా ఒక సంఘ రూపకముగా వారికున్న కష్టసుఖాలను పరిష్కరించుకుంటే బాగుంటుందనే ఉద్దేశముతో వున్నట్లు అగుపిస్తుంది కాబట్టి యీ పరిస్థితులలో పంచాయితీ సమితులు కాని Block సమితులు కాని జిల్లా పరిషత్తులు కాని ఏర్పడడానికి ఇపుడు అవసరము ఏర్పడినది ఎందుకంటే ఇపుడు centre లో ఒక గవర్నమెంటు వున్నది రాష్ట్రంలో ఒక గవర్నమెంటు వుంది అటులనే జిల్లా స్థాయిలోను తాలూకా స్థాయిలోను వుండడము అవసరము గ్రామ స్థాయిలో కూడా అటువంటిది వుండాలనే విషయాన్ని మనమందరము గుర్తించినదే కాకుంటే ఇంటిస్థాయిలో కూడా వుండనవసరముందేమోనని నేను భావిస్తున్నాను కాబట్టి నేను ముఖ్యంగా గ్రామ స్థాయిలో మాట్లాడవలసి వచ్చినపుడు గ్రామానికి సంబంధించి గవర్నమెంటు తరవున గ్రామ ఉద్యోగులు వున్నారు వారిని రెడ్డికరణాలు అంటారు

ఇపుడు పంచాయితీలకు ప్రజాసంస్థలనుంచి వచ్చే వ్యక్తులు అధికారములోనికి వస్తున్నారు అపుడు వారిద్దరికి clash వస్తుంది పంచాయితీ ప్రెసిడెంటులు మాకు అన్ని హక్కులు కావాలని గ్రామములోవున్న ప్రతి విషయములోను ఐక్యము కల్గించుకోవడము జరుగుతుంది కాబట్టి మొట్టమొదట గ్రామ స్థాయిలో బాగుపడితే తప్ప తాలూకా స్థాయి బాగుపడడానికి వీలులేదు తాలూకాస్థాయి బాగుపడితేతప్ప జిల్లా స్థాయి బాగుపడడానికి వీలులేదు జిల్లా స్థాయి బాగుపడితేతప్ప రాష్ట్రాలు బాగుపడడానికి వీలులేదు. రాష్ట్రాలు బాగుపడితే తప్ప మనదేశం బాగుపడడానికి అవకాశాలు లేవు కాబట్టి నేను ముఖ్యంగా గ్రామస్థాయిలో మాట్లాడదలచుకొన్నాను కనుక నేనక్కడవున్న విషయాలను గురించి మాట్లాడుతాను మొట్టమొదట మనకు గ్రామ పరిపాలన కావాలి ఇదివరకు గ్రామ మునసబుకు కావలసిన అధికారాలు ఇచ్చారు కాని యీరోజున వారి క్రిందవున్న అధికారాలు ఏమికావాలి అవి సంఘ పరము కావాలి సంఘపరము అంటే ఏమిటి ? అక్కడ ఎన్నికైన పంచాయితీ ప్రెసిడెంటు పరము కావాలి కాబట్టి సమిష్టి పరిపాలన కావాలను కొన్నపుడు గ్రామస్థాయిలో రెడ్డి కరణాలు వుండనవసరములేదు కాబట్టి గ్రామానికి ఒక President వుండడము అవసరము అక్కడవున్న వారికి సర్వాధికారాలు కావాలి మనదేశములో ఇది క్రొత్తకాదు నూతన విధానం కాదు ఇదివరకు కూడా గ్రామ పంచాయతీలు వుంటూ వచ్చినవి. అన్ని విషయాలు కూడా పరిష్కారము చేసుకుంటూ వచ్చారు ముఖ్యంగా గ్రామాలలో వచ్చే పేచీలకు కొన్ని కారణాలు లేకపోలేదు

గవర్నమెంటు Constitution కు లోబడి పనిచేయాలి మానవుడు కూడ ప్రపంచములో విచ్చలవిడిగా పోవడానికి వీలులేదు దానికి కూడ కొన్ని rules వున్నవి వాటినే శాస్త్రము అన్నారు సిద్ధాంతము అన్నారు వాక్కులు అన్నారు వెనుక రోజులకు పోయినట్లయితే గ్రామాలలోని ప్రజలు ఏ విధముగా వుండేవారో ఆలోచించాము ఇప్పుడు ఎట్లా వుండాలనేది సమస్య సత్ప్రవర్తనకు అనుగుణ్యమైన ఒక Constitution ను ఏర్పరచుకోవాలి అనుకూలమైన body కావాలి అందువల్ల ఈ రెడ్లు, కరణాలు అనేవారు లేకుండా పంచాయితీ పరిపాలనను గ్రామ ప్రజల చేతులలో వుంచాలి గ్రామానికి సంబంధించిన సర్వ వ్యవహారములు వారే చూసుకొని తీర్పు చేసుకొనే పద్ధతిలో గ్రామాలను తయారుచేయవలయును దానికి సర్వాధికారాలు కలిగిన ఒక body వుండాలి దానిని execution లో పెట్టేందుకు 2, 3 గ్రామాలకు ఒక్కొక్క village level worker వుండాలి ఈ village level worker పని ఏమిటో అర్థముకావడము లేదు వారు ఆ గ్రామ పంచాయితీలకు తోడ్పడేవారుగా వుండాలి పంచాయితీ

వారి ఆర్డర్సును execution లో పెట్టాలి గ్రామీణాలలో చదువు తక్కువని చెప్పడానికేమీ సందేహములేదు గ్రామాలలో వున్న పరిస్థితిని చూచినట్లయితే లిఖితపూర్వకముగా గాని చట్టరూపకముగా గాని అమలులో పెట్టడానికి అవకాశం లేకుండా వుంది గ్రామపంచాయితీలలోని సభ్యులు అంతా కూర్చొని ఒక నిర్ణయానికి వచ్చి మాకు ఇవి చేయాలన్నప్పుడు దానిని అమలుచేయడము అవసరం Village Level Worker ప్రతి గ్రామానికి ఒకరుచొప్పున వుండడము శ్రేయస్కరము లెక్కలు తయారుచేయడానికి కరణానికిబదులు ఒక గుమాస్తా వుండాలి నౌకరుల స్థానంలో మామూలుగా నౌకరులువుంటారు Economy ని దృష్టిలోవుంచుకొన్నా వీరినితొలగించడం అవసరమైవుంది అందుచే అన్ని వ్యవహారాలకు President బాధ్యుడుగావుంటాడు గ్రామ పరిపాలనను కట్టుదిట్టము చేసి, అక్కడి land revenue ను వారికే ఒప్పచెప్పి, అక్కడి అభివృద్ధి ప్రణాళికలను వారికే ఒప్పచెప్పవలయును వారి వ్యవహారములలో ప్రభుత్వము జొక్యము కల్పించుకొనరాదు దీనిలో కొన్ని కష్టములు రావచ్చును గ్రామాలలోని అభివృద్ధి కార్యక్రమాలలో వీరు సక్రమపంథాలో నడుపుతారా లేదా అన్న భయము వున్నట్లు కనిపిస్తోంది ప్రజాస్వామ్య పద్ధతిలో వ్యవహారమంతా జరుగుతుందికాబట్టి ఏమీ ఇబ్బంది వుండదు ఏమితంటాలు చేసినా, 3 సంవత్సరములవరకు చేస్తారు అంతకంటె ఎక్కువకాలము చేయడానికి వీలు వుండదు తరువాత elections లో మరల రారు అంతమాత్రం adjust చేసుకొనే capacity వారికి లేకపోలేదు గ్రామస్థాయిలో గ్రామస్తులు, తాలూకా స్థాయిలో తాలూకా నాయకులు, వారి వారి పనులు నెరవేర్చుకోగలరు ఎక్కువ గ్రామాలకు సంబంధించినపుడు బ్లాకు సమితి ఎక్కువ block లకు సంబంధించినపుడు జిల్లా స్థాయిలోను, ఎక్కువ జిల్లాలకు సంబంధించినపుడు రాష్ట్రస్థాయిలోను, కార్యక్రమములను అమలుపరచవలెను గ్రామాలలోని Civil, Criminal వ్యవహారములు వారే పరిష్కరించుకొనే లాగున వారికి తోడ్పడుతూ వుండాలని మనవి చేస్తున్నాను బ్లాకు సమితులు వచ్చినవి బ్లాక్ సమితులలో ఎవరు వుండాలంటే పంచాయితీ బోర్డుల Prsidents అన్నారు ఒక్కొక్క గ్రామమునుంచి ఒక్కొక్కరికి deputation వుంటుంది వారు అక్కడ దానిలో వుండడము తప్పుకాదు వారికి అధికారములన్నీ ఇవ్వడము తప్పుకాదు M L A లు వున్నారు, వీరికి కూడ దానిలో votingహక్కు ఇవ్వడములో తప్పులేదు వీరుకూడ ప్రజాస్వామిక పద్ధతులమీద వచ్చారు పంచాయితీబోర్డు President కు వోటింగు హక్కు వుంటుంది వీరికి కాకుండా చేయడము సమంజసముగాలేదు B D O కు Block level లో అధికారములు ఇచ్చాము జిల్లాస్థాయిలో తగ్గించాము Block level లో ఇచ్చిన అదికారాలు కూడ సరియైనవికావు B D O ఒక అధికారి Administration ఇతని

చేతుల్లోలేదు క్రిందఉద్యోగులను ఏమి control చేయ గలుగుతాడు? సమితిలో వున్న Chairman సాధారణముగా వారికన్న చదువుఅక్కువగా వున్నవారు వుండవచ్చు, సమితిలో ఎక్కువ ప్రారంభజ్ఞానము లేనివారు వుంటారు బోర్డు president కు ఎటువంటి అధికారాలు వున్నవో అటువంటి అధికారాలు బ్లాకు అధ్యక్షునికికూడా ఇవ్వాలని మనవిచేస్తున్నాను Standing Committee కి full powers ఇచ్చినామని అన్నారు ఈ Standing Committee లలో ఒక technical man వుండాలి జిల్లాస్థాయిలోనికి వచ్చినపుడు M L A లు వున్నారు దీనిలో సమితి Chairman లు వుంటారు M L A లకు కూడ సర్వ విషయములు తెలుసు కాబట్టి వీరికి కూడ దీనిలో భాగము కల్పించవలయును అక్కడ వున్న Chairman ఎవరు అంటే Collector జిల్లా level లో కలెక్టరు వుండవచ్చు తాలూకా level లో తహశీలుదారు వుంటాడు రాష్ట్ర ప్రభుత్వమునకు గవర్నరు ఎట్లావుంటాడో అదేప్రకారముగా జిల్లాకు కలెక్టరు వుంటాడు ఈ విషయాలన్ని Select Committee లో బాగా ఆలోచించాలని కోరుతున్నాను మనము విప్లవాత్మకంగా స్థానిక పరిపాలనలో మార్పులు తీసుకొనివస్తున్నపుడు ఈ పరిస్థితులన్నిటిని సాకల్యముగా ఆలోచించవలయును ఈ నవయుగములో, 20 వ శతాబ్దములో, గాంధీమహాత్ముని ఆదేశాలను దృష్టిలో పెట్టుకొని, వారి పంథాలో ముందంజ వేయాలని కోరుతున్నాను దాని credit అంతా మనకే దక్కాలని కాకుండా ఎక్కువ విశాల దృష్టితో ఆలోచించి చేయవలయునని మనవిచేస్తూ విరమిస్తున్నాను

سرمتی شانتا بائی (کلوا کرتی - عام) – (Smt Shanta Bai) – ادھکشہ مہودے – پنچایت سمتی اور ضلع پرشد کا جو بل پیش ہوا ہے میں اس سلسلہ میں پلاننگ منسٹر صاحب کو یہ بات یاد دلانا چاہتی ہوں کہ گذشتہ وقت ہم نے سوچا تھا کہ بہنوں کی بہبودی کے لئے بل آئیگا - اس کا انتظار کرتے کرتے انتقال ہوگا - لیکن اب جو بل آتا ہے اوسکے دیکھنے کے بعد معلوم ہو رہا ہے کہ بہنوں کی بہبودی کے لئے اس بل میں کچھہ بھی نہیں رکھا گیا ہے - مجھے یہ بل دیکھنے کے بعد افسوس ہوتا ہے کہ یہہ جیسے کا ویسا ہے پنچایت سمتی کے چیرمین کو جو پاورس دیے گئے ہیں وہ جیسے کے ویسے ہیں - بی - ڈی - او - کو جو پاورس دئیے گئے ہیں اوسمیں تھوڑی سی تبدیلی ہوئی ہے مگر بہنوں کے لئے ابھی بھی تبدیلی نہیں ہوئی - ہمیں خیال تھا کہ آنے والے بل میں ضرور بہنوں کے لئے کچھہ گنجائش ہوگی - لیکن اوس میں ایک ہی استری کو ممبر بنانے کی گنجائش ہے - وہ بھی نہیں رکھتے تو ٹھیک ہوتا - محض رونے والے کی آنکھیں پونچھنے کے لئے یہہ رکھا گیا ہے - میں سلکٹ کمیٹی کے ممبر

بھاسوں سے یہ عرض کرتی ہوں کہ اس ب ں ریزیم لائی جا کر عورتوں کی
تعداد کو بڑھانا چاہیے بی۔ ڈی او کو جو پاورس دیے گئے ہیں سب ہی وہی
پاورس ہیں جیسے کہاں ہوا ہے۔ تھوڑا سا ہوا ہے ضلع چیرمن کو جو
پاورس ہیں کلکٹر کو بھی وہی پاورس تھے۔ ہم نے سمجھا تھا کہ پنچایت سمتی
اور ضلع پریشد کا جو بل آنے والا ہے اسمیں پورے پاورس پبلک کو دئے
جائینگے وہ نہیں ہیں ہے۔ بلاک پنچایت آفسرس چار پانچ پاس رکھے
گئے ہیں اورس میں بھی وہ کام کرنے والے ہیں۔ اتنا ہی نہیں واس چیرمن کو
کیا پاورس ہیں۔ کلکٹر چیرمن ہونگے وہ مجارٹی سے پاس کرالیگے۔ وقت کم
ہے میں بل نحیے سے پہلے ہی ختم کرنا چاہتی ہوں اس لئے اتنا ہی عرض
کرونگی کہ دس کی سرری کو ب کرنے والے ہیں۔ کیا آپ نہوں کو پنچایت۔
موسپالسی اور ضلع پریشد میں اسھان دینگے؟ مسمہ کا معامہ لجئیے۔ ایك
دایا رکھنے کا پرویزل ہوتا ہے لیکن یہ پروپوزل منظور نہیں ہوتا۔ کیونکہ
مرد مجارتی میں ہوتے ہیں یہ کہدیا جاتا ہے کہ بجٹ نہیں ہے گنجائش
نہیں وغیرہ جب آپ ھلمیہ کے متعلق نہیں سوچینگے تو دس کی بہبودی کیسے
ہو سکے گی آج دیہات میں ہماری لاکھوں بہنیں اپنی جانیں قربان کر رہی ہیں
وہاں ایك دایا بھی نہیں ملتی اگر عورتیں پنچایت سمتی میں زیادہ تعداد میں
آجائیں تو وہ عورتوں کے لئے ھلمیہ سنٹرس وغیرہ کھول سکتی ہیں۔ بل دیکھنے
کے بعد افسوس ہوتا ہے کہ منسٹر صاحب نے جو وعدے کئے تھے وہ پورے
نہیں کئے۔ مجھے یقین ہے کہ وہ جواب دینگے کہ پنچایت میں زیادہ عورتوں
نہیں آتیں ہیں لیکن میں کہونگی کہ اگر آپ کوشش کرینگے تو وہ زیادہ تعداد
میں آئیگی۔ اس لئے میں عرض کرونگی کہ پنچایت میں ۳ تا ۴ سیٹس عورتوں کو
دینا چاہئیے۔ سیٹیں کم ہے۔ دو منٹ میں وچار ختم کرنے کے لئے کہتے ہیں اس
لئے زیادہ نہ کہتے ہوئے یہ کہونگی کہ مجھے اُمید ہے کہ سلکٹ کمٹی کے
ممبر بھائی ضرور عورتوں کی تعداد بڑھانے پر غور کرینگے

مسٹر ڈپٹی اسپیکر۔ میں نے ۱ منٹ آپ کو دیے تھے۔ دو منٹ نہیں
کہا تھا

శ్రీ కె సుబ్బారావు (హిందూపూరు-జనరల్) అధ్యక్షా - ఈ పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తుల పేరిట ఈ శాసన సభలో ప్రవేశపెట్టిన బిల్లు అధికార వికేంద్రీ కరణమునకా? లేక ఇదివరకు జరుగుతున్నపనిని ఒక చట్టము పేరుతో తయారు చేసి ప్రజలను మభ్యపెట్టుటకా అనే విషయం తెలిసికొన వలసియున్నది జిల్లాబోర్డ్సులో యీ ఏడు సంవత్సరములుగా జరుగుతున్నటు వంటి వ్యవహారములకు యీ నాటితో తిలోదకములు యిచ్చుచున్నట్లు ఉన్నది

జిల్లాబోర్డులు పోతే పోయినవి ప్రజల హక్కులకు, అధికారాలకు లోపము లేకుండ నిజమైన ప్రజా తంత్రాన్ని, రాజ్యాంగ యంత్రాన్ని సృష్టిచేస్తున్నామా అనే విషయం మంత్రిగారు ఆలోచించవలయునని ప్రార్థించుచున్నాను

శాసన నిర్మాణములో మూడు భాగములు ఉన్నవి, ప్రథమ పఠనము, ద్వితీయ పఠనము, తృతీయ పఠనము మనము ఇప్పుడు మొదటి పఠనములోనే ఉన్నాము కాబట్టి బాగా ఆలోచన చేసి దీనిని రూపొందించవలెనని మనవి చేయుచున్నాను స్థానిక సంస్థల యొక్క అధికారములలో శూన్య స్థితిని తెచ్చిపెట్టుట మంచిది కాదు ఇందులో పేర్కొనిన పంచాయితీ సమితుల అధికారములు ఏమిటో చెప్పమని అడుగుచున్నాను అధికారములు ఏమీ కనబడుట లేదు శూన్యముగా ఉన్నవి స్థానిక సంస్థలను కొన్ని అధికారములతో సృష్టిచేయవలెనని మంత్రిగారికి ఉంటే పెద్దలు చెప్పిన ఒక వాక్యమును వారి జ్ఞప్తికి తెచ్చుచున్నాను

"It has always been recognised that local Government is desirable not only for the service it renders to Government but just as much for the opportunities it offers to men and women to enjoy an active participation in the Government of Commonwealth and in the process to convey a creative talent and sensibility. To this end, freedom, power and status are necessary"

కాని ఈ freedom, power, status ఇప్పుడు సృష్టించుచున్న పంచాయితీ సమితులలో ఉన్నవా? లేవు ప్రజలకు అధికారము యివ్వవలయునని కోరిక ఉంటే పైనచెప్పిన విషయములు ఆలోచించి చేయవలసియున్నది ఆ నాడు బ్రిటిషు ప్రభుత్వ పాలనలో — అది లోకల్ సెల్ఫ్ గవర్నమెంటు అనండి, లేక స్వల్ప గవర్నమెంటు అనండి- కొన్ని అధికారములు ఉండినవి ఈనాడు పల్లెలలో పరిపాలన చేయగలిగిన శక్తి సంపన్నులు, ఇక్కడ ఉన్న మంత్రుల కంటె చక్కగా పరిపాలన చేయగలిగిన డిబా, శక్తి కలిగినవారు, ఉన్నారని అనుకొని వారికి అధికారములు యివ్వండి, కొన్నాళ్ళు చెడితే చెడుతుంది ఈ రోజున రాజ్యాన్ని పరిపాలన చేస్తున్న మంత్రులు చక్కగా చేస్తున్నారని అనుకొనుట చాల పొరపాటు తప్పులుంటే సరిదిద్దుకొంటారు. కాబట్టి పంచాయితీ సమితులకు అధికారాలు వికేంద్రీకరణచేసి యివ్వవలయును, పూర్వము ఆ స్వల్ప గవర్నమెంటు అనుకొన్నదానికి బ్రిటిషు ప్రభుత్వం యిచ్చిన అధికారములనుకూడ తీసివేసి, ఇప్పుడు ఆఫీసర్లకు ఎక్కువ అధికారములు

ఇచ్చినారు ఇప్పుడు బి డి ఓ లకు ఉన్న అధికారములు, జిల్లా కలెక్టర్లకు యిచ్చుచున్న అదికారములు గమనించినట్లయితే ప్రజలచేత ఎన్నుకొనబడి వచ్చినవారి పేరిట ముద్రవేయించి తమ పనిని చక్కగా నడిపించుకొనుటకు చేస్తున్న రాజ్యాంగ కుతంత్రముగాని, ఇది ప్రజాతంత్రము కాదని స్పష్ట మౌతుంది కాబట్టి ప్రజాతంత్రము కావలెనంటే పంచాయితీ అధ్యక్షులకు సర్వాధికారములు యివ్వవలెను ఇందులో బి డి ఒ అనే పేరు ఉన్నచోట పంచాయితీ ప్రెసిడెంటు అని పెట్టుట అవసరము పంచాయితీ ప్రెసిడెంట్సుకు విద్యకు సంబంధించిన వ్యవహారమంతా యిస్తున్నామని చెబుతున్నారు ఈ దినము ఒక్కొక్క పంచాయితీ సమితిలో నూటికి పైబడి స్కూల్సు ఉన్నవి ఈ స్కూల్సులో ఉపాధ్యాయులు చదువు చెబుతున్నారా? లేదా? చూచేవారు ఎవరు? ఒక ఉపాధ్యాయుడు 14 దినములు స్కూలును మూసివేసి, స్కూలుకు వెళ్ళకుండా ఉండినట్లయితే, అతనిని దండించే శక్తి ఎవరికి ఉన్నది ? పంచాయితీ ప్రెసిడెంటు వెళ్ళి "నీవు స్కూలుకు ఎందుకు రాలేదు?" అని అడిగితే "అడుగుటకు నీవు ఎవరు?" అనే ప్రశ్నకూడావస్తున్నది కాబట్టి ప్రెసిడెంట్సు చేతిలో అధికారము లేకపోతే వారిని గౌరవించే వారు లేరు ఇప్పుడు సాధారణ శాసన సభ్యులుగా మనము పోతే దేశములో ఎవరు ఎంత మర్యాద చేస్తున్నారో చెప్పమని అడుగుతున్నాను అధికారము ఉంటేనే "నా విష్ణుః పృధివీపతిః !" అన్నీ కటాక్షం ఉంటుందని చెప్పారు అది ఉంటేనే బజారులో తిట్టేవారుకూడ మంత్రులను సనుకువచ్చి పూలహారములు వేయుదురు కాబట్టి అధికారము ఉంటేనే. అది భగవద్దత్తముగా లేక ప్రజా స్వామ్య దత్తముగా వచ్చినదనే భావము ఉంటేనే, గౌరవము, భక్తి. శక్తి సంపన్నత ఉండి దేశములో తిరుగుటకు వీలుంటుంది నామకః పంచాయితి అధ్యక్షులుగా చేసినంతమాత్రాన ప్రయోజనం ఉండదు కాబట్టి ఈ చట్టములో బి డి ఓ అని ఉన్నచోటల్లా పంచాయితి ప్రెసిడెంటు అని పెట్టి బి డి ఓ ను పంచాయితీప్రెసిడెంటుకు నౌకరుగాచేయండి ఆవిధంగా చేయకపోతే ఆఫీసర్సు అంతాపెద్ద కొమ్ములు పెట్టుకొని వ్యవహారం చేయవలసినదేనా ? బి డి ఓ ను ఆఫీసర్లను చేతిక్రింద ఉంచి నడిపించగలిగే శక్తి ఉంటేనే, ఆ అధికారము పంచాయితీ ప్రెసిడెంట్సుకు యిస్తేనే సెల్ఫ్ గవర్నమెంటు అనండి, స్వల్ప గవర్నమెంటు అనండి, లేక వికేంద్రీకరణ అనండి, మీరు (ప్రభుత్వము) చెప్పే పదమునకు అర్థము ఉంటుందిగాని లేకపోతే లేదు అని చెబుతున్నాను

ఈ బిల్లులో జిల్లా పరిషత్తుల నిర్మాణం గురించి చెప్పినారు ఇది జిల్లా బోర్డ్సుకు తిలోదకములిచ్చి ప్రత్యామ్నాయంగా జిల్లా పరిషత్తులను పెట్టినా మని ప్రజలను మభ్యపెట్టడము తప్ప ఇం కేమీలేదు ప్రతి తాలూకాలో ఉండే

పంచాయితీ సభ్యులు కలసి జిల్లా పరిషత్తుకు ఎన్నుకొనమని ఎందుకు చెప్ప కూడదు ? శాసన సభ్యులు పంచాయితీ పని చేయుటకు ప్రజలవద్ద ఓటు తీసుకొనలేదు కాబట్టి ప్రజలనుంచి డైరెక్టుగా ఎన్నిక అయివచ్చిన పంచాయితీ మెంబర్సు ఏ ఏ బ్లాకులో ఎంతమంది ఉన్నారో వారంతా ఒకరినో, యిద్దరినో ఎన్నుకొనేట్లుచేసి, అధికారములతో కూడిన జిల్లా పరిషత్తును నిర్మాణము చేయండి పరిషత్తు శాసనయినకు సరిసమానత్వము ఉండవలెను ప్రభుత్వ నౌకరీగా ఉండే జిల్లా కలెక్టరు సభ్యులందరికన్న పెద్ద హోదాలో పరిషత్తులో కూర్చుంటే, పంచాయితీ సమితుల అధ్యక్షులు ఆ జిల్లా పరిషత్తులో సభ్యులుగా కూర్చొని ఏవిధముగా ప్రవర్తించవలెనో చెప్పమని నేను ప్రార్థించుచున్నాను.

ఎటికి జిల్లా ఎడ్వయిజరి కౌన్సిల్స్ అని పేరు పెట్టండి జిల్లా పరిషత్ అని ఇంత పెద్దపేరు పెట్టడం ఎందుకు ? డైరక్టు ఎలక్షన్స్ నుండి వచ్చిడి డెవలప్ కౌన్సిలు మెంబర్సు ఒక్కొక్క డెవలప్‌మెంటు కౌన్సిల్ నుంచి ఒక్కొక్క మెంబరును జిల్లా పరిషత్‌కు ఎన్నుకొనే పరిస్థితులుచేసి, అక్కడ ప్రెసిడెంటుకు సర్వాధికారాలు ఇస్తే, నిర్మాణాత్మకమైన కృషికి అవకాశముంటుందనే భయంతప్ప పేరుకాదు మీకు ఎంత ఉత్సాహంమున్నదో, మీకెంత అవకాశం భగవంతుడు ఇచ్చాడో, అల్లానే ప్రజలందరకు దేశమును ముందుకు తీసుకు వెళ్ళుటకు నిర్మాణాత్మకమైన కృషిలో సర్వకాల సర్వావస్థలయందును పని చేయవలెననే అభిలాష ఉన్నదనేది మనస్సులో పెట్టుకొనవలెను వారికి అధి కారము ఇచ్చినచో దుర్వినియోగపు చేయరనేది దృష్టిలో పెట్టుకొని జిల్లా పరిషత్‌లకు కూడ అధ్యక్షుడు ఎన్నుకోబడే అవకాశం ఇవ్వాలి

సెకండరీ ఎడ్యుకేషన్ కౌన్సిల్స్ పెట్టాలని నేను మనవి చేస్తున్నాను ప్రభుత్వ ఉద్దేశములో, జిల్లా పరిషత్‌లు నిర్మాణాత్మకమైన ప్లానింగ్ పని చేయటానికే ఉన్నవిగాని, యీ విద్యా విషయంలో ఐక్యం కలిగించుకొని పనిచేసే అవకాశం వాటికి లేదు పల్లెలలోని హైస్కూల్సు చక్కగా నడవా లంటే, జిల్లా పరిషత్‌నుండి ఒక సెకండరీ ఎడ్యుకేషన్ కౌన్సిల్‌ను ఏర్పాటు చేయవలసి ఉన్నది బ్లాక్‌లలో, పల్లెలలో ఉన్నటువంటి అన్ని హైస్కూల్సుపైన యీ కౌన్సిలుకు అధికారం ఉండేటట్లు చేస్తే, రాష్ట్రంలో విద్య అభివృద్ధి చెందుటకు అవకాశం ఉన్నది ఆ విధంగా యీ బిల్లులో మార్పులు తెచ్చి నచో, రాష్ట్రములో స్థానిక స్వపరిపాలన చక్కగా నడిచి, వికేంద్రీకరణ పరిపాలన అగుటకు ఉపకారిగా ఉండునని తెలుపుతూ ముగిస్తున్నాను

శ్రీ బి రామారెడ్డి (మైదుకూరు) అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశ పెట్టిన బిల్లులోని "ఉద్దేశములు - కారణములు" లో "శ్రీ బల్వంతరాయ్

మెహతా అధ్యక్షత క్రింద నియమింపబడిన సమాజవికాస పరిశీలక బృందము యీ సమస్యను సవిస్తరముగా పరిశీలించి, గ్రామములలో పంచాయితీ నేర్పాటు చేయవలెననియు, బ్లాకు మరియు జిల్లా స్థాయిలలో ప్రజాస్వామ్య పద్ధతులపై పరిపాలన వికేంద్రీకరణ చేయవలెననియు, సూచించెను" అని ఉన్నది ఆ సూచన ప్రకారముగా యీ బిల్లు ప్రవేశపెట్టబడుతున్నదని మంత్రిగారు అన్నారు ఈ బిల్లు "శ్రీరాగం పాడుతూ అదే భైరవి రాగం అనుకో"మని చెప్పినట్లుగా ఉన్నది మొదట ప్రభుత్వంవారు యీ బిల్లు ప్రజాస్వామ్య పద్ధతులపైన, ప్రజలకు అనుగుణంగా తెస్తాని అన్నారు కాని మొట్టమొదటే, (ప్రథమకబళే మక్షికా పాతః) అన్నట్లు సెక్షన్ 4 ఎ లో ఈవిధంగా అన్నారు "పట్టణసమితి అధ్యక్షుడుగాని, పంచాయితీ సమితిలో సభ్యుడుగా ఉండ నిరాకరించినచో లేక అట్టి సభ్యత్వమునకు రాజీనామా చేసినచో లేక అతని సభ్యత్వము అన్యథా విరమించినచో ఆయన అట్టి నిరాకరణ, రాజీనామా, విరమణ తేదీ మొదలుకొని సందర్భానుసారముగా పంచాయితీ అధ్యక్షుడుగా ఉండుటకుకూడ అర్హత కోల్పోవలె" నన్నారు తన గ్రామంలోని అందరి ప్రజలచేత ఎన్నుకోబడిన అధ్యక్షపదవినికూడా కోల్పోవాలనటం ఇది ఏ మార్కు ప్రజాస్వామ్యమో అర్థం కావటంలేదు "నీవు ఉండటం సాధ్యం కాకపోతే నీ ప్రతినిధిని పంపించ"మని చెప్పటం సబబైన పద్ధతిగాని, 'నీవు ఫలానాచోట్లో కూర్చోమంటే కూర్చోలేదు కాబట్టి అందరి ప్రజలయొక్క అనుమతితో లభించిన అధ్యక్షపదవినుండి కూడ విరమించుకోవాలని చెప్పటం, ఇదేమి ప్రజాస్వామ్యమో అర్థంకావటంలేదు బ్లాక్ సమితులలో విద్యారంగంలో ప్రావీణ్యత గలవారినికూడ సహసభ్యులుగా చేర్చుకోవలసిన అవకాశం యీ బిల్లులో గలుగజేయవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను సహసభ్యుల కాలం ఒక సంవత్సరమే ఉంచారు మిగతా సభ్యులందరి కాలం మూడుసంవత్సరాలుంచగా, వీరికి మాత్రం ఒక సంవత్సరమే పరిమితి పెట్టటం ఎందుకని అడుగుతున్నాను అందరికి అవకాశం ఇవ్వాలనే ఉద్దేశంతో ఆ విధంగా పెట్టామని మంత్రిగారు చెప్పారు అందరికి అవకాశమివ్వటం ఎమవుతుందో గాని, దీనివల్ల అందరూ కొట్లాడుకొనే అవకాశం ఇచ్చినట్లు అవుతుంది కాబట్టి వారికి కూడ మూడు సంవత్సరాల కాలం ఇస్తే బాగుంటుందని నా సలహా ఈ విషయాన్ని సెలక్టుకమిటీ సభ్యులు పరిశీలించాలని కోరుతున్నాను శాసనసభ్యులకు జిల్లా పరిషత్‌లలో, బ్లాక్ సమితులలో కూర్చొనుటకు అర్హత ప్రసాదించామన్నారు కొన్ని వేల మంది ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభ్యులకు అందులో వోటుచేసే హక్కు ఇవ్వటం వారి గౌరవానికి లోపం అన్నారు వారి వాక్కుకు లోపం ఏమిటో నాకు తెలియటములేదు శాసనసభ్యుల హోదాలో వారు పంచాయితీ సమితులకు అధ్యక్షు

లుగా ఉండే అవకాశం ఇస్తే బాగుంటుంది వారు ఇక్కడ సంపాదించే అనుభవాన్ని బట్టి అక్కడ పనులు సక్రమంగా చేయటానికి అవకాశం ఉంటుంది అటువంటి అవకాశం ఇవ్వకపోవటానికి కారణం ఏమిటో తెలియటంలేదు ఖాళీ విస్తరి వేసి, పంచభక్షపరమాన్నాలన్నీ అక్కడ ఉన్నాయని అనుకోమని అన్నట్లుగా అధికారరహితమైన పంచాయితీ సమితులను ఏర్పాటుచేయబోతున్నారు పంచాయితీ సమితి అధికారాలన్నీ బి డి ఓ చేతిలో పెట్టినారు అట్లాగే జిల్లా పరిషత్ అధికారాలన్నీ కలెక్టర్ చేతిలో పెట్టినారు చివరకు ఒక ప్యూన్‌ను ఎపాయింట్ చేసే అధికారం, ప్యూన్‌కు ఫైన్ వేసే అధికారం కూడ యీ సమితులకు లేకుండా చేశారు ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభ్యులు ఎన్నుకొన్న మంత్రులకు తాము సక్రమంగా, ఎట్టి లోపాలులేకుండా పరిపాలన చేస్తున్నామనే ధీమా ఉన్నప్పుడు, శాసనసభ్యులు జిల్లా స్థాయిలో అధ్యక్షులుగా ఉండి ఎందుకు సక్రమంగా కార్యక్రమం నడపలేరో అర్థంకాదు వారు అధ్యక్షులుగా ఉండి కార్యక్రమాన్ని నడపలేరని అనుమానపడడం ఎందుకో, వాళ్ళని అంత హీనంగా, చేతకానివాళ్ళుగాచూడటం ఎందుకో అర్థంకాకుండా ఉంది తాము తప్ప విజ్ఞానవంతులు ఎవరూ లేరని ప్రభుత్వంవారి యొక్క భావమా? ప్రభుత్వం ప్రతి విషయంలోను శాసనసభ్యులను, ప్రజలను ఒక విధమైన చిన్నచూపు చూస్తూ తమకంటే ఎవరూ విజ్ఞానధనులు లేరనే ఉద్దేశ్యంతో వ్యవహరిస్తున్నది అధ్యక్షునిపైన, ఉపాధ్యక్షునిపైన విశ్వాసరాహిత్య తీర్మానం ఐదింట మూడువంతులు మెజారిటీ ఉన్నప్పుడే పాస్ అవుతుందని అన్నారు సగంకన్నా ఎక్కువ ఉండి, ఐదింట మూడువంతులకన్నా తక్కువమంది సభ్యులు విశ్వాసరాహిత్య తీర్మానానికి అనుకూలంగా వోటు వేసినప్పటికీ, ఆ తీర్మానం పాస్ కావలసి ఉన్నది సభ్యులలో సగానికంటే ఎక్కువమంది ఆ అధ్యక్షునిపై అవిశ్వాసం కలిగిఉన్నప్పుడు, వారు ప్రతిదఫా దైనందిన కార్యక్రమాలకు అడ్డుపెస్తూఉంటారు అటువంటి పరిస్థితిలో ఆ అధ్యక్షుడు అధికారపదవిలో ఉంటేనేమి? ఊడితేనేమి? కాబట్టి మెజారిటీపక్షం విశ్వాసరాహిత్య తీర్మానానికి అనుకూలంగా ఉంటే, ఆ అధ్యక్షుడు పదవి వదలిపెట్టటం మంచిది కాబట్టి సగంకంటె ఎక్కువమంది విశ్వాసరాహిత్య తీర్మానానికి అనుకూలంగా ఉంటే, ఆ అధ్యక్షుడు తన పదవినుండి దిగిపోవటం ఉచితము ఆ విధంగా బిల్లులో ఏర్పాటుచేయాలని కోరుతున్నాను

కలెక్టరుగారు ఏకారణంచేతనైనా రాలేకపోయినట్లయితే విశ్వాసరాహిత్య తీర్మానమును వాయిదా వేసి ముప్పదిరోజుల తరువాత మరల తీసుకోవచ్చునని చెప్పారు వారు సమావేశానికి ఎందుకు రాకుండాపోవాలి? అంత అవాంతరపరిస్థితులు ఏమి ఏర్పడుతాయి? అదేవిధంగా, ప్రజలచేత ఎన్నుకోబడిన

సభ్యులు అవాంతరపరిస్థితులు ఏర్పడిరాలేకపోతే అధ్యక్షులకు ఇచ్చిన అవకాశమే వీరికికూడ ఎందుకు ఇవ్వకూడదు? ఒకఏఱు వుంటుందనుకోండి ఆఏటికి ఇవతలి వైపునకొంతమంది, అవతలివైపున కొంతమంది సభ్యులు ఉంటారనుకోండి పెద్ద వర్షం కురవడంవల్ల, ఏఱు పొంగడంవల్ల అవతలివైపున వున్నసభ్యులు సభకు హాజరుకాలేకపోతే కలక్టరుగారికి ఇచ్చిన మినహాయింపే సభ్యులకుకూడ ఎందువల్ల ఇవ్వకూడదని అడుగుతున్నాను కాబట్టి, ఇటువంటి అవాంతరపరిస్థితులు ఏర్పడినప్పుడు సభ్యులు రాలేకపోతే, 30 రోజుల తరువాత ఆ విశ్వాసరాహిత్య తీర్మానాన్ని పెట్టవచ్చుననే విధంగాచేస్తే బాగుంటుంది ఈలోపాన్ని సెలక్టు కమిటీలోనయినా పూరించాలని కోరుతున్నాను ప్రజాస్వామ్య పద్ధతి అనే పదాన్ని నేతిబీరకాయలోని నెయ్యివలె చేయకుండా నిజమైననేయి వుండేటట్లు చేసి, ప్రజాస్వామ్యత్వము ఘనీభూతం అయ్యేరీతిగా, ప్రజాస్వామ్య ప్రతిపాదనలు యీబిల్లులో ప్రతిబింబించేరీతిగా చేయాలని కోరుతున్నాను ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులకే సర్వాధికారములు ఇచ్చినట్లయితే ఇది ప్రజాస్వామ్య పద్ధతిలో ఏర్పడినబిల్లు అనిపించుకుంటుందికాని, లేకపోతేకాదు ఇది కేవలం మేకతోలు కప్పిన బెబ్బులివలెనే తయారవుతుంది కృత్రిమవాతావరణం కల్పించి, కృత్రిమరూపంలో ఏర్పాటుచేయబడిన సమితులుగాకుండా చేయాలని నేను సెలక్టుకమిటీవారిని పదేపదే ప్రార్థిస్తూ విరమించుకొంటున్నాను

శ్రీ జి రామస్వామిరెడ్డి (పెదకూరపాడు) అధ్యక్షా, ప్రణాళికా శాఖామాత్యులు సభముందు ప్రవేశపెట్టినబిల్లును మనం సూక్ష్మంగా విమర్శించుకొనే సందర్భంలో నా అభిప్రాయములను తెలియజేస్తున్నాను ఇప్పుడు కొంతమందిసభ్యులు చెప్పినట్లుగా యీ బిల్లుయొక్క ఉద్దేశంపైకి బాగానే వున్నది ప్రజాస్వామికంతోకూడిన బ్రహ్మాండమైన బిల్లుగా సృష్టించబడినది ఇదంతాపైకి పేరుకుమాత్రమే కనిపిస్తున్నది కాని, ఆచరణలో ప్రజాస్వామ్యం అనేది ఎక్కడాలేదు పాషాణంమీద పంచదారపూత పూసినవిధంగా విభిన్నమైన మూలసిద్ధాంతాలతో పైకిమాత్రం బాగుగానున్నట్లు కనిపించేబిల్లు ఇది. అధికారం వికేంద్రీకరణ అని చెబుతూ ఉంటారు కాని యీబిల్లులో అధకార వికేంద్రీకరణం అనేది ఏమీలేదని చెబుతున్నాను కొన్ని ఇతర రాష్ట్రములలో జిల్లాస్థాయిలో ఎక్కువ అధికారాలను ఇచ్చారు కొన్ని రాష్ట్రాలలో సమితులకు ఎక్కువ అధికారాలిచ్చారు మన బిల్లులోకూడ సమితులకే ఎక్కువ అధికారాలను ఇచ్చినట్లు చూపించారు బాగానే వున్నది సంపూర్ణమైన అధికారాలు సమితులకు ఇవ్వవలసినదే కాని యీ అధికారాలన్నీ బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు చేతిలోవున్నాయనేది ఇప్పుడు స్పష్టంఅవుతున్నది సమితి కార్యక్రమాలను నిర్వహించడంలో సమితి అధ్యక్షులకు పూర్తి అధికారం

ఉండడం అత్యావసరమని గమనించవలసియున్నది ఇప్పుడు అధికారాలన్నీ బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరు చేతిలోనేవున్నాయి సమితి అధ్యక్షులు రికార్డులు తెప్పించుకొని పరిశీలన చేయడానికికూడ అధికారంలేదు ఆ అధికారాన్ని యీ బిల్లుద్వారా మనం అరికట్టినాము ప్రజాస్వామ్యానికి భంగికరమైన విధంగా జరుగుతున్నప్పటికినీ రికార్డునుచూచి సరిదిద్దే అవకాశం సమితి అధ్యక్షులకులేదు దీనినిబట్టి, బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరు సర్వసత్తాకమైన డిక్టేటర్ షిప్ వహించే అవకాశం ఉన్నది యీ విషయాన్ని ప్రభుత్వం గమనించాలి ప్రజాస్వామ్య సూత్రాలపై నిర్మించబడిన సమితులలో పాకిస్థాన్ లో అయూబ్ ఖాన్ కువున్న అధికారాలకంటె ఎక్కువ అధికారాలను బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరులకు ఇవ్వడం జరుగుతున్నది ఇది ప్రజాస్వామ్యానికి అపాయమును తెచ్చిపెట్టే విధానమని ప్రజాళికాశాఖామాత్యులు గుర్తించాలి కొన్ని సందర్భాలలో సమితుల అంగీకారం లేకుండానే బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరులు కొన్ని కార్యక్రమములను నెరవేర్చడానికి అవకాశములు ఇచ్చారు ప్రజాస్వామ్యంలో ప్రజాసంస్థలలో విపత్కర పరిస్థితులుఏర్పడే కొన్ని సందర్భాలు ఎందుకు ఏర్పడుతాయి? కేవలం బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరులు సమితుల అనుమతిలేకుండా కొన్నిపనులు చేయడానికి యీ అవకాశం కల్పించారు ఇది ప్రజాస్వామికానికి లోపభూయిష్టమైన విధానం, దీనిని సరిదిద్దుకోవలసియున్నది మనకు ఇంకా చాలా అవకాశంవున్నది ఇప్పుడు సభ్యుల అభిప్రాయాలను తీసుకొని, సెలక్టుకమిటీలో తగువిధంగా సవరించుకోవలసినదని మనవిచేస్తున్నాను

జిల్లా పరిషత్తువిషయం కొంతవరకు ఫరవాలేదు, వాటిని గురించి విభిన్న అభిప్రాయాలు పరిశీలించవలసిన అవసరంలేదు నామినేషనుల విషయంలో ప్రభుత్వం ఐక్యం కలిగించుకోకపోవడమునేది మరొక ప్రశంసనీయమైన విషయం మొత్తం బ్లాక్ సమితి అంతా సమావేశమై 5 మంది సభ్యులను కో-ఆప్ట్ చేయాలనే విధానంకూడ ప్రశంసనీయమైనది ఈ విషయంలో నేను ప్రభుత్వ విధానాన్ని బలపరుస్తున్నాను మన రాష్ట్రంలోని 26 వేల గ్రామాలలో దాదాపు 450 సమితులను ఏర్పరచుకొనే మహత్తరమైన కార్యక్రమంలో ప్రభుత్వం ప్రిస్టేజ్ కి తగదని భావించకుండా ప్రజలందరి సహకారంతీసుకొని ఆలోచించాలని మరలమరల మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ రామూరెడ్డిగారు చెప్పినట్లుగా ప్రజలచేత ఎన్నుకోబడిన సభ్యులకు ఓటుచేసే హక్కు లేకపోవడమనేది విచారకరమైన విషయం ప్రజల అనుమతి మీద వచ్చిన శాసన సభ్యులకు సలహాలు చెప్పేందుకు నోరుమాత్రమే యిచ్చి, ఓటు చేయడానికి చేయి ఇవ్వకపోవడం మంచిదికాదు ఓటుచేసే హక్కుకూడ

ఇస్తే బాగుండేది శాసనసభ్యుని హక్కునుగాని ప్రజాస్వామ్యంలోని నమ్మకాన్ని గాని ఎందుకు శంకించాలో నాకు అర్థంకావడంలేదు

సమితుల పరిపాలనావిధానంలో సమితుల అధ్యక్షులకు ఎటువంటి హక్కులు కూడ లేవనేది విదితం బ్లాక్ ఏరియాలో ప్రాథమిక విద్య, రోడ్లు మున్నగు సదుపాయములు కల్పించుకోడానికి, విలేజ్ లెవెల్ వర్కర్స్ వంటి చిన్న చిన్న ఉద్యోగులను ఆ బ్లాకు ఏరియాలో ట్రాన్స్ఫర్ చేసుకోడానికి ప్రజల విజ్ఞప్తిని మన్నించి పని చేయడానికి పంచాయితీ సమితి అధ్యక్షులకు అధికారం ఇస్తే బాగుంటుంది అంతిమ నిర్ణయాలు చేసేముందు సెలక్టు కమిటీలో యీవిషయాలన్నీ గమనించి, ఆలోచించి, తగు సూచనలను ఆమోదిస్తారని భావిస్తూ, అధ్యక్షులవారు అవకాశం ఇచ్చినందులకు వారికి ధన్యవాదాలు అర్పిస్తూ నేను విరమించుకుంటున్నాను

శ్రీ జె చొక్కారావు (కరీంనగర్) అధ్యక్షా, నేను యీ బిల్లును బలపరుస్తున్నాను బల్వంతరాయ్ మెహతా కమిటీ రిపోర్టు ననుసరించి పరిపాలనలో వికేంద్రీకరణ పద్ధతిని ఒప్పుకుంటూ భారతదేశంలో ముందుగా మన ఆంధ్రప్రదేశ్‌లో బిల్లు తేవడమే కాకుండా, బిల్లు రాకపూర్వం experimental గా ప్రతి జిల్లాకు ఒక సమితి చొప్పున తెలంగాణాలో పంచాయితీ కమిటీలకు ఎన్నికలు జరుగకపోయినా, సమితులు ఏర్పడినాయి ఆంధ్ర ప్రాంతంలో కలక్టరు నామినేట్ చేసిన సభ్యులతో సమితులు ఏర్పాటు చేయడం జరిగింది ఆ సందర్భంలో నామినేషన్ పద్ధతి మీదనే యీ వ్యవహారంజరుగుచున్నది ఎన్నికలు పెట్టడంలేదు అనే విమర్శవచ్చింది యీనాడు కూడ ప్రజాస్వామ్య పద్ధతిలో జరగడంలేదు, డైరెక్టు ఎలక్షన్స్ జరపాలి అనే వాదన ఉన్నది ఇది గ్రామాల అభివృద్ధికి జరిగేపని కనుక, గ్రామ ప్రజలు ఎన్నుకున్నటువంటి పంచాయితీ కమిటీ అధ్యక్షులతో కూడిన సమితులు ఏర్పడుతున్నాయి కనుక ఇది ప్రజాస్వామ్య పద్ధతిలోనేఉన్నదని చెప్పవచ్చు

ఇక డైరెక్టు ఎలెక్షనుపద్ధతి ఏ విధంగా మంచిదో నాకుమాత్రం తెలియడములేదు నిన్న ప్రతిపక్ష నాయకులు శ్రీ సుందరయ్యగారు యిది గుడ్డిలో మెల్ల అని అంగీకరించారు ప్రభుత్వం ఏది తీసుకొచ్చినప్పటికి దానిని విమర్శించాలనే వుద్దేశంతో విమర్శిస్తున్నట్లు తెలుస్తున్నది

ఈ పంచాయితీల నిర్మాణంలో ఏ ఒక్కరిని nominate చేసే పద్ధతి లేదు ఇంక సలహాలు యిచ్చేవారు అవసరం అనుకుంటే—ఒక మహిళాసభ్యురాలు, యింకొక హరిజన సభ్యుడు, మరొకరు కో-ఆపరేటివ్ వ్యవహారాలనుండి,

మరొక యిద్దరు యితరులు—వీరిని co-opt చేసుకునే అధికారం వుంది అది నామినేషన్ పద్ధతి కాదు ఏ విధంగా పరిశీలించినప్పటికి యీ పద్ధతి ప్రజాస్వామ్యానికి అనుగుణంగానే కనబడుతున్నది

ప్రతి గ్రామంలోను ప్రజల విశ్వాసాన్ని చూరగొని ప్రజలచే ఎన్నిక అయినవాడే గ్రామ కమిటీ అధ్యక్షుడుగావుంటాడు ఈ గ్రామ కమిటీ అధ్యక్షులందరూ కలిసి ఎన్నుకొన్న సమితి అధ్యక్షునికి గ్రామకమిటీ సహకారం లభిస్తూనే వుంటుంది

**Standing Committees** గురించి నేనొక సూచన చేయదలచుకున్నాను ఈ **Standing Committees** లో **proportional representation** వుండే పద్ధతి అవలంబించడం మంచిది దానివలన అన్నివిధాలా ఆలోచించే వారు వచ్చే అవకాశముంది M L A కు అందులో ఓటు అధికారం లేకపోవడం, ఒకవిధంగా నేను మంచిపద్ధతిగానే భావిస్తున్నాను జిల్లా పరిషత్తులలో M L A s కు ఎలాగూ ఓటు హక్కు వుంది ఇప్పుడు రెండు మూడు నియోజకవర్గాలకు కలిసివున్న బ్లాకులుకూడా వున్నవి అక్కడ M L A s అందరకు ఓటు అధికారం ఇవ్వకుండా తమ నియోజకవర్గముయొక్క అవసరాలను తెలుపుకునేందుకుగాను అక్కడి సమావేశములో వారు పాల్గొనేందుకు అవకాశం ఇచ్చారు అయితే చాలమంది M L A s యీ అధికారాన్ని కోరుతున్నారు గనుక దీనిని అంగీకరించడానికి ప్రభుత్వానికేమీ అభ్యంతరముండదనుకుంటాను ఆయా ప్రాంతాలలోని ప్రతి కమిటీలోను M L A సభ్యుడుగా వుండడానికి అవకాశం వుంది ఓటు హక్కు మాత్రం లేదు ఓటు అధికారం యిస్తే ఒక విధంగా అది **nomination** పద్ధతే అవుతుందని నేను భావిస్తున్నాను ప్రజల ద్వారా మనం శాసనసభకు వెళ్ళేందుకు ఎన్నిక అయ్యాముగాని గ్రామకమిటీకి అధ్యక్షులుగా మాత్రం ఎన్నిక కాలేదు ఈవిధంగా ఓటు అధికారం యిచ్చే విషయం సెలక్టు కమిటీవారు యోచిస్తే ప్రభుత్వానికి అంగీకరించడానికి అభ్యంతరమేమీ వుండదనుకుంటాను.

పంచాయితీ సమితి అధ్యక్షుడు ప్రజాస్వామిక విధానం ద్వారా ఎన్నిక అయి వచ్చినప్పటికీ, అతను ప్రజలకు సేవ చేయడానికి సంపూర్ణమైన అవకాశాలు లేవు ఈ విషయాన్ని మీద్వారా మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను ప్లానింగ్ శాఖా మంత్రిగారు యీ విషయాన్ని అంగీకరించేవారే వారియొక్క కృషి వలననే యింతత్వరలో యీ బిల్లు తయారవగలిగిందని నేను భావిస్తున్నాను ఇప్పుడు వున్న అధికారాలకన్న యింకా ఎక్కువ అధికారాలు పంచాయితీ అధ్యక్షులకు యివ్వడానికి సెలెక్టు కమిటీ స్థాయిలో యోచిస్తారని ఆశిస్తున్నాను ఆవిధంగా యింకా అధికారా లున్నప్పుడే

అతను సమితిద్వారా ప్రజలకు యిప్పటికన్న ఎక్కువ సేవ చేయగలుగుతాడు అయితే యింకా ఎక్కువ అధికారాలు అతనికి యివ్వడంవలన తప్పిదాలు చేస్తాడేమోననే భయం ప్రభుత్వానికి వుండి వుండవచ్చు మొన్నటి కో-ఆపరేటివ్ సమావేశాలలో పండిట్ నెహ్రూ "ప్రజాప్రతినిధులు తప్పిదాలు చేయవచ్చు అయినప్పటికి ప్రజాప్రతినిధులు అయిన వారికి ఎక్కువ అధికారాలు యివ్వాలి" అని చెప్పారు వారు సెలవిచ్చినట్లు తప్పిదాలు అధికారులవలన జరుగుతూ వుంటాయి అనధికారుల వలన కూడా జరుగుతూ వుంటాయి ప్రజాప్రతినిధులైనవారికి యింకా ఎక్కువ అధికారాలుయివ్వండి ఒకవేళ అధికార్లు తమ అధికారాలను దుర్వినియోగం చేస్తే, అవినీతికరంగా ప్రవర్తిస్తే ఆ అధికారాలను ప్రభుత్వం తన హస్తగతం చేసుకొనేవిధంగా ఒక క్లాజు యిందులో వుండనేవున్నది అందువలన అసలు భయపడవలసిన అవసరం లేదని మనవిజేస్తున్నాను ఈ క్లాజు వుండడం అవసరమని తలుస్తున్నాను

అధికారాలు యివ్వడం విషయంలో బ్లాకు ఆఫీసర్లకు ఎక్కువ అధికారాలు, అధ్యక్షునికి ఊరికే సంతకంచేసే వరకే కాకుండా అధ్యక్షునికి యింకా ఎక్కువ అధికారాలు యివ్వాలి అధ్యక్షుడు ఏమి జారీచేసినప్పటికీ అధికార్లు వెంటనే దానిని అమల్లో పెట్టే విధంగా వుండాలి సెక్షను - 21 లో 'అత్యవసరమైన అధికారాలు' అన్నారు ఇది నష్టదాయకమైన క్లాజు అని మనవి జేస్తున్నాను దీనిద్వారా బ్లాకు అధికారులు అధికారం దుర్వినియోగం చేసే అవకాశమున్నది అధ్యక్షునికి అతనికి పడనప్పుడు 'యిది అత్యవసరమైన పరిస్థితి' అని కలెక్టరుకు చెప్పి అధ్యక్షునికి తెలియకుండ పనులుచేసే అవకాశం వుంది దీనివలన ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడతాయి ఇటువంటి అధికారాలు బ్లాకు అధికారులకు వుండరాదు అధ్యక్షులకు యింకను అధికారాలు యిచ్చి, ప్రజలకు సేవజేసే అవకాశం కల్పించవలెనని, ప్రభుత్వం యిందుకు సమ్మతిస్తుందని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను

శ్రీ యమ్ సత్యనారాయణరాజు (చీపురుపల్లి-జనరల్) అధ్యక్షా, 7 సంవత్సరాల అనంతరం జిల్లాబోర్డుల కాలం పొడిగిస్తూవచ్చి, చివరకు ఒక బిల్లును తీసుకవచ్చారు బల్వంతరాయ్ మెహతా కమిటీ సలహాల ప్రకారం ప్రజాస్వామ్యపద్ధతిలో జిల్లాబోర్డులను ఉద్ధరిస్తామని, చాలాకాలానికి ఒక బిల్లును తీసుకొచ్చి మనముందు పెట్టారు నేనీ సందర్భములో ఆత్మసాక్షిగా చెప్పవలసిందని మంత్రిగారిని ఒక విషయం అడుగుతున్నాను ఏ విధంగా దానిని తయారుజేశారు ? జిల్లా బోర్డులు, పంచాయితీ బోర్డుల పరిపాలనలోకంటే వీటి వలన పరిస్థితులు మెరుగవుతాయని తలుస్తున్నారా ? ఈనాడు జిల్లా బోర్డుల

పరిపాలనలోకంటే అనేకమైన అధ్వాన్నమైన పరిస్థితులు ఏర్పడే లోపాలు యిందులో వున్నాయని మనవిచేస్తున్నాను రహస్య ఓటింగు పద్ధతి ద్వారా ప్రజలచే ఎన్నుకోనబడిన శాసనసభ్యునికి అచట ఓటింగు హక్కు లేదు పంచాయితీ సమితి అధ్యక్షుని ఎన్నికకు రహస్య ఓటింగు పెడితే ఎక్కువ ఖర్చు అవుతుందని నామమాత్రంగా తీసుకొచ్చిపెట్టే ఈ అధ్యక్షుని ద్వారా జిల్లా పరిషత్తులు, పంచాయితీ సమితులు ఏ విధంగా పనిచేయగలవో తెలుపవలసిన బాధ్యత ప్రభుత్వంపై వుంది

అనగా మామూలుగా పంచాయితీబోర్డు అధ్యక్షుడు పంచాయితీ సమితిలో సభ్యుడు అవుతున్నాడు ఈ పంచాయితీబోర్డు అధ్యక్షులు open voting ద్వారా వచ్చినవారు ఈపద్ధతి నిజమైన ప్రజాస్వామ్యం కాదు ఇదంతా false bottle మీద build up చేస్తున్న వ్యవహారం ప్రభుత్వమనే నియంతృత్వ అధికారంతో ప్రజాస్వామ్యాన్ని గొడ్డలిపెట్టుతో కొడుతున్నారు పునాదిలోనే జిల్లాపరిషత్, పంచాయితీ సమితుల ప్రతివిషయంలోనూ నియంతృత్వంగల ప్రభుత్వఉద్యోగులు జోక్యం చేసుకొంటున్నారు నిజమైన రహస్య వోటింగుద్వారా వచ్చిన శాసనసభ్యులను అక్కడ వోటింగుహక్కు లేకుండా figure heads గా ఉంచి, ఎన్నుకోబడని పంచాయితీబోర్డు అధ్యక్షులద్వారా పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్‌లు ఎట్లా పనిచేస్తాయో అది ప్రజాస్వామ్యం ఎట్లా అవుతుందో మంత్రిగారు సెలవివ్వాలి ఈ open voting ద్వారా వచ్చిన presidents కు గౌరవం ఏమయినా ఇచ్చారా ? అంటే, అదీ లేదు Presiding officer అరగంట ఆలస్యంగావస్తే ఆ Meeting ను adjourn చేసుకోవచ్చునని చెప్పారు కానీ save as provided in sub-section (4) and (5), a meeting convened for the purpose of considering a motion under this section shall not for any reason be adjourned అన్నారు అనగా ఒక motion సందర్భంలో దీనిని adjourn చేయకూడదు ఛైర్‌మన్ అయిన కలెక్టరుగారు, సమితి ప్రెసిడెంటుగారు అరగంట ఆలస్యమైతే దానిని adjourn చేయవచ్చునంటే ప్రజాస్వామ్యంయొక్క గౌరవంఏమిటి ? అని అడుగుతున్నాను

సామాన్యంగా meeting ను call for చేయడానికి not less than 15 days clear notice ఇవ్వాలి కానీ emergency కి 7 రోజులకంటె ఎక్కువ time అక్కరలేదని చెప్పారు అసలు emergency లో సభ్యులు రావడానికి, విషయాలను గురించి ఆలోచించడానికి ఎక్కువ time ఇవ్వాలి అటువంటి అవకాశాలు ఏమీ ఈ బిల్లులో లేవు ఇది ప్రజాస్వామ్యమని ఎలా చెప్పుకోగలుగుతున్నారో ఆశ్చర్యంగా ఉంది జిల్లా బోర్డులను రద్దుచేస్తూ వాటిస్థానే

వీటిని తీసుకొని వస్తున్నామని చెప్పడంకూడ ఎంతమాత్రం సమంజసంగా లేదని మనవి చేస్తున్నాను కొంతమంది సభ్యులు, ఈవేళలోనె పంచాయితీ సమితులకు, జిల్లా పరిషత్తులకు అధికారాలు ఇస్తె దుర్వినియోగం చేయబడతాయెమోనన్న భయాన్ని వెల్లడించారు ఇప్పుడు ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రభుత్వం ఎన్నిపొరపాట్లు చేస్తోంది ? వాటివల్ల ఎన్ని లక్షల రూపాయలు దుర్వినియోగం అవుతున్నాయి ? వారు వాటిని సరిదిద్దుకోవడం లేదా ? అదేవిధంగా పంచాయితీబోర్డులకు, సమితులకు, జిల్లా పరిషత్తులకు ఎక్కువ అధికారాలు ఇస్తే, వారుకూడా సరిదిద్దుకొనడానికి అవకాశం ఉంటుంది ఇదే విధంగా అనుమానిస్తూ పోతుంటే దీనికి అంతు ఎప్పుడు ? కాబట్టి ప్రజాస్వామ్య పద్ధతిలో వచ్చినవారికి తగిన అధికారాలు ఇవ్వాలి వారు ఏమైనా తప్పులు చేస్తుంటే, ప్రక్కనే ఉన్న అధికారులు guidance ఇవ్వాలి ఈవిధంగా జరిగితే ప్రజాస్వామ్యంగా ఉంటుంది ఆలా కాకుండా వారిని అక్కడ నామమాత్రంగా పెట్టి, ఎన్నికయివచ్చిన M L A లను figure-heads గా పెట్టి, ప్రభుత్వోద్యోగులు పరిపాలనను సాగించడం ఎంతమాత్రం ప్రజాస్వామ్యంకాదు ఈ బిల్లు ఎంతమాత్రం తగినదికాదు దీనిని సెలక్టు కమిటీకి పంపినా ఏలాంటి మార్పులు జరుగవు Select Committee కి పంపిన University Bills ఎంత అధ్వాన్నరూపంలో వచ్చాయో మనం చూశాము కాబట్టి ఈబిల్లును కూడ సెలక్టు కమిటీకి పంపడం బాగుపడేందుకు కాదు ఈ బిల్లును scrap చేసి మళ్ళీ క్రొత్తగా ప్రజాస్వామ్య పద్ధతులలో, అధికారపక్ష సభ్యులు సూచించిన పద్ధతిలో వేరొక బిల్లునుతెస్తే బాగుంటుంది దీనిని Select Committee కి పంపడంవల్ల time and money waste అవ్వ వేరే ప్రయోజనం ఉండదు కాబట్టి ప్రజాస్వామ్య పద్ధతులతోకూడిన బిల్లును తీసుకొనివచ్చి సభ ముందు పెట్టవలసిందిగా మీ ద్వారా మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను

శ్రీ కె ఎల్ నరసింహరావు (ఎల్లందు జనరల్) అధ్యక్షా ! ఇంతవరకు ఈ బిల్లుపై చాలామంది మిత్రులు తమ అభిప్రాయాలు తెలియచేశారు Block Administration ను పంచాయితీ సమితులకు అప్పగిస్తూ ఇదివరకు జిల్లా బోర్డులు చేసేపనిని వీటికి అప్పగిస్తూ ఈ బిల్లును తీసుకొనిరావడం జరిగింది ఇంతవరకు స్థానిక స్వపరిపాలన విషయంలో మనదేశంలోని ప్రజా సేవకులకు ఉన్న దృక్పథాన్ని అంతా ఈ బిల్లు మార్చివేస్తుందనేది మనకు స్పష్టంగా కనిపిస్తోంది దేశంలో పరిపాలనను వికేంద్రీకరణ చేయడంద్వారా, ప్రజలకు పరిపాలనా వ్యవస్థను నిర్మించడంలో నేరుగా అవకాశం ఉండాలని మనం చాలా కాలంగా కృషి, ఆందోళనచేస్తూ వచ్చాము కానీ ఈనాడు ఈబిల్లుద్వారా

అది మరొక స్వరూపంలో మనముందుకువస్తోంది పంచాయితీబోర్డు అధ్యక్షులతో పంచాయితీ సమితులు ఏర్పడబోతున్నట్లు ఈ బిల్లులో చెప్పబడింది గ్రామాలలోని పంచాయితీ బోర్డులు, వాటి అధ్యక్షులు ఏ పద్ధతులలో ఏర్పడతారనేది మనం దృష్టిలో పెట్టుకోవాలి తెలంగాణా ప్రాంతంలో అదృష్టవశాత్తు రహస్య ballot ద్వారా ఎన్నికలు జరుగుతున్నాయి కాని ఆంధ్రప్రాంతంలో చాలావరకు చేతులుఎత్తే పద్ధతిన ఎన్నికలు జరుగుతున్నాయి రహస్యవోటింగ్ ఉన్న సందర్భాలలోనే, ఇతరత్రా సమాజంమీద, గ్రామాలమీద తమకు ఉన్న ఆర్థిక ఒత్తిడిని ఆధారంచేసుకొని వోటర్లను తమ అభీష్టానుసారంగా ఉపయోగించుకోవడం ఈ నాడు అనేకచోట్ల చూస్తున్నాము గ్రామాలలో చిన్న areas గా divide అయిన wards లో ఎన్నికలు జరుగుతాయి అక్కడ local గా ఉండే politics ఆర్థిక పరిస్థితులు, కులతత్వాలు పనిచేయడం ద్వారా గ్రామాలలో పంచాయితీలు ఏర్పడుతున్నాయి ఆ చిన్న areas లోపల గ్రామ పంచాయితీ అధ్యక్షులు ఎన్నుకోబడతారు గ్రామ వ్యవహారాలు చూడడానికి ఎన్నుకోబడిన అధ్యక్షులను సమితుల సభ్యులుగాను, తద్వారా వాటి అధ్యక్షులుగాను అయ్యే అవకాశాన్ని కలిగించి ఒక Block వ్యవహారాలను వారికి అప్పగించడం ఏవిధంగా ప్రజాస్వామ్యం అనిపించుకుంటుందో మంత్రిగారు, ప్రభుత్వం గుర్తించి వ్యవహరించడం అవసరం

మిస్టర్ స్పీకర్ సమావేశాన్ని సాయంకాలం 4 గంటల వరకు adjourn చేస్తున్నాను

*The House then adjourned for recess till four of the Clock*

*(The House re-assembled after recess at four of the Clock)*

*(Mr. Speaker in the Chair)*

## MESSAGE FROM THE COUNCIL

### *The Evacuee Interest (Separation) Madras Supplementary (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958*

### *The Indian Treasure Trove (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 and the Cattle Trespass (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 (as passed and agreed to by the Council)*

*Mr. Speaker* I have to announce to the House that I have received the following message dated 10th

December, 1958 from the hon Chairman of the Legislative Council.

"In accordance with Rule III of the Andhra Pradesh Legislative Council Rules as adopted under clause (2) of Article 208 of the Constitution of India, I transmit a copy each of the Evacuee Interest (Separation) Madras Supplementary (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 (L. A Bill No 42 of 1958), of the Indian Treasure Trove (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 (L A Bill No. 43 of 1958), and of the Cattle Tresspass (Andhra Pradesh Extension and Amendment) Bill 1958 (L A. Bill No 44 of 1958) as passed and agreed to by the Council on the 10th December, 1958 without any amendment and signed by me"

## GOVERNMENT BILL

### *The Andhra Pradesh Panchayat Samithis and Zilla Parishads Bill, 1958 (contd)*

శ్రీ కె యల్ నరసింహారావు అధ్యక్షా! పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులయొక్క ఎన్నికలు ప్రత్యక్షముగ కాకుండా పరోక్షముగ జరిపించటానికి ప్రభుత్వం ఈ బిల్లును యీనాడు ప్రవేశపెట్టింది అయితే ఇందులోని విధానము ఎంతవరకు సమంజసముగ ఉంటుంది అనే దానిని గురించి యింతకుముందు నేను క్లుప్తముగా చెప్పియున్నాను ఇందులోని సభ్యులయొక్క అర్హతలనుగురించి చెప్పవలసి వచ్చినప్పుడు ఏ సభ్యుడైనా అదే ప్రాంతములో ఉండవలసిన అవసరము లేకుండానే ఆ బ్లాకును గురించి ఎన్నిక కావాలంటే కావచ్చునన్నట్లుగా యీ బిల్లు సూచిస్తున్నది ఆ ఏరియాలో అతనికి ఒక ఇల్లు ఉంటేచాలు ఎన్నిక అయి కమిటీలో సభ్యుడుగా రావటానికి provision ఇందులో చేర్చబడింది. ఇలాంటిది ఏమాత్రం సరియైన పద్ధతికాదు అటుతరువాత శాసన సభ్యులకు సమితిలో సభ్యుడుగా ఉండటానికి అవకాశము కల్పించబడిందేకాని, అతనికి ఓటింగుహక్కు మాత్రము ఇవ్వలేదు నిన్నటినుంచి అనేకమంది మిత్రులుకూడ చెప్పారు శాసన సభ్యులకు పంచాయితీ సమితిలో ఓటింగుహక్కు యివ్వటానికి ప్రభుత్వానికి ఇష్టము లేకపోతే శాసన సభ్యులకు అందులో సభ్యుడుగ ఉండటానికి ఏర్పాటు చేయవద్దని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. పరిషత్తులోనికిపోయి విషయములను చర్చించటానికి అవకాశము యిచ్చినప్పుడు ఓటుచేసేహక్కు లేకపోవడమనేది ఏమాత్రము సమంజసముగ

లేదు అందువల్ల శాసన సభ్యులకుకూడ ఓటుచేసేహక్కు కల్పించటానికి ఆలోచించవలసిందిగ కోరుతున్నాను ఇదిగాక ప్రజల ఎన్నికను గురించి వచ్చినప్పుడు అది ఎప్పుడు జరిగినను, అధ్యక్ష, ఉపాధ్యక్షులు ఇద్దరు ఏర్పడుతారు అయితే అధ్యక్షుడు ఎన్నుకోబడవలసి వచ్చినప్పుడల్లా అది ఖాళీ కానివ్వండి, లేక అది ప్రథమ పర్యాయము కానివ్వండి, మొదటిసారిమటుకు కలెక్టరు అధ్యక్షుడుగ వస్తాడు అధ్యక్షత వహించి ఉపాధ్యక్షుని ఎన్నిక జరిపిస్తాడు అంటే, అందులో అర్థము ఉంటుంది దానిని మాత్రము అంగీకరించారేకాని, ఏదో కారణముచేత అధ్యక్షుడు మరణించడమో, లేక ఆ పదవికి రాజీనామా యివ్వడమో జరిగితే, అప్పుడు అధ్యక్ష స్థానముకూడ ఖాళీ అవుతుంది అప్పుడు కూడ మరొక కలెక్టరువచ్చి ఎన్నికలు జరపుతాడు తప్పితే అప్పుడు ఉపాధ్యక్షులు ఆ అధ్యక్షస్థానమును అలంకరించి, ఎన్నిక జరిపించడమనేది లేకుండా చేస్తున్నారు ఎందువల్ల ఆవిధముగ చేస్తున్నారో, దానికి కారణము వివరించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను

తరువాత Standing Committees ను ఏర్పాటు చేయడములో ఇటు జిల్లాపరిషత్తుకు అటు పంచాయితీ సమితులకు అవకాశమిచ్చారు అందులో simple majority vote పద్ధతి ప్రకారము తీసుకొనిరావటానికి అవకాశము ఇచ్చారు అయితే దీనినిగురించి ఒకవిషయము చెప్పవలసిఉన్నది ఒక కమిటీలో ఉన్నవారు ఇంకొక కమిటీలో సభ్యుడుగ ఉండటానికి వీలులేదనే విధానము సూచిస్తున్నారు అది ఏమైనప్పటికినీ అక్కడ ఎవరైతే మెంబరుగ ఉంటారో వారు proportional representation పద్ధతిమీద కమిటీలను ఎన్నుకోటానికి అవకాశము కల్పిస్తే బాగా ఉంటుందని నా అభిప్రాయము దానితోబాటు ప్రెసిడెంటు ఆధిపత్యము ఆ కమిటీలలోకూడ ఉండాలి కాని యిప్పుడు యీ సూత్రము ఎందువల్ల తీసుకొనివచ్చారో నాకు అర్థము కావడములేదు ప్రెసిడెంటు లేకుండాఉంటే వచ్చేనష్టము ఏమిటి అనేది నేను అర్థము చేసుకోలేక పోతున్నాను President ఆధిపత్యము వహించాలంటే ఆకమిటీలో సభ్యుడుగ ఉండాలి ఆ తరువాత ఎన్నుకోబడే ఆరుగురు సభ్యులలోను ఇద్దరిని బైటవారిని తీసుకునే అవకాశమున్నది. ఇదికూడ proportional representation పద్ధతిలో కాకుండా ఊరకనే simple majority vote పద్ధతిలో తీసుకునివచ్చే అవకాశమున్నది ఇది సరియైన పద్ధతి కాదని అంటున్నాను అందువల్ల simple proportional representation పద్ధతిప్రకారము తీసుకునివస్తే, ఆ తరువాత ప్రెసిడెంటునుకూడ యీ కమిటీ సభ్యులే ఎన్నుకోటానికి అవకాశమున్నది దానిని మార్చవలసిన అవసరముఉన్నది ఆవిధముగ మార్చినప్పుడే అది సరియైన

పద్ధతి అని అనిపించుకుంటుంది అయితే Standing Committees కు ఏఏ అధికారాలు ఇచ్చారో ఆ అధికారాలే ఇక్కడకూడ ఇచ్చినట్లు స్పష్టముగ లేదు పంచాయితీ సమితులకు B D O ల కున్నూ, జిల్లాపరిషత్తులకు కలెక్టర్ల కున్నూ సర్వాధిపత్యము ఇచ్చివేస్తున్నారు ఆ విధముగ కాకుండా, అక్కడ పంచాయితీ సమితికి గాని, ఇక్కడ జిల్లా పరిషత్తుకు గాని చైర్మనులుగ ఉంటారు Standing Committees కు Presidents గా ఎవరైతే ఉంటారో, వారి నాయకత్వముక్రింద వారందరినీ కలుస్తూ ఒక సమిష్టి బాధ్యతతో ఆ బ్లాకు area లో కాని, లేకపోతే ఆ District area లో గాని వ్యవహారాలన్ని నిర్వహించేటట్లుగా ఉండాలి అక్కడ ఉండే Secretaries గా ఏ అధికార్లు అయితే ఉంటారో, లేకపోతే అంతకు పై హోదాలో Executive Body గా ఏదైతే ఏర్పడుతుందో దానియొక్క ఆజ్ఞకు లోబడి నిర్వహించేటట్లుగ అవుతున్నది అయితే ఇక సమితికి powers ఏవైనా ఉన్నవా అనే విషయము చూస్తే అధ్యక్షునికిగాని, సమితికికాని ఏ అధికారాలు లేవు సమితి సమావేశము జరుగుతుంది సమితికి Standing Committees కు సంబంధము ఉన్నప్పటికినీ, committees కు ఏవైనా files అవసరముండి సమితినిగాని, Chairman ను గాని కోరిన ఎడల అవి తెచ్చి కమిటీముందు పెట్టవలసినబాధ్యత B D O మీద ఏమీలేదు అదితెస్తే ఆ ప్రాంతానికిగాని లేకపోతే దేశమునకు గాని నష్టదాయకమని B D O లు అనుకున్నప్పుడు ఆ files ను తీసుకునిరావటానికి నిరాకరించేహక్కు B D O ల చేతులలోనే యిస్తున్నారు అదే విధముగ యీ జిల్లా పరిషత్తు విషయములో కూడ కలెక్టరుగారికి అలాంటి అధికారము ఇస్తున్నారు కాబట్టి ఇలాంటి విధానము అంగీకారయోగ్యము కాదని నా అభిప్రాయము కలెక్టరు లెవెల్‌లోకూడ సర్వహక్కులు గ్రహించ తగ్గ విషయములు కావని నేను విమర్శించదలచుకొన్నాను

తరువాత విశ్వాసరాహిత్య తీర్మానమును గురించి ఒక్క ఓటు మెజారిటీతో నైనా ప్రెసిడెంటును ఎన్నుకొనే హక్కు ఉన్నది, అట్లాగైతే ఆయనను దించవలసిన అవసరము ఏర్పడినప్పుడు కూడ సభ్యుల సంతకాలతో నోటీసు ఇవ్వవలసి ఉన్నది అటుతరువాత అది చర్చకు వచ్చినప్పుడు మెంబర్లలో నూటికి అరవైయవ వంతు మెంబర్లు ఓటు చేసినప్పుడే ఆ తీర్మానము గెలిచే అవకాశము ఉన్నది ఈ సూత్రము ప్రజాస్వామ్య ఎన్నికలద్వారా ఏర్పడిన ఏ సంఘములలోనైనా అమలులో లేదు ఇప్పుడు ఇక్కడ ఎసెంబ్లీ ఉన్నది స్పీకరుగారి విషయమేచూడండి లేకపోతే మరొకటి ఆలోచించండి ఏ విషయములో చూచినా విశ్వాసరాహిత్య తీర్మానము ప్యాసుచేయించటానికి ఇన్నిరోజులు ముందుగా నోటీసు ఇవ్వాలని ఉన్నది అలాంటివి కొన్ని

restrictions ఉంటాయి ఇప్పుడు ఇందులో అలాంటిది ఏమీ కన్పించదు అంతేకాని పిచ్చిపిచ్చిగా నోటీసు యివ్వటానికి అవకాశములేకుండా ఉండటానికి, అందులో మామూలు restrictions ఈసమితి, పరిషత్తులవిషయములో కల్పించి నప్పటికినీ, single majority vote తోనే వారిని గద్దెనుంచి దింపటానికి పూర్తి అధికారాలుమనకు ఉండగా, అక్కడసమితికి అలాంటి అవకాశాలులేకుండ ఎందువల్ల చేయవలసివస్తున్నది? అది ఎందువల్లనో అర్థముకావడములేదు అంతేకాకుండా ఇటీవలనే మునిసిపాలిటీలు ఏర్పడినవి Municipalities విషయములో మెజారిటీ ఓటు అక్కరలేదు 50% మెంబర్లు ఆ తీర్మానమును ప్రతిపాదిస్తే చాలు, చైర్మనును దించే అధికారము ఇచ్చారు 50% మెంబర్లు నోటీసుమీద సంతకములు చేసియివ్వాలి అంతే కాకుండా తీర్మానము ఓటుకు పెట్టిన రోజున 50% మెంబర్లు లేచి నిలబడితే చాలు తీర్మానము గెలిచినట్లే అంతటితో దిగిపోతాడు ఇది తెలంగాణాలో ఉన్న పద్ధతి ఆంధ్రాలో ఎట్లాఉన్నదో తెలియదు అలాంటి అవకాశములు కల్పిస్తూ అందులో పెట్టారు కాని ఈ బిల్లులో ఆ విధముగ provision పెట్టలేదు ఇందులో ఆ విధముగ provision పెట్టకుండా, 60% అంటే అయిదింట మూడువంతులు మెంబర్లు ఉండాలి అని కోరడము సరియైన పద్ధతి కాదు

29 వ clause లో Collector గారు ½ గంటఆలస్యంగావస్తే ఆ సమావేశం adjourn అయిపోతుంది అని ఉన్నది కాని దానిలోనే ఇంకొక Sub-clause లో No confidence motion వచ్చిన కమిటీలు ఏ పరిస్థితులలోను కూడ వాయిదా పడడానికి వీలులేదు అని ఉన్నది ఇట్లాంటి contradictions లేకుండా చూడవలసిన అవసరం ఉన్నది ఏదైన ముఖ్యమైన తీర్మానం చర్చకు రాబోతున్నప్పుడు ఎంతో ప్రమాదకరమైన పరిస్థితులు ఉండి రాలేకుండాపోతే తప్ప సాధారణ పరిస్థితులలో ఆయన హాజరయ్యే విధంగా మార్పుచేయాల్సిన అవసరం ఉన్నది జిల్లా పరిషత్తులలో కూడ Collector అధ్యక్షుడుగా ఉంటాడు ఉపాధ్యక్షుణ్ణి ఎన్నుకొనే అవకాశం కల్పించారు మళ్ళీ కార్యదర్శిగా ప్రభుత్వోద్యోగే ఉంటాడు Standing Committees ను ఏర్పాటుచేసినప్పుడు దానిలో 9 మంది సభ్యులు ఉంటారని చెప్పారు దానిలో కూడ compulsory గా అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు ఉంటారు జిల్లా పరిషత్ ఉపాధ్యక్షుడు ఈ కమిటీలన్నిటికి అధ్యక్షత వహిస్తాడు కమిటీలన్నిటికీ అధ్యక్షత వహించడానికి ఉపాధ్యక్షుడు ఉన్నపుడు ఆ ఉపాధ్యక్షుని నాయకత్వంక్రింద ఈయన ఒక అధ్యక్షుడుగా కూర్చోవలసిన అవసరం ఏమి వచ్చింది? ప్రతి కమిటీలోను తప్పనిసరిగా ఒక అధ్యక్షుడు ఉండవలసిన అవసరం ఏమిటి? ఈ విషయాలన్నీ కూడ పరిశీలించవలసిన అవసరం

ఉన్నది Simple Majority పద్ధతి సరైనదికాదు Proportional reperesentation విధానంద్వారానే కమిటీలన్నీ ఎన్నుకోబడేటట్లు చూడాలని నేను కోరుతున్నాను పరిపాలనను వికేంద్రీకరణ చేయడంకోరకే వీటిని మేము తీసుకువస్తున్నాం అని అంటూ సమితిగాని జిల్లాపరిషత్తుగాని ఏదైన తీర్మానంచేస్తే ఆతీర్మానాన్ని రద్దుచేసే పూర్తిఅధికారం ప్రభుత్వం తనచేతులలో పెట్టుకున్నది మనం అనుభవంలో చూస్తున్నాం ప్రభుత్వం తనకు అధికారం ఉన్నచోటల్లా విచ్చలవిడిగా పక్షపాతంతో ఉపయోగించడం మనం స్పష్టంగా చూస్తున్నాం అందువలన ఈ అధికారాలన్నీ ప్రభుత్వానికి ఉండవలసిన అవసరంలేదు అంతేకాకుండా తీర్మానాలను రద్దుచేసేవిషయం అలాఉంచి సమితులను రద్దుచేసే అధికారంకూడ ప్రభుత్వం తనచేతులలో పెట్టుకొన్నది ఇది ఏపరిస్థితులలో కూడ సరైనవిధానం అనిపించుకోదు ప్రభుత్వం ఏ ఏ అధికారాలనైతే తన గుప్పిట్లో పెట్టుకునేందుకు ప్రయత్నంచేస్తున్నదో వీటన్నింటినిగూర్చి తిరిగి ఆలోచించవలసిన అవసరం ఉన్నది Select Committee stage లో వీటన్నింటినీ సవరించడానికి పూనుకుంటారని నేను ఆశిస్తున్నాను జిల్లా పరిషత్తులవలెనే బ్లాకు సమితులుకూడ ఏర్పాటు కావలసియున్నది మనం 400 లకు పైగా blocks పెట్టవలెనని అనుకున్నాం కాని ఇప్పటికి దేశంలో 200 మాత్రమే ఏర్పాటు చేసుకోగలిగాము Blocks ఏర్పడినచోట సమితి ఏర్పడక పోయినప్పటికి అక్కడ బ్లాక్‌కమిటీలు function చేస్తున్నాయి అటువంటప్పుడు ఆ బ్లాక్‌కమిటీ మెంబర్సే తమప్రతినిధిని ఎన్నుకొని ఆ area నుంచి పంపించే అవకాశం ఉండాలిగాని, ఆ area నుంచి ప్రతినిధిని nominate చేసే అవసరం ప్రభుత్వానికి ఎందుకు కలిగిందో నాకు అర్థంకావడంలేదు అంతేకాకుండా ఎక్కడైతే బ్లాక్స్ ఏర్పాటుకాకుండా ఉన్నాయో ఆ area నుంచికూడ ప్రతినిధులనుపంపించే అవకాశాన్ని కల్పించాలి జిల్లాపరిషత్తులు, సమితులు త్వరలో ఏర్పడి function చేసేటట్లు చూడాలి వయోజన ఓటింగుద్వారా ఈ సంస్థలను ఏర్పరచేవిధానాన్ని Select Committe ఆలోచిస్తుందని ఆశిస్తూ ముగిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ ఇక రెండుగంటలే time ఉన్నది మంత్రిగారికి సోషలిస్టు పార్టీనాయకునికి కలిపి ఒకగంటఇస్తే ఇకమిగిలినది ఒకగంట ఈగంటలో ఒక్కొక్కనికి ౯ నిముషాలుచొప్పున యిస్తే అందరికీ తృప్తిగా ఉంటుందేమో అందువల్ల అయిదేసి నిముషాలు యిస్తాను

**శ్రీ డి. రామబ్రహ్మం (కుప్పం)** అధ్యక్షా, పంచాయితీ సమితుల, జిల్లా పరిషత్తుల బిల్లును అఖిలభారత దేశంలోనే వికేంద్రీకరణ పద్ధతిలో మొట్టమొదటి సారిగా మనం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రవేశపెట్టినందులకు మన ప్లానింగ్

మంత్రిగారిని ఎంతయో అభినందించవలసియున్నది. మన జాతి పిత మహాత్మా గాంధీగారు కలలు గన్నటువంటి స్వరాజ్యాన్ని మనం ఈ నాడు సృష్టించు కుంటున్నాం అయితే ఈ బిల్లులో కొన్ని లోపాలు ఉన్న విషయంమాత్రం అందరు ఒప్పుకోవలసి ఉంటుంది ఇప్పుడు దీనిని Select Committee కి పంపిస్తున్నాం కాబట్టి ఈ బిల్లులో ఏమేమి మార్పులు చేయాలో వారికి కొన్ని సూచనలు చేయవలసి ఉన్నది M L As Block Committees లో ఓటు అధికారం లేకుండా చర్చ చేసుకోవచ్చుననే సిద్ధాంతం బాగాలేదు దానికన్న వారు అసలు అక్కడ లేకుండా చేస్తేనే బాగుంటుంది ఓటు అధికారంలేని సభ్యత్వం పనికిరాదని నా అభిప్రాయం, కమిటీలలో స్త్రీలకు ఒకస్థానం యిచ్చారు ఇప్పుడు ప్రతి పంచాయితీలో కూడ ఒక స్త్రీని nominate చేస్తున్నారు మన దేశంలో 50% వారి సంఖ్య ఉన్నప్పుడు కనీసం బ్లాకు కమిటీలో యిద్దరి స్త్రీలకైనా స్థానం యిచ్చే ఏర్పాటు చేయవలసిందిగా నేను సూచిస్తున్నాను Block Development Officer కు పంచాయితీలపైన తనిఖీ అధికారం యిచ్చారు పంచాయితీ అధ్యక్షులందరు బ్లాక్ కమిటీలలో సభ్యులుగా ఉంటున్నారు వారిపైన Block Development Officer executive officer గా పనిచేస్తూ ఉంటాడు అంటే, అక్కడి Executive work అంతా, Block Development Officer చేతులలో ఉంటుందన్నమాట, అట్లా కాకుండా ఈ అధికారం బ్లాక్ డెవలప్‌మెంటు Officer కు యిచ్చేబదులు District Planning Officer గారికి ఆ అధికారం యిచ్చినట్లయితే బాగుంటుంద నా అభిప్రాయం ప్రజాస్వామ్య సిద్ధాంతం ప్రకారం ఈ బిల్లును తయారు చేస్తున్నప్పుడు దానికి విరుద్ధంగా ఒక official ను అక్కడ పెట్టడం జరిగింది Local Boards లో యిప్పుడు ఏ పని అయితే జరుగుతున్నదో అదేపని ఈ సమితులలో కూడ జరిగే పరిస్థితులు ఏర్పడుతుంది కాబట్టి Non-official ను ఎన్నుకోవడం మంచిదని నా అభిప్రాయం Standing Committees లో కూడ ఆ సభ్యులలో నుండే ఒక Chairman ను ఎన్నుకొని ఆ Chairman కే పూర్తి అధికారం యిచ్చి State జిల్లాలోని cabinet మోస్తరుగా సమితులలో ఆ విషయాలన్నీ discuss చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. పంచాయితీ బడ్జెట్టును, జిల్లా సమితికి, సమితిబడ్జెట్టును, జిల్లా పరిషత్తుకు పంపించడంవల్ల కాలయాపన అవుతుంది పనులు సక్రమంగా జరుగవు సమితివారు చేసిన సూచనలు జిల్లా సమితులు ఒప్పుకోకపోవచ్చు జిల్లా సమితులు చేసినవి రాష్ట్ర ప్రభుత్వాలు ఒప్పుకోక పోవచ్చు ఈ విధంగా మళ్ళీ redtapism ప్రారంభం అవుతుంది కాబట్టి యింత డబ్బువరకు సమితులు చేయవచ్చు జిల్లా పరిషత్తులు యింతవరకు చేయవచ్చునని నిర్ణయం చేయండి ఏ సమితులు అయితే సరిగ్గా

కార్యక్రమాన్ని నడపవో వాటిని రద్దుచేసే అధికారం ప్రభుత్వానికి ఉండనే ఉన్నది కాబట్టి కమిటీలకు non-officials ను అధికారిగా ఉంచడం మంచిది

శ్రీ యన్ రాములు (బ్రాహ్మణతర్ల) అధ్యక్షా! స్వయం సహాయం, పరస్పర సహకారంతో గ్రామీణవ్యవస్థను పునర్వ్యవస్థీకరించి ప్రజాస్వామ్యమును పటిష్టం చేయుటకు మంత్రిగారు పంచాయితీ పరిషత్తుల బిల్లు ప్రవేశపెట్టారు కాని దానిలో ప్రజాస్వామ్యవ్యవస్థకు అనుకూలంగా యెన్ని అంశాలున్నవో పరిశీలన చేయవలసిన అవసరంవున్నది ఇంతవరకు వున్న 1920 వ సంవత్సరపు జిల్లాబోర్డుల చట్టం, 1950 వ సంవత్సరపు గ్రామపంచాయతీల చట్టాలవల్ల మనకు కొన్ని అనుభవాలు కలిగాయి ఆ అనుభవం దృష్టిలో పెట్టుకొని యిప్పుడు ప్రవేశపెట్టిన పంచాయితీ పరిషత్తు బిల్లు ఆచరణలో యే విధముగావుంటుందో ఊహించుకోవచ్చు 1920 వ సంవత్సరంలో బ్రిటిషువారి పాలనలో మనం local self-government స్థాపించుకొన్నప్పుడు President కే అధికారాలుండాలని ఆనాటి చట్టం రూపొందించబడింది కాని స్వతంత్రం సంపాదించిన తరువాత వచ్చిన 1950 వ సంవత్సరపు పంచాయితీల చట్టంలో కార్యనిర్వాహకునిగా Excutive Officer వుండాలనిఉంది ఈనాడు పంచాయితీలలో జరుగుతున్న వ్యవహారం మీకందరకు తెలిసినదే పంచాయితీ సమావేశాలలో, కార్యనిర్వాహకోద్యోగికి ఎక్కువ అధికారాలు యివ్వడంవల్ల పంచాయితీ వ్యవహారాలు సక్రమంగా జరగడంలేదని యెన్నో తీర్మానాలు చేయబడివున్నాయి అదేవిధముగా మ్యునిసిపల్ కమీషనరుకు ఎక్కువ అధికారాలిచ్చినందువల్ల, ప్రజాప్రతినిధులకు అధికారాలు లేనందువల్ల ప్రజాహిత కార్యాలు సక్రమంగా జరగడానికి అవకాశాలు లేవని పురపాలక సంఘాలు తీర్మానాలు చేసియున్నవి పంచాయితీ సమితులు పర్యవేక్షణలో Block Development Officer చెప్పు చేతలలో నడుస్తాయని చెప్పక తప్పదు ఇంకో విధంగా చెప్పాలంటే కొరడా పుచ్చుకుని సారథి బండిని గమ్యస్థానానికి చేర్చడానికి బదులు ఎద్దులను రెచ్చగొట్టి ప్రజల మీదకు పోనిచ్చే అవకాశం పంచాయితీ సమితులమీద B D O కు వుంది అందువల్ల ప్రజా ప్రతినిధులకు తగిన ప్రాతినిధ్యం వుండాలంటే పంచాయితీ సమితులకు తగిన అధికారం వుండాలి అయితే పంచాయితీ సమితులకు అధికారాలిస్తే ప్రభుత్వానికి direct control వుండడానికి అవకాశం వుండదు కనుక B D O కి అధికారం యివ్వడంవల్ల direct control వుండడానికి అవకాశం కలదని మంత్రిగారు చెబుతున్నారు పంచాయితీ కార్యక్రమాలు వారి చెప్పు చేతలలో వుండాలనేదికాదు కావలసినది ప్రజలకు కావలసిన కార్యక్రమాలు పంచాయితీ సమితులద్వారా కావాలని మిత్రులందరూ కోరుతున్నారు

పంచాయితీ సమితులకు అధికారాలు యే విధంగా యివ్వాలి, సిబ్బందిమీద కూడ అధికారాలివ్వాలా, సంపూర్ణ అధికారాలివ్వాలా లేక కొంతవరకే యివ్వాలా అని యిప్పుడు ఆలోచించవలసి వున్నది ప్రభుత్వంవారు సంపూర్ణ అధికారాలు యివ్వడానికి వెనుదీస్తున్నారు కాని సమితులలో జరిగే ఖర్చు దుర్వినియోగం కాకుండా సద్వినియోగం అయేటట్లు B D O ఆ సొమ్మును draw చేసేటప్పుడు పంచాయితీ సమితి అనుమతి పొందాలనే నిబంధనయిస్తే B D O కి యెటువంటి అధికారాలిచ్చినా ధనం దగ్గరకు వచ్చేటప్పటికైనా పంచాయితీ సమితి control వుంటుంది అప్పుడు B D O కి పంచాయితీ సమితికి స్వయం సహాయం, పరస్పర సహకారం తప్పని సరిగా యేర్పడుతుందని తెలియజేస్తూ శలవు తీసుకుంటున్నాను

శ్రీ డి నరసయ్య (హుజూరునగరు) అధ్యక్షా, మంత్రిగారుప్రవేశపెట్టిన బ్లాకు సమితులు జిల్లా పరిషత్తులకు సంబంధించిన బిల్లుమీద నిన్నటినుంచి చర్చ జరుగుతున్నది ఇప్పటికే మంత్రిగారు యీ బిల్లులోవున్న బలహీనత యేమిటో అర్థం చేసుకున్నారని అనుకుంటాను ఎందుకంటే యిప్పటివరకూ మాట్లాడిన వారిలో యెవరూకూడా యీ బిల్లును సమర్థించలేకపోయారు దీనిలోని మంచి విషయం యేదో చెప్పలేకపోయారు ఇప్పుడున్న జిల్లాబోర్డులకన్నా పంచాయితీ బోర్డులకన్న రాబోయే స్థానిక పరిపాలనా వ్యవస్థలో బ్రహ్మాండంగా అభివృద్ధి కరమైన మార్పులు వస్తాయనే అభిప్రాయాన్ని ప్రభుత్వంవారే అనేకసార్లు ప్రజలలో కలిగించారు దాని ఫలితంగా ప్రజలు అభివృద్ధికరమైన చట్టం రాబోతున్నదని యెదురు చూస్తున్న సమయంలో వచ్చిన యీ బిల్లు బ్రిటిషు సామ్రాజ్యవాదుల కాలంలో కంటె అభివృద్ధి నిరోధకమైనదని ప్రజాభిప్రాయం ప్రతిబింబిస్తున్నది సిద్ధాంత వాదనలు, రాజకీయ విధానాలు దీనివెనుక వున్నాయని చెబుతూ అసలు విషయాన్ని మరుగుపరచి యీ చట్టాన్ని సమర్థించడం జరుగుతోంది నిన్న మంత్రిగారు చెప్పిన విషయాలు క్రొత్తవి కావు శాసనసభలో ఈ విషయంపై ప్రచురించబడిన White Paper పై చర్చ జరిగింది దానితరువాత కూడా బిల్లు అదే పద్ధతిలో వచ్చింది నిన్న మంత్రి గారు మాట్లాడుతూ అదే వాదన తీసుకువచ్చారు ప్రజాస్వామ్యంలో ఎన్నికలవల్ల డబ్బు ఖర్చవుతుందనే వాదన చెబుతున్నారు అందువల్ల పరోక్ష ఎన్నికల పద్ధతి తీసుకువచ్చామని చెబుతున్నారు డబ్బు ఖర్చు లేకుండా, ఎన్నికలు లేకుండా, ఒకసారి గ్రామంలో ఒక Ward కోసమని నెగ్గిన వ్యక్తిని దాదాపుజిల్లా పరిషత్తు పరిపాలన వరకూ తీసుకుపోవడమే ప్రజాస్వామ్యమా? ఇది ప్రజాస్వామికానికి భంగకరం ప్రజాస్వామ్యానికి వారు చెప్పే అర్థం

ప్రమాదకరమైనది దాని చాటున వున్న మంత్రిగారి వుద్దేశ్యం అర్థంకావడం లేదు గ్రామ పంచాయితీ యెన్నికల దగ్గరనుంచీ nomination పద్ధతి పెట్టడం చూస్తే ప్రజాస్వామ్యం కాలగర్భంలో కలిసిపోతుందనే భావం కలుగుతుంది ఆ సిద్ధాంతాన్ని మంత్రిగారు వదులుకోవడం మంచిది ప్రమాదవశాత్తు పరోక్ష యెన్నికల ద్వారా తమకిష్టంలేనివారెవరైనా వస్తారేమోననే భయంతో nomination పద్ధతి co-opt చేసుకోవడం తమ చేతులలో పెట్టుకున్నారు Block లను నిర్మించడం దగ్గరనుంచి తమ చేతులలో పెట్టుకున్నారు ఇవన్నీ ఒకనాటి కావు తమ పార్టీకి సంబంధించిన వ్యక్తి ఘోరంగా ఓడిపోయాడని హుజూరునగర్ తాలూకాలో పంచాయితీ యెన్నికలు రెండు సంవత్సరాల నుండి మురగబెట్టారు కాని నల్లగొండ తాలూకాలో తమ పార్టీ వ్యక్తి నెగ్గుతాడని ఎన్నికలు తొందరగా పెట్టారు హుజూరునగర్ తాలూకాలో వరుసన 7-8 పంచాయితీ బోర్డు ఎన్నికలు రెండేళ్ళుగా జరుపలేదు ఈరకమైన వుద్దేశ్యాలతో నడుస్తున్న ప్రజాస్వామ్యం చాలా తప్పు అని నా అభిప్రాయం

శ్రీ కె సుదర్శనరావు (పాల్వంచ) అధ్యక్షా, ఇప్పుడు ప్రతిపాదించబడిన పంచాయితీ సమితిలో, జిల్లా పరిషత్తుల బిల్లును నిన్నటినుంచి గౌరవనీయులైన సభ్యులు చాల జాగ్రత్తగా పరిశీలించి, తమ అభిప్రాయములను వెల్లడించుచున్నారు అసలు ఈ బిల్లులో ఒక ప్రధానవిషయమున్నది ప్రజాస్వామిక పద్ధతులలో ఎన్నుకొనబడినటువంటివారికి అధికారములను యీ జిల్లా పరిషత్తులకు యివ్వవలెనా లేక ప్రభుత్వముచే నియమింపబడిన ఒక ప్రభుత్వోద్యోగికి హెచ్చు అధికారములను యివ్వవలెనా అన్నది ముఖ్యము ఈ బిల్లు ప్రకారము ప్రభుత్వోద్యోగులకే సంపూర్ణ అధికారములనిచ్చి జిల్లా పరిషత్తులను నిర్వహించడానికి ప్రభుత్వము పూనుకున్నట్లు అర్థమవుతున్నది నిన్నటినుంచి జరుగుతున్న చర్చలో యింతవరకు దాదాపు సభ్యులందరూ elected representatives కే యీ జిల్లా పరిషత్తుల పరిపాలనా నిర్వహణ కార్యక్రమమును అప్పగింతపెడితే బాగుగావుంటుందని వెల్లడించినారు. అసలు ఎవ్వరికి సంపూర్ణముగా అధికారముయివ్వవలెనన్నది extreme view గా కనబడుతున్నది అధికారము కేవలము elected representative చేతిలోనే వుండవలెననునది, లేకుంటే అధికారమంతయు ప్రభుత్వోద్యోగుల చేతిలో వుండవలెననునది—— యీ రెండునుకూడ extreme veiws గా పరిగణించవలసివున్నది ఈ రెండు పద్ధతులలో ఏ పద్ధతి అవలంబించినను, ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యము నెరవేరదని మనవిచేస్తున్నాను అందుచేత ఏ ఒక్కరికికూడ సంపూర్ణ అధికారాన్ని యివ్వకుండా judicious manner లో ఈ అధికారాన్ని యివ్వడము

మంచిదని నాఅభిప్రాయము Elected representatives ఎద్దైనా ఒకనిర్ణయాన్ని తీసుకున్నప్పుడు, సమితిదశలో Block Development Officer కు, జిల్లాపరిషత్తు దశలో Collector కు, ఏవిధమయినటువంటి సంపర్కం ముండవలెనన్నది చాలా ప్రధాన అంశముగా కనబడుచున్నది Elected representatives తీసుకున్న నిర్ణయాలను అమలుచెయుటలో ఏవిధముగా ప్రభుత్వోద్యోగులు తోడ్పడవలెనన్నది సెలెక్టు కమిటీలోనైనా స్పష్టమైనటువంటి నిర్ణయాలను చేస్తే బాగావుంటుందనీ అనుకుంటున్నాను అంతేగాని BDO కు సమితిపైన, కలెక్టరుకు జిల్లాపరిషత్తుపైన సంపూర్ణ అధికారాన్ని యివ్వడము భావ్యముకాదని నేను అనుకుంటూవున్నాను ఉదాహరణకు ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు మంత్రివర్గమును స్వీకరించి పరిపాలనా కార్యక్రమమంతా నిర్వహిస్తున్నారు అదేవిధముగా జిల్లాల స్థాయిలోగాని, తాలూకా, గ్రామస్థాయిలలోగాని పరిపాలనా బాధ్యతను ప్రజాప్రతినిధులకే కొంతవరకు అప్పగించడము భావ్యముగా వుంటుందా లేదా అనే విషయము దీర్ఘముగా ఆలోచించడము వుచితము BDOs కు పంచాయితీ సమితిపై అధికారాన్ని యిచ్చినంత మాత్రముచేత వారంతా ఆ సమితిని దోచుకుంటారని నేను చెప్పడము లేదు ప్రజాప్రతినిధులు చేసిన నిర్ణయాలను యీ ఆఫీసర్లు సత్వరముగా అమలుపరచుటకు మాత్రమే నిర్దేశింపబడవలెను అంతేగాని BDO కు స్వయముగా నిర్ణయాలను చేసే అధికారము యివ్వడము మాత్రము సమంజసముగాలేదు అదేవిధముగా జిల్లా పరిపాలనా వ్యవహారాలలో ప్రభుత్వ యంత్రాంగమునకు వెన్నెముకవంటి కలెక్టరుకు ఈ జిల్లాపరిషత్తులపై ఎట్టి అధికారముండవలెనన్నది ధర్మసందేహముగా వున్నది అసలు కలెక్టరు జోక్యములేకుండా ఏపనియు నెరవేరదు అందుచేత జిల్లాకలెక్టరుకు ఈ జిల్లా పరిషత్తులతో సంబంధముండవలెను ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధిని జిల్లాపరిషత్తుకు అధ్యక్షునిగా వేసి, జిల్లాకలెక్టరుకు general గా ఈ జిల్లాపరిషత్తుతో సంబంధంవుండేటట్లు చేయడము మంచిదని నేను అభిప్రాయపడుచున్నాను ఆ తరువాత ఈ పంచాయితీ సమితులకు పరిషత్తులకు వీలయినన్ని హెచ్చు అధికారాలను యిచ్చి, statutory bodies గానో లేక autonomus units గానో treat చేయడము మంచిది ఈ విధముగా వెంటనే చేయనవసరములేదు ఎందుచేతనంటే మనదేశము ప్రజాస్వామిక పద్ధతులపై నడిపింపబడుతున్నప్పటికిని, దేశములో administrative capacity ఉన్న ప్రతినిధులు స్వల్పముగా వుండుటవలన యిది యింత తొందరలో సాధ్యమయ్యే పనికాదు ఈ విషయములన్నీ సమగ్రముగా పరిశీలించి తగు సవరణలను చేసినట్లయితే తప్పకుండా యీ బిల్లుయొక్క purpose serve అవుతుందని నేను భావిస్తూ వున్నాను

శ్రీ ఎన్. వెంకయ్య (అద్దంకి) అధ్యక్షా, ఈ బిల్లులో ఛాయా మాత్రముగానైనా ప్రజలకు స్థానిక పరిపాలనను అప్పగించడానికి ప్రభుత్వము యత్నిస్తున్నందుకు సంతోషముగా వున్నది అయితే ఛాయామాత్రముగానే ఈ బిల్లువుపయోగిస్తుందనే విషయము బిల్లును బాగాచదివితే అర్థమవుతుంది పరిపాలన వికేంద్రీకరణ సిద్ధాంతము ననుసరించి ప్రజలకు సన్నిహితముగా, సౌష్టవముగా జరుగవలెనన్న కోరిక అందరకు వున్నది సాధారణముగా ప్రజలకు పరిపాలనతో ఎక్కువసంబంధము కలుగజేసి తమ అభ్యున్నతికి తామే కృషి చేసుకొనడానికి అవకాశముకల్పించే ఉద్దేశ్యముతోనే ప్రభుత్వ విధానమున్నట్లు తెలుస్తున్నది కాని ఆచరణలో మాత్రము ప్రభుత్వము ప్రజలను నమ్మలేనిస్థితిలో వున్నట్లు ఈబిల్లు స్పష్టపరుస్తున్నది పరోక్షముగానయినా, లేక ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయతీబోర్డు ప్రెసిడెంట్ల పరముగానైనా హెచ్చు అధికారములను యిచ్చి తమ పరిపాలనను తాము చేసుకొనడానికి అవకాశములు ఈబిల్లులో లేవనేవిషయము స్పష్టముగా కనబడుతూనే వున్నది అటువంటప్పుడు ప్రజాభ్యున్నతి ఏవిధముగా సాధించగలుగుతారో తెలియదు పోనీ పూర్తిగా పరిపాలనఅంతా అధికారులపరము చేయడానికి కూడప్రభుత్వము ఇష్టపడుటలేదు అసలు అధికారులలో నూటికి 80 మంది రూల్సునుపాటించి ప్రభుత్వానికి పనిచేస్తున్నట్లు తెలియపరచడానికే చేస్తున్నారు కాని నిజమయిన దేశభక్తి, శ్రద్ధ వారిలోలేవు ప్రజాస్వామికములో తప్పులందరూ చేస్తూవున్నారు తమ అభ్యున్నతి కొరకయినా ప్రజలకు యీ అధికారమును అప్పగించడము మంచిది అంతేగాని కేంద్ర రాష్ట్రప్రభుత్వములు జరుపుతున్న కృషివల్ల ప్రజలు ఏమాత్రముకూడ సుఖించలేరని మనకు తెలుసును అసలు ప్రభుత్వము యిప్పుడు అనుసరిస్తున్న విధానాలు బ్రిటిష్ యంత్రాంగములోవుండే పురాతనపద్ధతిపైనే ఆధారపడటమువల్లను, యీ సందర్భములో ప్రభుత్వము దీనిని మార్చలేకుండా, దిక్కుతోచక గిజగిజలాడుకుంటున్నట్లు కనుపిస్తున్నది జిల్లాబోర్డు వ్యవహారములలో నాకు చాలా అనుభవమున్నది జిల్లా బోర్డులకు అధ్యక్షులుగా ప్రజాప్రతినిధు లున్నప్పుడు ఏవిధముగా వుండెను ? ఇప్పుడేవిధముగా వున్నది ? పరిశీలించిచూస్తే రెండు విధానాలలో కూడ లోపాలు లేకపోలేదు అయితే ప్రజాప్రతినిధులు దేశసేవా నిరతిలో ప్రజలకొరకు సహాయము చేయడానికి ఆతురతతో వుండేవారు కాని ప్రభుత్వోద్యోగుల హయాములో rules మాట్లాడి ఏదో పనిచేస్తున్నట్లు నిరూపించడానికి diaries వ్రాసుకొనడమేగాని అభివృద్ధి మాత్రము ఏకోశానా మనకు అగుపడదు ప్రజలకు కావలసిన రోడ్లు, హాస్పిటల్సు, స్కూల్సు విషయములలోకూడ యీ ప్రభుత్వ ఉద్యోగుల హాయాములో చాలా యిబ్బందులు

కలుగుచున్నవి ఇప్పుడు community developments వచ్చిన తరువాత కొంతడబ్బు యీ అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించబడుతున్నది ఈ అభివృద్ధి కార్యక్రమము యింకా మరుకుగా సాగవలెనంటే పంచాయితీ సమితులకు, జిల్లాపరిషత్తులకు స్వయం నిర్ణయాధికారాలుండవలసిన అగత్య మున్నది ఆ నిర్ణయాలను యీ Block Development Officers అమలు పెట్టేటట్లుగా ప్రభుత్వము ఆదేశించాలి ఆవిధముగా చేయకుండా ప్రభుత్వము పరిపాలననంతా కేంద్రీకరించుకొనినట్లయితే అభివృద్ధి కార్యక్రమాలకు విఘల మవుతుందని నేను భావిస్తున్నాను అందుచేత ప్రజాభిప్రాయానికి అనుగుణ ముగా ఈ చట్టమును మార్చడము అవసరమని చెప్పుతూ నేను విరమిస్తున్నాను

శ్రీ టి పాపారావు (నాగరకటకం) అధ్యక్షా! పంచాయితీ సమితుల జిల్లాపరిషత్తులను గురించి యీ సభలో నిన్నటినుంచి తర్జన భర్జనలు జరుగు తున్నాయి ఈ బిల్లులో చాలా లోపా లున్నాయి ప్రజాస్వామికంలో గ్రామాల స్థాయిలో పరిపాలనాధికారాలు వికేంద్రీకృతమయ్యే విధంగా ప్రజలు ప్రజా స్వామికాన్ని పూర్తిగా అనుభవించే విధంగా చేయడానికి, యీ బిల్లు తోడ్పడు తుందని ప్లానింగు మంత్రిగారు చెప్పారు కాని వాస్తవానికి అట్లా వున్నదని చెప్పడానికి అవకాశములేదు ప్రజాస్వామికము పేరుతో ప్రజలను వుపయో గించుకొని యీ బిల్లు తయారుచేశారు ఇది సమితికాదు, సమిధి అని చెబు తున్నాను ఈ సమితులలో కేవలం కలెక్టరులకు, బి డి ఒ లకు ఎక్కువ అధి కారాలు యిచ్చారు సర్వాధికారాలు వారికే యివ్వబడినాయి సమితి సభ్యు లంతా వారికి ఏ విషయము కావలసివచ్చినా ఆ అధికారులను ఆశ్రయించ వలసినదే తప్ప వేరు గత్యంతరములేదు ఈ సమితిలోని శాసనసభ్యులకు కేవ లము మాట్లాడడానికే అవకాశము యిచ్చారుకాని ఉత్సాహముతో, బాధ్యతతో చర్చలలో పాల్గొని ఓటుచేయడానికిగాని, యితర సభ్యులతోపాటు పూర్తి అధికారాలను ఉపయోగించడానికిగాని అవకాశము లేకుండా చేశారు రాజ కీయంగా చూచుకుంటే శాసనసభ్యులు పొలిటీషియన్సుగా వుండాలి సమితి రాజకీయాలకు శాసనసభ్యులు అధినేతలుగా వుంటారని మన ప్లానింగ్ మంత్రిగారు చెప్పారు అది ఎంతమాత్రం సబబుకాదు దీనివలన శాసన సభ్యు లకు గౌరవము యివ్వబడిందనుకోవడానికిలేదు ఊరికే దిష్టిబొమ్మలుగాతయారు చేసి న్యూనత పరుస్తున్నారని చెప్పడానికి అవకాశము ఏర్పడుతున్నది శాసన సభ్యులను సమితులలో లేకుండాచేస్తే బాగావుండునేమోకాని సభ్యత్వము యిచ్చి ఓటుచేసేహక్కు లేకుండా చెయ్యడం ఎంతమాత్రం సబబుకాదు

ఇదివరకు జిల్లాబోర్డులకు ప్రసిడెంట్లు వున్న విధంగానే యీనాడు పరి షత్తులకుకూడ అనధికారులే ప్రసిడెంటుగా వున్నట్లయితే పరిపాలన ప్రజా

రంజకంగావుండి ప్రజలకు అందుబాటులోవుండి ప్రజాస్వామికము అనిపించు కోవడానికి అవకాశము వుంటుంది అట్లాకాకుండా కలెక్టర్లనుతెచ్చి వారి పెత్తనముక్రింద, నాయకత్వముక్రింద సమితిని నడిపించాలంటే శాసనసభ్యులు బ్లాక్ అడ్వైజర్సువలె ప్లానింగ్ కమిటీ మెంబర్సువలె కేవలము సలహా లివ్వడానికే అవకాశముంటుందికాని పూర్తియైన అధికారాలనుపొంది చలా యించడానికి ఎంతమాత్రము అవకాశములేదు మంత్రిగారు యీ విషయాన్ని కూడా సెలక్టు కమిటీ సభ్యులకు తెలియజెసి తిరిగి ఆలోచించి సరిచేయిస్తారని ఆశిస్తున్నాను బ్లాకు డెవలెప్ మెంట్ కమిటీలలో ఐ డి ఒ లకు సర్వాధి కారములను యిస్తున్నారు అందువలన శాసనసభ్యులు అధికారులక్రింద సలహా దారులుగ మాత్రమే వుంటున్నారుకాని తమ అధికారాన్ని వుపయోగింప డానికి అవకాశము వుండుటలేదు

**శ్రీ వి బి రాజు** ఆ అధికారుల కిచ్చిన అధికారాలేమిటి ? ఇంతవరకు మాట్లాడిన వారిలో ఒక్కరుకూడా వారికిచ్చిన అధికారాలేమిటో చెప్పలేదు

**శ్రీ బి రత్నసభాపతి** పంచాయితీ సమితులలో ఏదయినా రిజల్యూషను పాస్ చేస్తే దానిమీద కావలసిన అధికారాలన్నీ బ్లాకు ఆఫీసరులకు యిచ్చారు

**శ్రీ వి బి రాజు** ఆ ఒక్కమాట చూపించమనండి ఎక్కడైనా ?

**శ్రీ టి పాపారావు** రాజకీయంగా యీ అర్గనైజేషను ప్రజల అందు బాటులో వుంటుందని ప్లానింగు మంత్రిగారు చెప్పారు అయితే రాజకీయంగా ప్రభుత్వ పాలకవర్గానికి అందుబాటులో వుంటుందేమోగాని మాబోటి వ్యతిరేక పక్షాలవారికిగాని ఇదితరులకుగాని అందుబాటులో వుంటుందని నేను ఎంత మాత్రము అనుకోవడంలేదు ప్రజాస్వామ్యాన్ని మంటగలపడానికి పూర్తిగా కాల్చివేయడానికి యిది యొక సమితిగా వుపయోగపడుతుందని నేను మనవి చేస్తున్నాను అందుచేత సెలక్టు కమిటీలో యీ విషయాన్నికూడా సవరిస్తారని ఆశిస్తున్నాను ఎడ్యుకేషన్, పబ్లికు హెల్తులకు సంబంధించి యిది చాలా వుప యోగకరంగా వుంటుందన్నారు ప్రాక్టికల్ గా పనిచేసినట్లయితే వుపయోగ కరంగా వుంటుందిగాని అందులో పంచాయితీ ప్రసిడెంట్లు మాత్రమే వుంటా రని చెప్పారు ఈమధ్య మద్రాసు గవర్నమెంటువారు యిటువంటి బిల్లు తయారుచేశారు పంచాయితీలద్వారా ఎన్నుకోబడినవారెవరయినా వుండ వచ్చని ఆ బిల్లులో వున్నట్లు తెలుస్తున్నది అదే విధంగా పంచాయితీలలో యిదివరకువున్న ప్రసిడెంటులుగాని, ప్రసిడెంటులుగాకుండా పంచాయితీద్వారా ఎన్నుకొనబడిన వారెవరయినాగాని యిందులో సభ్యులుగా వుండేందుకు

అవకాశము కలిగించేటట్లు యీ బిల్లులో ఏర్పాట్లు చేస్తారని ఆశిస్తున్నాను నాకు యీ అవకాశము యిచ్చిన అధ్యక్షులవారికి ధన్యవాదాలర్పిస్తూ. యీబిల్లు అసంతృప్తికరంగా వున్నప్పటికిని కూడ అవసరమైన విధంగా సవరణలు చేయాలని కోరుతూ, దీనిని బలపరుస్తూ విరమిస్తున్నాను

శ్రీ బి వి శివయ్య (మార్టూరు) అధ్యక్షా, దాదాపు 1954 సం నుంచి జిల్లా బోర్డుల స్థానే స్థానిక స్వపరిపాలనను యే విధంగా పునర్నిర్మించాలనే విషయం ఆలోచనలో వున్నది స్పెషల్ ఆఫీసరుల పదవీకాలాన్ని పొడిగించాలని ప్రతి సంవత్సరము కూడ బిల్లులు తెస్తున్నారు ఇప్పుడు యీ బిల్లును చూడగానే ఆశ్చర్యమేసింది బొబ్బిలి రాజాగారి కైమునుంచి కూడ ఆంధ్ర, మద్రాసు ప్రాంతాలు కలిసి వున్నపుడు స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన వ్యవహారాలు చూచేందుకు ఆంధ్రులే మంత్రులుగా ఉండేవారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ కల్లూరు చంద్రమౌళి, శ్రీ నాయకంటి శంకర రెడ్డి మున్నగువారు ఆంధ్రప్రాంతమువారే అలాంటివారందరూ స్థానిక స్వపరిపాలనకు సంబంధించి చేసిన చట్టాలను చూచినట్లయితె (1920 నుంచి 1950 వరకు చేసినచట్టాలు) ప్రజలకే ఎక్కువఅధికారాలు యివ్వబడినట్లు తెలుస్తుంది పంచాయితీలలో అయితేనేమి, జిల్లా బోర్డులలో అయితేనేమి ప్రజలకే ఎక్కువ అధికారాలు యివ్వబడ్డాయి కాని యిప్పుడు మాత్రం జిల్లా బోర్డు ఏమయిపోయిందో, ఆ మంత్రిగారు ఏమయిపోయారో ఏమీ తెలియకుండా స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన బిల్లును పంచాయితీ సమితుల పేరుతో ప్లానింగు శాఖా మంత్రిగారు తెచ్చారు ఈ బిల్లులో జిల్లా బోర్డుల పరిపాలనంతా రద్దు చేయబడుతోంది బిల్లును ఏ మంత్రి తెచ్చినప్పటికి సమిష్టి బాధ్యతలతో తెచ్చి వుంటారు కదా అని బిల్లులో వున్న ప్రొవిజెన్సు చూచినట్లయితే స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన జిల్లా బోర్డులను రద్దు చేస్తామనే వున్నది కాని యే విధంగా రద్దు చేస్తున్నారో, యికముందు ఏమి చేయబోతున్నారో వివరాలు లేవు జిల్లా బోర్డులను రద్దుచేస్తూ వాటి స్థానంలో పంచాయితీ సమితులను యేర్పాటుచేస్తున్నామన్నపుడు ప్రజల అవసరాల కనుగుణంగా జిల్లా బోర్డుల అధికారాలను తగ్గించి తక్కువ యేరియావున్న యీ సమితులకు టెరిటోరియల్ జ్యూరిసిడిక్షనుకు ఏ విధంగా అంటగడుతున్నారో అర్థముకావడంలేదు ఈ బిల్లులోని ప్రతిక్లాజును చూచినట్లయితే **"Notwithstanding anything contained in this Act, the Government may, by notification, extend such and such powers as prescribed"** అని వుంటుంది ఇది నవాబుగారి ఫర్మానాల ప్రభుత్వంగా వున్నదిగాని అంతకంటే ఏమీలేదు వెనుకటి జిల్లాబోర్డుల చట్టంలో

230 క్లాజులున్నాయి వివిధమైన అధికారాలు, డ్యూటీలు వున్నాయి వాటన్నింటిని యిప్పుడు పంచాయితీ సమితులకు ఏ విధంగా యిస్తున్నారో తెలియదు

ప్లానింగు కమిషనువారు మెహతా కమిటీని నియమించారు ఆ కమిటీ సూచనల ప్రకారమే యీ బిల్లు తెస్తున్నామని మంత్రిగారంటున్నారు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రోగ్రాములను ఎలెక్టెడ్ బాడీలకు అప్పజెప్పడము మంచి దని, జిల్లా స్థాయిలో జిల్లా బోర్డులు కాకుండా టెరిటోరియల్ జ్యూరిసిడిక్షను తక్కువగా వున్న సంస్థలకు అధికారాలప్పగించినట్లయితే బాగుంటుందని అందు కవసరమయ్యే విధంగా జిల్లా బోర్డుల చట్టాన్ని మోడిఫై చేసుకోవలసిందని ఆ కమిటీ చెప్పింది కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రోగ్రామును ఒక ఆర్డినరీ సబ్జెక్టుగానే తీసుకుని చిన్నచిన్న పంచాయితీ సమితులకు అప్పజెప్పాలని వున్నది గాని కేవలము కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రోగ్రాముల కొరకే పంచాయితీ సమితులు పెట్టాలని వారు చెప్పలేదు అందువల్ల పంచాయితి సమితులను స్థాపించేటప్పుడు, జిల్లా బోర్డులను రద్దుచేసేటప్పుడు స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన ఆర్థిక విషయాలను పరిశీలించి ప్రజల అవసరాలకు అనుగుణంగా పెద్ద సంస్కరణలు తెస్తారని ఆశిస్తే అలాంటివి ఏవీ కనబడలేదు

ఈ బిల్లులో ఒక్కొక్క సెక్షనూ చూస్తే జిల్లా బోర్డ్సును రద్దుచేస్తూ ఏ విధంగా చేస్తున్నారో తెలుస్తుంది—

"Notwithstanding anything in the relevant district Boards Act or any other law, the Government may, by notification, abolish any district Board in the State with effect from such date as may be specified therein.

Notwithstanding that no provision or insufficient provision has been made under sub-section (1) for the adaptation of the provisions of the relevant District Boards Act, or the rules made thereunder, any court, tribunal or authority required or empowered to enforce those provisions may, for the purpose of facilitating their application to any Panchayat Samithi or Zilla Parishad, construe those provisions in such manner, without affecting the substance as may be necessary or proper in regard to the matter before the court, tribunal or authority

Government may, by notification, make such adaptations and modifications of the relevant District

Boards Act and the rules made thereunder whether by was of repealing, amending or suspending any provision thereof, as may be necessary or expedient and thereupon the relevant District Boards Act and the rules made thereunder shall have effect subject to the adaptations and modifications so made

శాసనసభలో వాటిని గురించి తేకుండా, శాసనసభలో చర్చించకుండా, notifications ద్వారా చేస్తామన్నారు ఇంతకంటె అన్యాయం వుండదని భావిస్తున్నాను

శ్రీ పి రాజగోపాల్‌నాయుడు (తవనంపల్లి) అధ్యక్షా, శ్రీ రాజుగారు యీబిల్లును తయారు చేయడంలో అర్ధనారీశ్వరుడిని సృష్టించారు జిల్లా పరిషత్తు తీసుకొన్నప్పుడు అందులో సులభముగా కనపడేది ఉద్యోగులు వారితో పాటు ఎన్నుకొన్నవారు, నామినేటెడ్ వారుకూడ ఉన్నారు ఈనాడు బ్లాక్సు తక్కువగా ఏర్పడియున్నవి 447 లో 210 కూడ యింతవరకు ఏర్పడలేదు అందువల్ల సగం నామినేటెడ్ సభ్యులే వస్తారు మంత్రిగారు ఒకటి మరచి పోయారు ఆంధ్రప్రదేశ్‌లో అన్ని బ్లాక్సులోను ఎన్నుకోబడినవారు ఉన్నారు Non-block area లో కూడా delimit చేయబడిఉన్నవి జిల్లాలో ఎన్ని బ్లాక్సు ఉండాలో, ఒక్కొక్క బ్లాకులో ఏ ఏ గ్రామాలు, ఏ ఏ పంచాయితీలు ఉండాలో నిర్దిష్టంగా, కచ్చితంగా తెలుపబడియున్నది అలాంటప్పుడు బ్లాక్ ఏరియాలో నుంచి, పంచాయితీబోర్డు ప్రెసిడెంట్సు ఎన్నుకొన్న పంచాయితీ అధ్యక్షులను జిల్లా పరిషత్‌లోకి తీసుకురావడానికి అవకాశం కల్పించి నాన్-బ్లాక్ ఏరియాస్‌లోనుంచి nominated members ను ఎందుకు తీసుకురావలెనని అడుగుతున్నాను నాన్-బ్లాక్ ఏరియాస్‌లోకూడ పంచాయితీబోర్డ్సు అధ్యక్షులు ఉన్నప్పుడు వారిని సమావేశపరచి వారు ఎన్నుకొన్నవారిని యీపరిషత్తులోకి ఎందుకు తీసుకొనిరాకూడదో ఆలోచించాలి

తరువాత కలెక్టరు హెడ్‌గా ఎందుకుఉండాలో నాకు అర్థంకావడం లేదు జిల్లాబోర్డ్సులో MLAs వుండి పరిపాలనచేయాలనితీర్మానంవచ్చినప్పుడు మనమంత్రులు ఏమన్నారంటే MLAs కు వేరే నిర్వహించవలసిన కార్యక్రమాలు చాలఉన్నవి గనుక వారిని తీసుకొనడానికి వీలులేదు, వేరే ఎన్నికయినవారురావాలని చెప్పారు ఈనాడు కలెక్టర్సుకు ఉన్నపనులు ఏమిటి? ఉన్న files చూడటానికి టైము ఉంటున్నదా? వారు ఈనాడు Special Officers గా ఉన్నప్పటికి వారి P. A లుగాఉన్నవారు జిల్లాబోర్డువ్యవహారాలన్నీ చూస్తున్నారేగాని కలెక్టర్సుచూడటంలేదు అటువంటప్పుడు యీ జిల్లాబోర్డ్సుకు సంబంధించిన

**administration** తెలియకుండా యిప్పుడు యీపరిషత్తుకు హెడ్‌గా కూర్చొని పరిపాలన జరిగించాలంటే ఎంతవరకు సాధ్యమవుతుంది ? MLAs కు వోటు లేకుండా, నామినేటెడ్ సభ్యులు సగంమందిఉండిన పరిస్థితులలో జిల్లామొత్తం మీద అడ్మినిస్ట్రేషన్ నడపడానికి ఎలా వీలుంటుందో మంత్రిగారు జవాబు చెప్పాలి ప్రజాస్వామికపరిపాలన స్థిరంచేయాలని చెబుతూ ప్రజలకు అధికారాలు యిస్తున్నామని చెప్పడమేతప్ప, యిందులో ప్రజాస్వామికం ఎలా ఉన్నదో జవాబుచెప్పాలని మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ యన్ పెద్దన్న (ఖమ్మం - రిజర్వుడు) అధ్యక్షా, ఈ పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తుల బిల్లుపైన క్లుప్తముగా నాఅభిప్రాయములు చెబుతాను ఇంతకాలం నుంచి ఇటువంటి స్థానిక పరిపాలనా సంస్థలు ప్రజాస్వామిక పద్ధతి పైన నడుస్తాయి కదా అనుకొన్నాము కాని ఈ బిల్లు చదివినతరువాత యిది ప్రజాస్వామికమా, ప్రజాస్వామిక నియంతృత్వమా అని అనిపిస్తోంది ఇన్నాళ్ల నుంచి ప్రజాస్వామికపద్ధతిపైన శాసనసభకుగాని, జిల్లాబోర్డ్సుకుగాని, పంచాయితీ బోర్డ్సుకు గాని సభ్యులను ఎన్నుకొని పంపడం జరుగుతోంది ఇప్పుడు వేల మెజారిటీతో ప్రజాభిమానాన్ని చూరగొని ఎన్నికై వచ్చిన MLAs యీ బిల్లు ద్వారా నిర్మాణముకాబోయే సంస్థల్లో మాట్లాడటము తప్ప చేయిఎత్తడానికి వీలులేదు మాట్లాడటం ప్రజాస్వామికంలా కనబడుతోంది, చేతులు ఎత్తకుండా ఉండటం ప్రజాస్వామిక నియంతృత్వంలా కనబడుతోంది అటువంటప్పుడు MLAs ను కించపరచటం తప్ప మరేమీ కాదు సమావేశం జరిగేటప్పుడు ప్రేక్షకుడెవరైనా వచ్చి తన claim వ్రాతపూర్వకంగా అప్పటికప్పుడు అందించే అవకాశం ఉంటుంది MLAs అయితే మాట్లాడే అవకాశమే ఉండటం చేయి ఎత్తే హక్కు- వోట్ యిచ్చే హక్కు లేకపోవడం అన్యాయం అది హాస్యాస్పదంగా ఉన్నదని మనవిచేస్తున్నాను

హరిజనుల సీట్సు విషయంలో యింకొక పద్ధతి ప్రవేశపెట్టారు హరిజనులు గాని, షెడ్యూల్డు కులాలకు చెందినవారు గాని ఏ కులమువారు ఎక్కువ మంది ఉంటే ఆ కులములోనుంచి ఒక్కర్ని తీసుకొనవలెనని యీ బిల్లులో ఉన్నది ఎవరినో ఒకరినే తీసుకోవాలని చెప్పడం మంచిదికాదు 50 మంది సభ్యులు సమితిలో ఉంటున్నప్పుడు **Scheduled Castes** నుంచి ఒకర్ని, **Scheduled Tribes** నుంచి ఒకర్ని తీసుకుంటే బాగుంటుందని అభిప్రాయపడుతున్నాను

మెంబరు కావడానికి కనీసం 6 నెలలు అక్కడ ఉండాలని, లేకపోతే యిల్లు ఉండాలని, యిల్లు లేకపోయినా సాధారణంగా ఆ ప్రాంతాలలో

నివసించేవాడుగా ఉంటే తెసుకొనవచ్చునని ఉన్నది అది సరైనదికాదు ఒక సంవత్సరమైనా గ్యారంటీగా ఆ ప్రాంతంలో ఉండాలి గాని, అక్కడ తిరిగినంత మాత్రాన సభ్యుడు అయిపోవచ్చునంటే అది ప్రజాస్వామికమునకు విరుద్ధము

బ్లాక్సులో జరిగే పరిస్థితి మాత్రె ఖమ్మం తాలూకాలో C D Block Committee జరిగింది అందులో గవర్నమెంటు పానెల్ (Panel) పెట్టారు రెండు మూడు ఊళ్లకు కలిపి పంచాయితీలు స్థాపించారు ఒక వెయ్యిజనాభాకు ఎక్కువ ఉన్న ప్రాంతంలో ఇండిపెండెంట్ పంచాయితీ ఉండవచ్చును జనాభా వెయ్యికి తక్కువఅయితే, అది మోడల్ విలేజి అయినప్పటికి ఇండిపెండెంట్‌గా ఉండటానికి అవకాశంలేకుండా ఉన్నది వెయ్యిమంది జనం కలిగిన ప్రాంతాలు కలిపి పంచాయితీ బోర్డును నిర్మాణంచేయడం జరుగుతోంది కనీసం మోడల్ విలేజిగా ఉన్నట్లయితె వెయ్యిమంది జనాభా లేకపోయినా అక్కడి ప్రజలు ఇండిపెండెంట్‌గా ఉండాలని కోరినప్పుడు అది ఇండిపెండెంట్ పంచాయితీగా చేసి, సీటు కల్పించాలని నా అభిప్రాయం

బ్లాక్ సమితిచేసే పనులలో సోషల్ వెల్ ఫేర్ పనికూడఉన్నది. హెడ్ క్వార్టర్స్‌లోఉండే సోషల్ వెల్ ఫేర్ డిపార్టుమెంట్ కే సర్వాధికారములు ఉన్నవిగాని, యీ బ్లాక్ సమితులకు ఎట్టి అధికారాలులేవు సర్వాధికారాలతో సోషల్ వెల్ ఫేర్ డిపార్ట్ మెంట్ ఇన్ స్పెక్టర్‌ను యీ బ్లాక్ సమితులలో వేస్తే, హారిజనులకు, వెనుకబడినజాతులవారికి సౌకర్యాలు కలుగజేయటానికి అవకాశముఉంటుంది సోషల్ సర్వీసు డిపార్టుమెంటువారు హారిజనులకు, వెనుకబడిన జాతులవారికి కొంత సహాయము చేస్తూనేవున్నారు పెద్దకుటుంబాలుగల పేదవాళ్ళకు జత ఎడ్లుకూడ ఇస్తున్నారు వారు పేదలకు వైద్యసౌకర్యాలు కలుగజేస్తున్నారు కాని యీ సోషల్ సర్వీసు డిపార్టుమెంటు రాష్ట్రానికి ఒకమూల, హెడ్ క్వార్టర్స్‌లో ఉన్నది అందువల్ల రాష్ట్రములో అన్నిప్రాంతాలవారికి సహాయము అందటంలేదు కాబట్టి, సర్వాధికారాలు ఇస్తూ, ఒక ఇన్ స్పెక్టర్‌ను యీ బ్లాకులలో నియమిస్తే పేదవారు సౌకర్యాలు పొందటానికి అవకాశం ఉంటుందని నా అభిప్రాయం తెలియజేస్తూ విరమిస్తున్నాను

**శ్రీ ఎ ఎరుకునాయుడు** అధ్యక్షా, బల్వంతరాయ్ మెహతా కమిటీరిపోర్టు ప్రకారం గ్రామపరిపాలనావిధానంలో, స్థానిక స్వపరిపాలన విధానంలో మార్పులు తీసుకువస్తామని చెబుతూ, ఏడుసార్లు జిల్లాబోర్డు ఎన్నికలను వాయిదా వేసి, వాటిని స్పెషల్ ఆఫీసర్స్ చేతులలో ఉంచారు జిల్లాబోర్డులు చేసేపనులు, సదుపాయాలు, సౌకర్యాలు యీ జిల్లాపరిషత్‌లు చేయగలవనేది యీ బిల్లులో

ఎక్కడా కనుపించటంలేదు ప్రస్తుతం బ్లాక్ కౌన్సిల్స్ ఏర్పాటు చేసిఉన్నారు వాటి స్థానే పంచాయితీసమితులు, జిల్లాపరిషత్‌లు ఏర్పాటు చేయబోతున్నారు కాని ప్రస్తుతం ప్రజల సహకారం వస్తేనే బ్లాక్‌లలో ప్రజలకు పని జరుగుతున్నది ప్రజాసహకారం ఉన్నచోట మాత్రమే బ్లాక్స్ ప్రజలకు సదుపాయాలు, సౌకర్యాలు కలుగజేస్తున్నవి ప్రస్తుతంవున్న జిల్లాబోర్డ్సుయాక్ట్ ప్రకారం ప్రజాసహకారం లేకుండానే, అక్కడి ప్రజలకు, విద్య, వైద్య, రోడ్ల సౌకర్యాలు కలుగజేసే బాధ్యత డిస్ట్రిక్ట్‌బోర్డ్సుపైన ఉన్నది అటువంటి జిల్లాబోర్డ్సు రద్దుచేసి యీ బ్లాక్‌సమితులు పెడితే, ప్రజాసహకారమురాని పరియాలగతి ఏమి అవుతుంది ? మంత్రిగారు డిసెంట్రలైజేషన్ సిద్ధాంతం ప్రకారం ఏటిని ఏర్పాటు చేస్తున్నామన్నారు కాని యీ బిల్లుచూస్తే, ఇవి డి-డెమోక్రటైజేషన్ (ప్రజాస్వామ్య విచ్ఛిన్నము) సిద్ధాంతం ప్రకారం వీటిని ఏర్పాటు చేయబోతున్నట్లు అర్థంఅవుతుంది జిల్లాబోర్డులకు ఉన్న డైరక్టు ఎలక్షన్స్ తీసివేసి, ఇప్పుడు జిల్లాపరిషత్‌లకు ఇన్‌డైరక్టు ఎలక్షన్స్ పెడుతున్నారు జిల్లాబోర్డులకు అధ్యక్షుడు ఎన్నుకోబడగా, ఈ బిల్లుప్రకారం జిల్లాపరిషత్‌లకు అధ్యక్షుడుగా కలెక్టర్‌ను నియమించటం జరుగుతున్నది ఇంతకంటె నిరంకుశమైన ఏర్పాటు మరొకటి లేదని చెప్పకతప్పదు మద్రాస్ లోకల్‌బోర్డ్సుయాక్టు, డిస్ట్రిక్టు మునిసిపల్ యాక్టులలో ఉన్న సెక్షన్స్ తీసుకువచ్చి యీ బిల్లులో పెట్టి పంచాయితీ సమితులను, జిల్లా పరిషత్‌లను ఏర్పాటు చేయబోతున్నారు పంచాయితీ సమితులలో వెనుకబడిన జాతులకు, హరిజనులకు స్థానం ఇచ్చారు కాని జిల్లాపరిషత్‌లలో హరిజనులకుగాని, వెనుకబడిన జాతులకుగాని, స్త్రీలకుగాని, షెడ్యూల్డు ట్రైబ్స్‌కుగాని, ఎటువంటి స్థానము ఇవ్వలేదు జిల్లా పరిషత్‌లలోకూడ వారికి ఎందుకు స్థానము ఇవ్వకూడదు ? యం ఎల్ ఏ లకు ఇందులో స్థానంఇస్తూ, వారికి వోటుచేసే హక్కు లేదన్నారు దీనినిబట్టిచూస్తే వాళ్ళు అధ్యక్షులు అయ్యేదానికి హక్కు ఉన్నదా, లేదా ? కో-ఆప్టెడ్ మెంబర్సుకు ఒక సంవత్సరం టైము ఇచ్చారు ఇతర మెంబర్సుకు 4 సంవత్సరాల కాలం ఇచ్చారు కో-ఆప్టెడ్ మెంబర్సుకూడ ప్రసిడెంటు అయ్యే అవకాశం యీ బిల్లులో ఉన్నది కో-ఆప్టెడ్ మెంబర్సు కాలం ఒక సంవత్సరం పెట్టారు ప్రెసిడెంటు మూడు సంవత్సరాల కాలం పదవిలో ఉండే అధికారం ఉన్నది. కో-ఆప్టెడ్ మెంబరు ప్రెసిడెంటు అయితే, అతడు ఒక సంవత్సరం అయిన తర్వాత, తన ప్రెసిడెంటు పదవిని ఖాళీచేసి, మళ్ళీ తిరిగి ఎన్నిక కావాలా ? ఈ ఎనామలీ గురించి మంత్రిగారు ఆలోచించాలి నో-కాన్‌ఫిడెన్సుమీటింగ్స్‌కు కలెక్టర్ అధ్యక్షతవహించే బాధ్యత పెట్టారు ప్రస్తుత జిల్లా మునిసిపల్‌యాక్టు ప్రకారం ఆ పవర్సు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుకు ఇచ్చి ఉన్నారు జిల్లాలో

సుమారు 24 బ్లాక్ సమితులు ఉంటాయి కాబట్టి ఆ బాధ్యత కలెక్టరుకు కాకుండా రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుకు ఇస్తే పని సక్రమంగా జరుగుతుందని విన్నవిస్తూ విరమిస్తున్నాను

శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, నిన్నటినుండి ప్లానింగ్ మంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లుపై చర్చ జరుగుతున్నది ఈ చర్చ సందర్భంలో చాలామంది గౌరవసభ్యులు అన్ని పక్షములవారు మాట్లాడారు ఇంతమందిలో, కేవలం మా కరీంనగర్ జిల్లాకు చెందిన చొక్కారావుగారు తప్పితే, మంత్రిగారి మన్ననలను పొందినవారు ఒక్కరుకూడ లేరు చొక్కారావుగారు ఒక్కరు తప్ప, ఇంక ఎవరూ ఈ బిల్లును బలపర్చలేదు ప్రభుత్వం గత సంవత్సరం, 12 నవంబరు, 1957 న లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ గురించి ఒక వైట్ పేపర్ ప్రకటించింది ఈ బిల్లు ప్రకటించటానికి ప్రభుత్వం దాదాపు ఒక సంవత్సరం సమయం తీసుకొంది ఇంత ఆలస్యం అవుతూంటే, మేము ఏమి అనుకొన్నామంటే—ప్రభుత్వం చాల కాంప్రహెన్సివ్ బిల్లు తీసుకురాబోతున్నది, బల్వంత రాయ్ మెహతా కమిటీ సిఫార్సులను దృష్టిలోపెట్టుకొని ఒక రివల్యూషనరీ బిల్లు ప్రవేశపెడతారు, అని ఆశించాము ఈమధ్య ప్రభుత్వం ఒక ఎగ్జిక్యూటివ్ ఆర్డరుద్వారా పంచాయితీ సమితులను ఏర్పాటుచేసింది ఆఎగ్జిక్యూటివ్ ఆర్డరుకు ఈ శాసనసభద్వారా, శాసనముద్ర వేయించుకోవాలనే ఉద్దేశంతో యీ బిల్లు మన ముందర పెట్టినట్లు తెలుస్తున్నది అంతకంటె ఎక్కువ ఏమీ యీ బిల్లులో కనిపించుటలేదు ఈ బిల్లులో "పవర్సు అండ్ ఫంక్షన్స్" అని ఒక హెడ్డింగు కనబడుతుంది తీరా ఆ హెడ్డింగ్ క్రింద ఉన్న క్లాజెస్ చదివితే, అందులో పవర్సు కనుపించటంలేదు, ఫంక్షన్సు కనుపించటంలేదు వాటికొరకు వేరే షెడ్యూల్సు ఇచ్చారు ఇటువంటి హాస్యాస్పదమైన బిల్లు ఇక్కడ ప్రవేశ పెట్టడం జరిగింది ఇది లోకల్ ఎడ్మినిస్ట్రేషన్‌కు సంబంధించిన బిల్లు కాబట్టి, దీనిని లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ మంత్రిగారు ప్రవేశపెడతారని ఆశించాము ఇది లోకల్ ఎడ్మినిస్ట్రేషన్‌కు సంబంధించింది కాదు ఇది కేవలం ప్లానింగు అండ్ డెవలప్‌మెంటు డిపార్టుమెంటుద్వారా ఏర్పడిన బ్లాక్ కమిటీలను లీగలైజ్ చేయటానికి యీ శాసనసభ ముద్ర వాటిమీద వేయటంకొరకు యీ బిల్లు తేబడుచున్నదిగనుక, దీనిని ప్లానింగు మంత్రిగారు ప్రవేశపెట్టారని భావించవలసివస్తున్నది కనుక యీ బిల్లుయొక్క టైటిల్‌ను మార్చవలసి ఉన్నది

"A Bill to provide for selection of Block Planning and Development Committees and District Planning and Development Committees"

అని అంటే బాగుంటుంది కాబట్టి మంత్రిగారు ఈ బిల్లులో ఆ విధమైన సవరణ తీసుకురావాలని కోరుతున్నాను ఇదివరకు ప్రభుత్వము ఎట్లాగూ ఒక ఎగ్జిక్యూటివ్ ఆర్డర్ పాస్ చేసింది కాబట్టి, ఈ సవరణకు మంత్రిగారు తమ ఆమోదము తెలుపవచ్చును

డెమోక్రాటిక్ డీసెంట్రలైజేషనును గురించి, అధికారం వికేంద్రీకరణమును గురించికూడ స్వాతంత్ర్య పోరాట సందర్భంలో చాలతీవ్రంగా ఆందోళనచేయడం జరిగింది 1946 వ సంవత్సరంలో సోషలిస్టుపార్టీ ఫోర్ పిల్లర్ స్టేట్ స్లోగన్‌ను ప్రారంభించింది కాన్‌స్టిట్యూషన్ ఫ్రేమ్ చేసే సందర్భంలోకూడ యీ ఫోర్ పిల్లర్ స్టేట్ అనే కన్‌సెప్షన్‌ను ఇమిడింప జేయాలని, విలేజిని ఒక స్తంభంగా భావించి కాన్‌స్టిట్యూషనల్‌గా కొన్ని అధికారాలను ఇవ్వాలని, జిల్లాలనుకూడా మరొక స్తంభంగా భావించి జిల్లా పరిపాలనకు సంబంధించిన లెజిస్లేషన్ చేసుకొనే అధికారాలు ఇవ్వాలనికూడ సోషలిస్టుపార్టీ కోరింది ఈ స్లోగనును డాక్టర్ రామమనోహర లోహియా ప్రారంభించారు సోషలిస్టుపార్టీ యీ ఆశయాల సిద్ధికోసం చాలకాలం నుంచి ఆందోళన చేస్తూనే వున్నది బల్వంతరాయ్ మెహతా కమిటీ రిపోర్టులో దీనికి సంబంధించిన విధంగా సూచనలు వుండడంవల్ల ఆ రిపోర్టు చూడగానే నాకు సంతోషంకలిగింది అనేక సంవత్సరాలనుంచి మాపార్టీ ఆందోళనచేస్తున్న విషయాలను కనీసం యీ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రామ్‌లో అయినా ప్రభుత్వం గుర్తించినందులకు సంతోషంగానే వున్నది స్థానికసంస్థలకు అధికారాలు ఇవ్వాలనీ, ప్రజలందరి సహకారం తీసుకొనక పోతే పనులు సక్రమంగా జరుగవని గుర్తించి, ఇంకా అనేక విషయాలను వివరంగా ఆలోచించి ఫోర్ పిల్లర్ స్టేట్ అనే కాన్‌సెప్షన్‌ను అంగీకరించినారని నేను భావించాను బల్వంతరాయ్ మెహతా కమిటీ రిపోర్టుయొక్క కాపీలు అన్ని వాల్యూమ్స్‌తోసహా ఆరేడు నెలలక్రిందటనే సభ్యులకు అందజేయ బడినాయి మేము, మాపార్టీ కోరుతున్నప్రకారం కాన్‌స్టిట్యూషన్‌లో ఇటువంటి ప్రొవిజన్ కల్పించకపోయినాకాని, ప్రభుత్వం లెజిస్లేషన్‌ద్వారా అయినా స్టాట్యూటరీ బాడీలను— విలేజి పంచాయతులు, పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తులు అను పేరులతో నిర్మాణం చేస్తున్నవని, పనులు సక్రమంగా జరుగుతాయనీ ఆశించాము తీరా బిల్లులోచూస్తే ఆవిధంగా లేదు నిన్నటినుంచీ సభ్యులందరూ ఇందులోవున్న లోపాలనుగురించి చెప్పడం జరిగింది ఇప్పుడు నేను అదే విషయాలను వల్లించదలచుకోలేదు.

డెమోక్రటిక్ డిసెంట్రలైజెషన్‌మీద బల్వంతరాయ్ మెహతా కమిటీ చేసిన సిఫార్సులలోని కొన్ని పేరాలనుమాత్రమే చదివి వినిపించుతాను

"The proposals of the Planning Commission for the Second Five-Year Plan as accepted by Parliament stress the need for creating within the District, a well-organised democratic structure of administration in which the Village Panchayats will be organically linked with popular associations at a higher level. In such a structure, the functions of the popular body would include the entire general administration and development of the area, other than such functions as law and order, administration of justice and certain functions pertaining to the revenue administration etc, "

ఆ తరువాత ఇంకొక విమర్శకూడ ఉన్నది

"The tendency has been for the States to take over many of the functions of the district boards, even so there is a sort of overlapping dyarchy prevailing in certain aspects of administration "

"With this background, we have to consider whether the time has not arrived to replace all these bodies by a single representative and vigorous democratic institution to take charge of all aspects of development in the rural areas Such a body, if created, has to be statutory, elective, comprehensive in its duties and functions, equipped with necessary executive machinery and in possession of adequate resources "

"This body can function effectively only if it is the sole authority for all those development programmes which are of exclusive interest for the area In such matters, the State Government will cease to operate within the area and in special circumstances, when it has to do, has to do so through the agency of this local body "

డిసెంట్రలైజేషన్ ఏవిధంగా చేసినట్లయితే ప్రణాళికలలోని పనులన్నీ సక్రమంగా, సులభంగా జరుగుతాయో నొక్కి-చెప్పారు అంతేకాకుండా, రిసోర్సెస్ ఏవిధంగా ప్రొవైడ్ చేయాలనేదికూడ చెప్పినారు

"A statutory prescribed percentage of land revenue collected within the block area in the ante-penultimate year."

"Where this arrangement is likely to cause a very substantial disparity in the incomes of the Panchayat Samithis, the alternative is to divide equally between all of them a portion of the State's land revenue, we suggest that in either of these cases, the land revenue assigned to the Panchayat Samithi and the Village Panchyat should not be less than 40% of the State's net land revenue"

కాంగ్రెసు ప్రభుత్వంచేత నియమింపబడిన కమిటీ— అన్ని ప్రాంతాల లోని అన్ని బ్లాకులను పరిశీలించి ఒక ఎక్స్‌పర్ట్ రిపోర్టును తయారు చేసినది ఆ ఎక్స్‌పర్ట్ రిపోర్టును మంత్రిగారుగాని, ప్రభుత్వంగాని దృష్టిలోపెట్టుకొని యీబిల్లును తయారుచేసినట్లు కనబడదు ఒకబ్లాకు ఏరియాలోవుండే పంచాయత్ కమిటీ అధ్యక్షులందరితో కూడుకొని పంచాయితీసమితులను ఏర్పాటు చేసే విషయమునుగూర్చి యీబిల్లులో చెప్పినారు కాని, పంచాయితి కమిటీల ఎన్నికలవిషయంలో వుండే లోపాలను గౌరవసభ్యులు చాలమంది ఎత్తిచూపించారు ప్లానులోని పనులన్నీ సక్రమంగా జరుపుటకు అన్ని పార్టీల సహకారం దొరకాలంటే పంచాయతీ సమితులను డైరెక్టు ఎలక్షనుల ద్వారా ఏర్పాటు చేయకపోతే లాభంలేదు డైరెక్టు ఎలక్షనులు పెడితే, బ్లాకు పరియాలలోవుండే అన్నిపార్టీలకు అవకాశం దొరికి ఉత్సాహంతో పనిచేయడానికి వీలుకలుగుతుంది ఈవిషయాన్ని మనం అంగీకరించి గ్రామ పంచాయితీ అధ్యక్షులతోకూడిన సమితులను ఏర్పాటు చేసుకోవాలి అయినా స్టాండింగ్ కమిటీల నియామకం విషయంలోకూడ ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ ఇచ్చే ప్రొవిజన్ ఇందులో కనిపించుటలేదు

శాసనసభలో ఏ కమిటీని వేసినా అన్ని పార్టీలకు తగు రిప్రజెంటేషన్ ఇవ్వడం జరుగుతున్నది ఇక్కడ ప్రపోర్షనల్ సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఎన్నిక పద్ధతి ద్వారానే కమిటిలలో సభ్యులను వేయడం జరుగుతుంది అన్ని పార్టీల వారు, ప్రజలు అందరూ సహకరిస్తేనే అభివృద్ధి కార్యక్రమాలన్నీ జరుగుతా యని పత్రికల ద్వారా, ఉపన్యాసాల ద్వారా మంత్రులు ప్రతిరోజూ చెబుతూనే ఉంటారు కాని, యీబిల్లును తయారుచేసే సమయంలోమాత్రం ఆ విషయాన్ని మరచిపోయినారని చెప్పకతప్పదు మంత్రులు పర్యటనలుచేయడానికీ, ప్రారంభోత్సవాలు చేయడానికి సమయం దొరకని పరిస్థితులలో యీ బిల్లులోని ప్రతి విషయంలోను ప్రభుత్వం జోక్యం కలిగించుకుంటోంది ప్రతి చిన్నవిషయంలో కూడ— పంచాయితీ సమితులలో ఏమి జరుగుతున్నది, ఎక్కడ సక్రమంగా నడుస్తున్నది మొదలైన అన్ని విషయాలలో కూడ ప్రభుత్వం మొదటినుంచీ

జోక్యంకలుగజేసుకునే అధికారం యీ బిల్లుద్వారా తీసుకుంటున్నారు నిజంగా డీసెంట్రలైజేషన్ మీద విశ్వాసం ఉన్నట్లయితే అట్లా చేసేవారుకాదు జోక్యం కలిగించుకోకపోతే పరిపాలనా యంత్రం అంతా కూలిపోతుందనే గ్రేవ్ సిట్యుయేషన్స్‌లో ప్రభుత్వం జోక్యంకలుగజేసుకొని ఆ లోపాలను నివారించడానికి ప్రయత్నం చెయ్యాలేకాని, ప్రతి చిన్నవిషయంలోనూ జోక్యంపెట్టుకోకూడదు క్రిందివారికి చిన్న విషయాలలో కూడ అధికారాలు ఇవ్వబడలేదు సమితుల అధికారాలు, పనులను గురించి కొన్ని షెడ్యూల్స్ ఏర్పాటుచేశారు ప్రభుత్వానికి ఇష్టంవచ్చినప్పుడు కొన్ని అధికారాలను ఇస్తుందట ఇది మంచిదికాదు ప్రభుత్వం ఇటువంటి సంస్కరణలు తెచ్చేటప్పుడు అతి ధైర్యంగా తేవలసివుంటుంది అంతేకాని, ఏదో కాగితాలమీద వ్రాసినంతమాత్రాన బ్యురాక్రటిక్ సిస్టమ్‌కు అలవాటుపడిన మన పరిపాలనావిధానం ప్రభుత్వం చేతిలోవున్న అధికారాలను ఎలక్టివ్ బాడీలకు ఇవ్వడానికి సిద్ధంకాదు ప్రభుత్వం క్రింది ఆఫీసరుల యొక్క రిపోర్టుల మీదనే ఆధారపడివుంటుంది హైదరాబాదు విలేజి పంచాయత్స్ ఆక్టులో పంచాయతీలకు డిఫినిట్‌గా, ప్రిసైజ్‌గా కొన్ని అధికారాలు ఇవ్వబడినాయి లాండ్ రెవిన్యూ మొదలయిన ఆదాయాలను గురించి ఇంత పర్సంటేజ్ పంచాయతీలకు వస్తుందని డిఫినిట్‌గా చెప్పారు ఒక సంవత్సరం మాసం రోజులపాటు యీవిషయమై ఆలోచించిన ప్రభుత్వం ఎట్లా నిద్రపోవాలి, ఎట్లా కూర్చోవాలి, ఎట్లా చేయాలి, ఎట్లా ప్రవర్తించాలి అనే విషయాలలోను డీసెన్సీ, డెకోరం, మర్యాద మున్నగు విషయాలలోను నిర్ణయాలు చేసిందే కాని, పవర్స్ అండ్ ఫంక్షన్స్ గురించి సరైననిర్ణయాలు చేయలేదు ఇటువంటి బిల్లును శాసనసభ ముందుకు తెచ్చి అది డెమోక్రాటిక్ డీసెంట్రలైజేషన్ అంటే వట్టి ఫార్స్ తప్ప మరొకటికాదు ఈ బిల్లును సెలక్టుకమిటీకి పంపించినందువల్ల పెద్ద ఉపయోగమేమీ వుండదు ఎక్కడైనా కొద్దిలోపాలువుంటే సెలక్టు కమిటీలో సరిచేసుకోడానికి సాధ్యంఅవుతుంది కాని యీ బిల్లు డ్రాఫ్టింగ్ దగ్గరనుంచీ మార్చవలసివుంటుంది కాబట్టి ఇప్పుడు యీ బిల్లును విత్‌డ్రాచేసుకొని, ఇక రెండు, మూడు మాసాల కాలం తీసుకొనిఅయినా డిస్ట్రిక్టు బోర్డ్స్ ఆక్టును, విలేజ్ పంచాయత్స్ ఆక్టును ముందు పెట్టుకొని కాంప్రహెన్సివ్‌గా ఒక బిల్లు తెస్తే మంచిదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను పంచాయతీల, పంచాయతీసమితుల అధికారాలు ఏమిటో, జిల్లాపరిషత్తుల అధికారాలు ఏమిటో ప్రిసైజ్‌గా తెలియచేయాలి ఆవిధంగా ఒక కాంప్రహెన్సివ్ బిల్లును తయారుచేసుకొని పంచాయతీ చట్టాన్ని, జిల్లాబోర్డుల చట్టాన్ని కూడ రిపీల్‌చేసినట్లయితేనే పూర్తిగా డెమోక్రాటిక్ డీసెంట్రలైజేషన్ ఏర్పాటుచేసుకొన్నవారము అవుతాము అట్లా కాకుండా, piece meal గా చేసినట్లయితే confusion మాత్రమే మిగులుతుంది

తప్పు అంతకంటే ఏమీలేదు అందువలన మంత్రిగారు దీనిని withdraw చెస్తే బాగుంటుందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నాను

ఒక్కొక్క provision ను పరిశీలించిచూస్తే ఈ బిల్లు చాలా విచిత్రంగా కనబడుతున్నది జిల్లా పరిషత్తుకు అధ్యక్షులుగా అక్కడి కలెక్టరుగారిని పెడుతున్నారు ఎంతవరకు మనం యీ కలెక్టరు అనే పదాన్ని abolish చెయమో అంతవరకూ మన attitudeలో మార్పురాదు ఒకనాటి యీ 'కలెక్టరు' పదాన్ని రద్దుచేస్తే కనీసం ప్రజల అభిప్రాయాలలోనైనా మార్పు వస్తుందని మనవి జేస్తున్నాను కలెక్టరును ఒక Chief Executive Officer గా చేసి అక్కడ elected president ను పెడితే అప్పుడే జిల్లాలోని administration ను democratise చేసినవారమవుతాము ఇప్పుడున్న జిల్లాలు చాలా un-wieldy గా వున్నవని మంత్రిగారు చెప్పారు దానినిగురించి ప్రభుత్వం ఆలోచిస్తుందనికూడా చెప్పారు ఈ democratic decentralisation లో 10 లక్షల జనాభాకు ఒక district అని విభజించి అక్కడ పరిషత్తును ఏర్పాటుచేస్తే బాగుంటుంది అది మరోపద్ధతి ఆ విధంగా చేయవలసివుంది ఇటువంటి విషయాలన్నీ ఆలోచించకుండా ఏవిధంగా మీటింగులు చేయాలి, ఎట్లా కూర్చోవాలి, ఎట్లా చేతులు ఎత్తాలి అనే విషయాలు రూల్సులో నింపారుతప్ప యిందులో యింకేమీ లేదని మనవి చేస్తున్నాను

Co-option పద్ధతి ఈ పంచాయితీ సమితులలో వున్నది ఎటువంటివారిని co-opt చేసుకోవాలి? ఎవరో యిద్దరు experts ను, తక్కినవారిని scheduled tribes, scheduled castes నుండి తీసుకోవాలి అన్నారు ఆ విధంగా కాకుండా —అక్కడ సభ్యురాలు ఎవరూ లేకపోతే — ఒకరిద్దరిని తీసుకునే అవకాశముండాలి, అదేవిధంగా హరిజనులుకూడా ఇక యీ పంచాయితీ కమిటీ అధ్యక్షుడుగా హరిజనుడు వస్తాడనే విశ్వాసం నాకులేదు నా అనుభవములో తెలంగాణా ప్రాంతంలోని ఏ పంచాయితీ కమిటీకి హరిజనుడు అధ్యక్షుడైనట్లు నాకు జ్ఞాపకంలేదు అందువలన కమిటీలో యిద్దరు ముగ్గురు హరిజనులకు representation యివ్వడం ఆక్షేపణీయమైన విషయం కాదని మనవి జేస్తున్నాను ఆ విధంగా కాకపోతే ఈ Standing Committees లో ఏ ఒక్క ప్రతిపక్షానికి సంబంధించినవారూ లేక అధికారపార్టీవారికి అనుకూలమైన వారిని యిందులో నింపుకోనడానికి అవకాశం వుంటుంది ప్రజల సహకారం తీసుకొని ప్లానింగు కార్యక్రమాలు సక్రమంగా నిర్వహించడానికి యిది తోడ్పడదని నా విశ్వాసం

అదేవిధంగా M L A s కు అందులో ప్రాతినిధ్యం యిస్తున్నారు ఓటు అధికారంమాత్రం లేదు ప్రాతినిధ్యం యిస్తే ఓటు హక్కు కూడా యివ్వండి వీరంతా పెద్దమనిషితనంగా వుంటా రన్నట్లు మంత్రిగారు మాట్లాడారు ఈ పెద్ద మనిషితనం ఎందుకు ? ప్రాతినిధ్యం యిస్తే వారికి ఓటు హక్కు కూడా యివ్వాలని నేను మంత్రిగారిదృష్టికి తీసుకువస్తున్నాను ఈ బ్లాక్సుఅన్నీ అన్ని ప్రాంతాల్లో ఎప్పటిలోగా ఏర్పడతాయో యింకా యిదమిద్ధంగా తెలలేదు అంతవరకు బ్లాక్సు లేని ప్రాంతాల్లో ప్రతినిధులు ఏ విధంగా వుండాలి ? ఆంధ్రప్రాంతానికి సంబంధించినంతవరకు పంచాయితి ఎన్నికలు యిదివరకే అయిపోయాయి తెలంగాణా ప్రాంతంలో కూడా మార్చి మాసం లోగా అన్ని ప్రాంతాల్లో ఎన్నికలు పూర్తిచేస్తామని సంవత్సరన్నరనుండి ప్రభుత్వం అంటున్నది వారి మాటను నమ్మితే వెంటనే అన్ని గ్రామాల్లో పంచాయితీల ఎన్నికలు పూర్తి అవుతవి అటువంటప్పుడు యింకా జిల్లా బోర్డులు ఎందుకు ? తక్షణమే జిల్లా పరిషత్తులను ఏర్పాటుచేసే అవకాశం వుందా, లేదా ? Non-block areas లో కూడా blocks యిదివరకే demorcate కాబడివున్నాయి ప్రతి బ్లాకులోను కావలసినంత staff లేకపోవచ్చు ఆ ఏరియాలో వున్నవారందరిలో ఒక ప్రతినిధిని (లధ్యక్షుడు లేకపోయినను) ఎన్నుకొనడానికి అవకాశం వుంటుంది తెలంగాణాలో nominated జిల్లాబోర్డులు వున్నాయి ఇక్కడ elections ద్వారా జిల్లాబోర్డులు ఎప్పుడూ నిర్మాణంకాలేదు అయితే nominated జిల్లా బోర్డులను తక్షణమే రద్దుచేసి, అన్ని గ్రామాలలో మార్చిమాసము లోపల పంచాయితీ కమిటీ ఎన్నికలు అవుతవికాబట్టి అప్పటినుండి ప్రతిజిల్లాలో పరిషత్తులను ఏర్పాటుచేసే అవకాశంవుందని మనవి చేస్తున్నాను

కలెక్టరుగారు ప్రతిదానిలో మెంబరుగా ఎందుకు వుండాలో నాకు అర్థం కావడంలేదు శాసనసభ స్పీకరుగాని, రీజియనల్ కమిటీ చైర్మను గాని అసెంబ్లీకిసంబంధించిన ప్రతి కమిటీలోను మెంబరుగా వుంటున్నారా ? అలాగే ప్రతి కమిటీలో, వారు వుండాలనడం అర్థరహితమైనక్లాజు ఆవిధంగా కాకుండా కమిటీకే ఎన్నుకొనే అధికారం వుండాలి Standing Committees నిర్వహించవలసిన కార్యక్రమాలు అనేకమున్నాయి కొన్ని చిన్నచిన్న విషయాలను గురించి కూడా ఆలోచించి నిర్ణయం తీసుకునే అవసరం వుంది

పంచాయితీ సమితులలోను, జిల్లాపరిషత్తులలోను ప్రభుత్వానికి మెజారిటీ ఎలాగూ ఉండనే ఉంటుంది ప్రభుత్వానికి ఆ భయం, అనుమానం వుండవలసిన అవసరంలేదు అలాంటప్పుడు యిందులో కలెక్టరునుకూడా పెట్టడం సమంజస

మైన విషయంకాదు ఈ సవరణ సెలెక్టు కమిటీ స్థాయిలో జరుగగలదని
ఆశిస్తున్నాను అలాగే పంచాయితీ సమితులు, Standing Committees లో
కూడా యిలాంటి సవరణ తీసుకురావలసిన అవసరముంది

ఇందులో women welfare కు సంబంధించిన విషయమొకటివుంది
Standing Committees లో మహిళలను తీసుకునేందుకు statutory గా
యిందులో provision లేదని ఒక గౌరవ సభ్యురాలు చెప్పడం జరిగింది అది
కూడావుంటే బాగుంటుందని మనవిచేస్తున్నాను ఉన్న standing committees
కంటే ఎక్కువ standing committees ఏర్పాటుచేసుకునే అవకాశముంది
మనదేశంలో స్త్రీలు చాలా వెనుకబడివున్నారు అందువల్ల ఆ provision ఇందులో
చేర్చేందుకు ప్రభుత్వానికి అభ్యంతరముండదనుకుంటాను

No-confidence-motion కు సంబంధించిన విషయంకూడా చాలా
విచిత్రంగా వుంది ఇదెక్కడి ప్రజాస్వామ్యమో అర్థంకావడంలేదు దాని
కొరకు ప్రత్యేకంగా యిందులో provision పెట్టనవసరంలేదు అసలు
simple majority తో no-confidence motion రావాలి ఇక్కడ simple
majority అవసరంలేదట Notice ఇవ్వడానికి మాత్రం 50% కావాలట
No-cofidence motion pass కావాలంటే 60% కావాలట ఇది మహావిచిత్రంగా
వుంది ఎన్ని safe-guards! ఇవన్నీ ఎందుకు? ప్రజలమీద నమ్మకంలేదా? లేకపోతే
దీనిలో యింకొక గలుగురు ఆఫీసర్లను ఎక్కువ వేసుకొని ప్రభుత్వం తన
పనులను చేసుకుంటే మంచిగా వుంటుందిగదా? ఒకవైపు ప్రపంచానికి
'మేము ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రకారం పరిపాలన సాగిస్తున్నాం' అని
చూపించడానికి ప్రయత్నిస్తూ యిక్కడ యీ విధమైన రక్షణ పెట్టుకోవడ
మెందుకు? ఎప్పుడైతే elected committees కు కొన్ని అధికారాలు యివ్వ
దలచుకున్నారో- వాటిని straight గానే అప్పగించండి అప్పగించేవి కొద్దిగా
నైనా ఫర్వాలేదు మేము అనుసరించిన 'చౌకంభారాజ్యం' slogan ఒప్పు
కొనడం వారికి భయంఅయితే వారికి కనీసం 4,5 అధికారాలైనా సంపూర్ణంగా
యివ్వండి ఈ విధంగా అధికారాలు ఎక్కువగా యిస్తే వారు తప్పులు
చేస్తారనే భయముంటే నేను యింకొక సూచనకూడ చేయదలచుకున్నాను
Recall పద్ధతి పెట్టండి ప్రతి చిన్నవిషయంలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకో
కూడదు గ్రామంలోని ఒక చిన్న పంచాయితీగురించి secretariat level లో
కాగితాలువచ్చి, దానికి Cabinet అంతా కూర్చుని నిర్ణయాలు చేయడం ఇంత
కంటే ముఖ్యమైన విషయాలు వున్నప్పుడు యిటువంటి చిన్నవిషయంపై
సమయం వృధాచేయకం మంచిదికాదు పైగా ప్రతివిషయంలోను ప్రభుత్వం

జోక్యం కల్పించుకునే అధికారం ఆక్షేపణీయమైనది, యిది conception of democratic decentralisation కు చాలా విరుద్ధంగావుందని మనవిచేస్తున్నాను

Block Development Officersకు ఏమి అధికారా లున్నాయని మంత్రిగారు అడుగుతున్నారు Sections 18 and 21 లో Standing Committee లో కాని, పంచాయితీ సమితిలో కాని papers ఏవైనా అడిగితే B D Os refuse చేయవచ్చునని ఉంది అంత రహస్యమైనటువంటి law & order, defence విషయాలు ఏమిఉంటాయో నాకు అర్థంకావడంలేదు ఈ సమితులకు ఫలానా చోట బావి, కాలువ త్రవ్వాలా లేదా? Schools సక్రమంగా నడుస్తున్నాయా, లేదా? మొదలైన విషయాలు తప్ప వేరే అధికారాలు ఇవ్వలేదుకదా! రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల మధ్య defence కు సంబంధించిన correspondence జరుగుతోందంటే మేము ఊరుకొంటాము కాని ఈ సమితుల్లో అంత రహస్యాలు ఏమి ఉంటాయో మంత్రిగారు సెలవివ్వాలి ఈ విధమైన అధికారం ఇవ్వడం B. D Os కు, సమితులు, Standing Committeesకు మధ్య ఒక విధమైన friction ను కలిగించడం తప్ప మరొకటేమీ కాదు స్వభావసిద్ధంగా ఆ B D O కొంచెం temperament కలవాడయితే ప్రతి విషయం కూడా ఏమీ చూపించకుండాపోయే అవకాశం ఉంది Elected Panchayath Samithi members అందరూ కలిసి చేసినతీర్మానాన్ని Collector supersede చేయవచ్చునసే అధికారం ఇవ్వడంలో ఏమీ అర్థంలేదు Planning లో ఉన్న provisions తప్ప ఆ సమితులకు వేరే అధికారాలేమిస్తున్నారు? వీటికి law & order, పోలీసుల అధికారాలుకూడా ఇవ్వాలని మేము కోరుతున్నాము కాని ప్రభుత్వం అందుకు సమ్మతించడంలేదు ఏలాంటి అధికారాలు ఈ బిల్లుద్వారా వాటికి సమర్పించబడటం లేదు ఈ బిల్లు Local Self Government కు సంబంధించినదిగా మంత్రిగారు చెప్పడం పొరపాటు ఇదివరకు executive orders ద్వారా పంచాయితీ సమితులను, జిల్లా పరిషత్‌లను ఏర్పాటు చేయాలని అనుకొంటున్న దానికి, యీ నాడు శాసనసభ ముద్రకొట్టడానికి ఈ బిల్లును తీసుకు వచ్చారు కాని మరొకటేమీ కాదు. బల్వంతరాయి మెహతా కమిటీ report ప్రకారంగాని, లేక ఇతర democratic countries లో స్థానిక సంస్థలకు ఇవ్వబడిన అధికారాలుగాని ఈబిల్లులో ఏమీలేవు స్వీడన్, ఇంగ్లాండ్, యుగోస్లావియాలను గురించికూడా ఇక్కడ ఉదహరించారు అక్కడ రాష్ట్ర ప్రభుత్వాలు జోక్యం కలిగించుకోవు అక్కడ వాటికి సంపూర్ణమైన అధికారాలు ఉన్నాయి ఏవైనా rebel చేస్తేనే రాష్ట్రప్రభుత్వం జోక్యంచేసు

కొంటుంది, లేకపోతే వాటికి పూర్తి స్వాతంత్ర్యం ఉంది అమెరికాలోకూడా ఇదేవిధంగా ఉంది ఆ దేశాలలో ఉండే అధికార వికేంద్రీకరణకు, మంత్రిగారు తీసుకొనివచ్చిన బిల్లుకు ఎక్కడా సంబంధంలేదు ఈలాంటి బిల్లును సభ్యుల ముందుపెట్టి దీనిమీద ముద్రవేయమంటే ఏలా వేయాలో, ఎలా అంగీకరించాలో నాకు అర్థం కావడంలేదు అన్నిపక్షాలవారుకూడా ఈ బిల్లు undemocratic గా ఉందని, ఒక్క provision కూడా సమగ్రంగా లేదని విమర్శించారు కాబట్టి ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపి time ను వృధాచేయకుండా, ఇక్కడే withdraw చేసుకొని జిల్లాబోర్డు, పంచాయితీసమితి చట్టాలను అన్నింటిని ముందుపెట్టుకొని ఒక మొత్తంగా ఒక comperhensive Bill ను తీసుకొనివస్తే, దానిని మేము అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాము కానీ దీనిలోని ఒక్కమాటకుకాని, ఒక్కశబ్దానికిగాని నేను, మాపార్టీ ఆమోదముద్ర వేయడానికి సిద్ధంగాలేమని చెబుతూ సెలవు తీసుకోంటున్నాను

శ్రీ వి బి రాజు నిన్నా ఈవేళ్ళటి చర్చలలో గౌరవనీయ సభ్యులు వెలిబుచ్చిన అభిప్రాయాలు చాలా అతీతమైనవి బిల్లులోని లోపాలను వారు చూపించారు చాలామంది వాటిని "ఎగ్జాజిరేట్" చేశారు దానికి కారణ మేమిటో నాకు తెలియదు, కాని ఒక్క విషయానికిమాత్రం నాకు సంతోషం కలిగింది ఈ బిల్లుపైన చర్చలలో పార్టీ దృక్పథాలు లేకుండా అందరూ పాల్గొన్నారు నిజంగా ప్రజాహిత సంస్థలు సంకుచితమైన పార్టీ దృక్పథాలు లేకుండా నిర్మాణమైనప్పుడే దేశానికి మేలు రాజకీయ పార్టీలలో వ్యక్తులు ఉంటూ ఉంటారు పోతూ ఉంటారు ఒక పార్టీనుంచి రెండో పార్టీకి రావడం కూడా జరుగుతుంది కనుక రాజకీయపార్టీలైనా, ప్రభుత్వమైనా ప్రజాహితానికి లోబడే ఉండాలికాని, దానికి అతీతంగా ఉండలేవు ఈ విషయంలో నేను తప్పకుండా ఈ చర్చలలో పాల్గొన్న సభ్యులందరికీ కృతజ్ఞత వెలిబుచ్చాలి కాని శాసనసభలో చర్చ జరుగుతున్నప్పుడు ఒక విపరీతమైన పరిణామం నాకు కనబడుతూ ఉంటుంది 4-5 గురు సభ్యులు ఒక విషయంమీద తమదృష్టిని కేంద్రీకరించి, దానికి యింకొక అర్థాన్ని ప్రభుత్వం తీసుకొన్న అర్థం కాకుండా ఇక్కడ ప్రస్తావించినట్లయితే దానిని ఎదిరించడానికి గౌరవసభ్యులు ప్రయత్నం చేయడంలేదని నాకొక impression కలిగింది సత్యమనేది మరుగునపడి ఉంటుంది కాని పదిమంది చెప్పింది సత్యమంటే ఈ ప్రపంచం నడవదు పదయినా ఒకమాటను పదిమంది పదిసార్లు గట్టిగా చెప్పినంతమాత్రాన దానిని సత్యంగా భావించాలంటే కష్టం అసలు ఆ సత్యాన్ని చీకటిలోనుంచి బయటకు

తీయాలంటే కొంతకృషి, కొంతధైర్యంకూడా కావాలి అటువంటిధైర్యం నా దగ్గరఉన్నదని నమ్ముతూ నేను ఆ సత్యాన్నయినా బయట పెట్టవలచాను

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ సత్యం మరుగున పడివుంటుందా? లేక అందరికి కనిపిస్తుందా?

శ్రీ వి బి రాజు సత్యం ఎప్పుడూ చీకటిలో పడివుంటుంది

గౌరవసభ్యులు, శాసనం యొక్క ఉద్దేశమేమిటో ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యంకూడా అదే వికేంద్రీకరణ చేయాలనే విషయంలో ఏమాత్రంకూడా అభిప్రాయభేదాలు లేవు గత సంవత్సరంనుంచి చెబుతూ వస్తున్నదానిని తు చ తప్పకుండా ఈప్రభుత్వం అమలు చేస్తుందని ఈసభకు హామీఇస్తున్నాను అధికార వికేంద్రీకరణ విషయంలో ఎవ్వరూ విమర్శించలేదు Decentralisation అంటె అర్థమేమిటో మనకుతెలుసు రాష్ట్రప్రభుత్వం తన అధికారాలను జిల్లా level కు పంచుమన్నదా? లేదా? ఆవిధంగా తరలించడంలేదని ఎవ్వరూ చెప్పలేదు పంచాయితీసమితికి 15 main head lines క్రింద ఉన్న items విషయంలో పూర్తిబాధ్యతలు ఇవ్వబడ్డాయి ఈ 15 items కాక land revenue, excise collections కూడా ఇవ్వండి, లేకపోతే major projects కూడా ఇవ్వండని ఏ ఒక్కరూకూడ చెప్పలేదు పోలీసు అధికారాలు, judicial powers కావాలని శ్రీ నర్సింగరావుగారుచేసిన సూచన ఒక్కటే కనిపిస్తోంది ఈవిషయంలో సభ్యులెవ్వరూ ఎక్కువ శ్రమతీసుకొని ఈబిల్లు చదవలేదేమో ననిపిస్తోంది

పోనీ "ఈ బిల్లులో ఉన్న అధికారాలు చాలవు, సెకండరీవిద్య, land revenue collections మొదలైనవి పంచాయితీలకు యివ్వండి, మేమే ఆ taxes వసూలు చేసి ప్రభుత్వానికి యిస్తాము" అని ఒక్కరూ చెప్పలేదు అసలు ఈ బిల్లును ప్రవేశపెట్టుటలోగల ప్రభుత్వ ఉద్దేశ్యం ఏమిటో కూడా ఎవరూ గ్రహించినట్లు కనబడదు బ్రిటిష్‌వారు వెళ్ళిపోయిన తరువాత ఈరోజువరకు అధికారం ఎక్కడున్నది? ఢిల్లీలో పార్లమెంటు, రాజ్యసభలలోను, రాష్ట్రాలలో అసెంబ్లీలోను యావత్తు అధికారం ఉన్నది అక్కడనుంచి ఇంతవరకు అధికారం తరలలేదు ఆ అధికారాన్ని తరల్చడానికే ఈ బిల్లు తీసుకొనిరాబడింది జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులతో ఈ బిల్లును పోల్చవద్దు ఆంధ్ర ప్రాంతంనుంచి వచ్చిన సభ్యులకు ఆ జిల్లా బోర్డుల పెనుభూతమే యింకా కనిపిస్తూ ఉన్నట్లు ఉన్నది తెలంగాణా సభ్యులు మాట్లాడేటప్పుడు మాత్రం అటువంటిదేమీ కనుపడలేదు ఎందుచేతనంటే యిక్కడ అటువంటివి

ఎమీలేవు ఉన్నవి నామినేటు చేసినవే! జిల్లా బోర్డుల భూతాన్నే తిరిగి ఈ బిల్లు ద్వారా సృష్టిస్తున్నారనే భయం కొంతమందిలో కనబడుతున్నది అటువంటి పొరపాటు మాత్రం ఎన్నడూ జరుగదని మనవిచేస్తున్నాను ఆరేడు సంవత్సరాలనుంచి అక్కడ నామినేటెడ్ జిల్లా బోర్డులు ఉన్నాయి appointed Planning Committees ఉన్నాయి, nominated Block Advisory Committees ఉన్నాయి ఆ పరిస్థితితో పోల్చి మాస్తె ఈ బిల్లుకు దానికి తేడా లేదా? ఆకాశానికి భూమికి ఉన్నంత తేడా ఉన్నది అంతేగాక ఈ బిల్లును ఏ పరిస్థితిలో తీసుకొని వస్తున్నాము అన్నదికూడ ఆలోచించాలి బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో ఉన్న డైయార్కీతో పోలిస్తే ఎట్లాగ? ఈరోజున మనలను పరిపాలిస్తున్నది ప్రజాస్వామిక ప్రభుత్వం సర్వాధికారాలతో అసెంబ్లీ అనేది ఒకటి ఉన్నది క్రింద జిల్లా లెవెలులో, పంచాయితీ బ్లాకు సమితులలో కూడా అసెంబ్లీలను ఏర్పాటుచేసి, ఆటోనమసు బాడీలుగా రూపొందించి, అక్కడ కేబినెట్టులను ఏర్పాటుచేయాలనే ఉద్దేశ్యం ఈరోజున మనకు లేదన్నవిషయాన్ని మరొకసారి స్పష్టం చేస్తున్నాను బ్రిటిష్‌వాళ్ళ కాలంలో, మనకు అనుభవం కావాలని వారు, అవసరాలు ఉన్నాయికాబట్టి మనం, ఆ జిల్లాబోర్డులు తాలూకా బోర్డులు అంగీకరించి వాటిద్వారా స్కూల్సు మొదలైన వాటిపై ఆధిపత్యం సంపాదించడం జరిగింది సంఘులోంచి పోస్తేగాని తీర్థం కాదన్నట్లుగా వారు అలా చేశారు మనం ఆ జిల్లా బోర్డుల నుంచి నేర్చుకొన్న అనుభవంకూడ అంతకంటె ఎక్కువ లేదు వాటి నన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఈ బిల్లును ఒకసారి పరిశీలించండి ఒకవేళ భాష పొరపాటుగానుండి, నేను చెప్పినట్లుగా అందులో అర్థం స్ఫురించక పోతే తప్పక మార్పు చేసుకోవచ్చు ఈ సందర్భంలో నేను స్పష్టంగా చెబుతున్నాను The State Government is completely getting out of the field, handing over all development works in the Blocks excepting a few major projects ఇది ప్రభుత్వ ఉద్దేశ్యం ఈబిల్లు శాసనం కావడంవల్ల జరిగే పని యిదే! ఒకసారి ఈ బ్లాకు సమితి కార్యక్రమాన్ని అప్పజెప్పిన తరువాత రాష్ట్ర ప్రభుత్వంగాని వారి ఏజన్సీలుగాని అందులో చెయ్యిపెట్టరు ఈరకంగా 447 బ్లాకు సమితులలో 20 జిల్లాలలో జరిగే మొత్తం డెవలప్‌మెంట్ పనులు ఏకొద్ది మేజరు ప్రాజెక్టులు, మేజర్ రోడ్లు, ఇండస్ట్రియల్ ప్రాజక్టులు మినహా అన్నీ ఈ శాసనంద్వారా ఏర్పడబోయే సంస్థలకు అప్పజెప్పబడుతుంది ఈ సందర్భంలో ప్రభుత్వం యంత్రాంగం ఏమాత్రం జోక్యం కలిగించుకోదు నిజంగా చూచినట్లయితే ప్రభుత్వం ఎంతో త్యాగంచేస్తున్నది Welfare State లో రాష్ట్ర ప్రభుత్వానికి ఈ కార్యక్రమాలుచేసే బాధ్యత ఉన్నప్పటికికూడ రాష్ట్ర స్థాయిలో

అధికారాన్ని అప్పజెప్పి, వారిచేత ఈ కార్యక్రమాన్ని చేయించాలనేది ప్రభుత్వ ఉద్దేశ్యము సంపూర్ణ అధికారం కావాలంటే అది సాధ్యమయ్యే పనా? అసలు ఈ రోజున modern state లో ఈ planned economy ని దృష్టియందు వుంచుకొని చూచినట్లయితే, పరిపూర్ణ స్వాతంత్ర్యం, అధికారం గలిగిన సంస్థలు ప్రపంచంలో ఏమైనా ఉన్నవా అని ప్రశ్నిస్తున్నాను అటువంటివి ఎక్కడా ఉండవు ఒకదానిమీద ఇంకొకటి ఆధారపడి ఉంటుంది మన శరీరమే ఒక Plan అనుకొన్నట్లయితే, ఒక అంగము బలహీనముగా ఉన్నప్పుడు, శరీరంలో మిగతా భాగంనుంచీ, దానికి కావలసిన బలాన్ని తీసుకొంటుంది ఈ శరీరాన్ని రక్షించాలనే ధ్యేయంతో అన్ని అంగాలుకలిసి పనిచేస్తాయి అట్లాగే, ఈ పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తులు ప్రభుత్వంతో సహకరించి పనిచేస్తాయి అలా పనిచేస్తేనే శ్రేయోరాజ్య నిర్మాణం సులభతరం అవుతుంది నిన్ననే నా ఉపన్యాసంలో చెప్పాను. రాష్ట్రాలు political units గా రాజ్యాంగంలో ఆటానమి ఉన్నది అయినప్పటికి ఈరోజున రాష్ట్రాలు తమ బడ్జెట్టులను కేంద్ర ఆర్థికమంత్రికి చూపించి వారి సలహాలను పొందుతున్నాయి అలా ఎందుకు చేయవలసి వస్తున్నది? కేంద్రం దగ్గరనుంచి రాష్ట్రాలకు డబ్బు కావాలి మన మీద నమ్మకంలేక, మన బడ్జెట్టులను వారు తెమ్మనమని చెప్పడంలేదు మొత్తం భారతదేశంలో ఈరోజున integrated economy ఉన్నది అనవసర దుబారాలు ఉండకుండా ఏ రాష్ట్రంలో ఏమిజరుగుతున్నది తెలుసుకొనేందుకు అలా వారు తెమ్మనమంటున్నారు ఈరోజున ఒక చిన్నస్కీము అమలు జరపాలంటే కేంద్రం మంజూరు కావాలి అలా ఉండడంవల్ల అనవసర ఖర్చులు జరుగకుండా చూడడమే కాకుండా ఒక co-ordination కూడ ఏర్పడుతుంది అవసరం వచ్చినపుడు వారి సలహాలు యివ్వడానికి వీలు ఏర్పడుతుంది అదేవిధంగా పంచాయితీ సమితులలోను, జిల్లాపరిషత్తులలోను సక్రమంగా పనులు జరగడానికి, వారికి కావలసిన సహాయసహకారములు అందించడానికి రాష్ట్ర ప్రభుత్వం చూస్తుంది అంతేగాని డయార్కి అనేది ఎవరు అమలు జరుపడంలేదు ఈపాటికి డయార్కి అనేమాట మరచిపోతే బాగుంటుంది అలాగే జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు కూడ అవి ప్రత్యేకమైన పరిస్థితులలో ఏర్పడ్డాయి. వాటికి ఆటానమీ ఉంది అవి చేసే పనులే వేరు మంచి చేయవచ్చు, చెడ్డ చేయవచ్చు వాళ్ళ యిష్టంవచ్చినట్లు చేయబట్టే వాటిని రద్దుచేయవలసి వచ్చింది అవి సరిగానే పనిచేసినట్లయితే 6, 7 సంవత్సరాలనుండి స్పెషల్ ఆఫీసర్ల చేతులలో ఉండేవి కావు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా!

శ్రీ వి బి రాజు No obstruction please ! మీరు చెప్పింది చెప్పారు ప్రభుత్వ దృక్పథాన్ని వివరిస్తున్నాను ఇంకా చర్చించడానికి చాలా stages ఉన్నాయి సెలెక్టు కమిటినుంచి వచ్చిన తరువాత మళ్లీ కావలసినంత చర్చ చేసుకోవచ్చు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య On a point of information, Sir

*Mr Speaker* No obstruction Please sit down

శ్రీ వి బి రాజు నాకంటె జిల్లాబోర్డుల సంగతి గౌరవసభ్యులకే ఎక్కువ తెలుసును ఆంధ్ర ప్రాంతంలో ఉన్న సంగతి నాకు తెలియదు కాని వాస్తవిక విషయాల గురించి మాట్లాడుతున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అలా అనండి

శ్రీ వి బి రాజు I am a student of Political Science దానినిబట్టేచెబుతున్నాను కాని expert గా చెప్పడంలేదు నేను జిల్లాబోర్డు అధ్యక్షుడుగా పనిచేయలేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) జిల్లాబోర్డు మెంబరుగాకూడ లేరు

శ్రీ వి బి రాజు జిల్లాబోర్డులు ఎందుకు బ్రతకలేదో నాకు తెలుసును వాటికి పెద్దకార్యక్రమం ఏమీలేదు వచ్చేడబ్బు తక్కువ. అవతల రాష్ట్రప్రభుత్వం పెద్ద ఏనుగలాగఉంటే, ఈబోర్డులు మేకపిల్లలుగా ఉన్నాయి. అందుచేత బ్రతకలేకపోయాయి జిల్లాబోర్డుల రోడ్లుచూస్తే గుంటలు ఉండేవి రాష్ట్రప్రభుత్వ రోడ్లు తారుతో, metal తో ఉండేవి జిల్లాబోర్డు ఉపాధ్యాయునికి 30 రూ లు ఇస్తే రాష్ట్రప్రభుత్వ ఉపాధ్యాయునికి 60 రూ లు అలాగే అన్నిటిలోనూ! ఈరోజున ఈ శాసనంద్వారా ఇట్టి కార్యక్రమమంతా ఒక single agency కి అప్పజెప్పబడుతోంది డెవలప్ మెంటు పనులన్నీ అప్పజెప్పబడుతున్నాయి రాష్ట్రప్రభుత్వం ఏమీ ఇందులో కలుగజేసుకోదు Technical guidance, Financial assistance, Co-ordination రాష్ట్రప్రభుత్వం యిస్తుందని స్పష్టం చేస్తున్నాను ఈ విషయాలన్నీ ఇందులో స్పష్టంగా వున్నాయి అలాంటి అర్థం రానట్లయితే భాష మార్చడానికి legal department లో ఇంతకన్న తెలివిగల draftsman ఉన్నట్లయితే అతనిచేత చేయించడానికి నాకెట్టి అభ్యంతరంలేదు భాషలో మార్పులు అవసరం వుంటే తప్పకుండా చేయవచ్చు. అంతేగాని, నేతిబీరకాయ, మసిపూసిన మారేడుకాయ అని

అనడంలో అర్థం ఏమీలేదు ఆవిధంగా చేయడానికి మాకు అవసరమేమున్నది? ఈ శాసనసభకు ఒక్కవిషయం స్పష్టంగా మనవిచేస్తున్నాను ఏవిధమైన ఒత్తిడి, ప్రజాందోళన, రాజకీయ సంబంధమైన గందరగోళం లేకుండా ప్రశాంతంగా రాష్ట్రం ఉన్నప్పుడుమాత్రమే ఈబిల్లును కాంగ్రెస్ ప్రభుత్వం తీసుకొనివస్తోందని గ్రహించాలి హాయిగా, చల్లగా ఉన్నసమయంలో, శీతా కాలంలో, ఉద్రేకంలేనిసమయంలో ఈబిల్లును ప్రభుత్వంతెచ్చింది బల్వంతరాయ్ కమిటి రాకకోసము ఈ ప్రభుత్వం ఎదురుచూచింది ఆ కమిటీకి యీ రాష్ట్ర ప్రభుత్వం కొన్నిసూచనలు యిచ్చింది ఆసూచనలు చేసినప్పుడు ఆకమిటీవారు "తక్కిన రాష్ట్రాలతో పోల్చిచూచినప్పుడు మీరాష్ట్రం చాలాముందుగా ఉన్నది" అన్నారు బహుశః ఆ కమిటీ రిపోర్టులో ఈ రాష్ట్రప్రభుత్వ సూచనలు చాలా ఉన్నాయి అనడంలో అతిశయోక్తి ఉండదు మేము యిచ్చిన సూచనలు ఆ కమిటీవారికి, ఆ రిపోర్టు తయారుచేయడంలో చాలా ఉపకరించినవి ప్రభుత్వము యొక్క motives ను ప్రశ్నించేటప్పుడు సభ్యులు ఒకటిమాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి ఏ విధమైన బలవంతం గాని, ఒత్తిడి గాని లేనటువంటి పరిస్థితులలో ఈబిల్లును ప్రభుత్వమే తనంతటతాను తెచ్చినది ప్రతిపక్షంవారు, విధి లేక "విమర్శించడం తమ విధి" అని అనుకొంటే తప్పకుండా హర్షిస్తాను ఇది రాజకీయ దృక్పథంతో తీసుకొనివచ్చిన బిల్లు మాత్రం కాదు ఇంతవరకు ఈ డెవలప్ మెంటు పనులు ప్రభుత్వయంత్రాంగంద్వారా సాగుతున్నాయి ప్రణాళిక అమలుకు, ఈ కార్యక్రమాల నిర్వహణకు ప్రజలసహకారం తీసుకోవాలని ఒక సిద్ధాంతంగా మనం పెట్టుకొన్నాము ఎంత ప్రయత్నించినా అది లభ్యం కావడంలేదు ప్రజలు ఎంతసేపు ప్రభుత్వంవైపే చూస్తున్నారు ఇది ప్రజాస్వామ్యానికి ప్రమాదము

ప్రభుత్వ యంత్రము గట్టిగా వుండాలి ప్రభుత్వ యంత్రములో నీతి వుండాలి ప్రభుత్వ యంత్రములో delays వుండకుండా efficiency వుండాలి ఒక model institution గా ప్రభుత్వ యంత్రము పనిచేయాలని మనము అంటున్నాము నిజంగా అలా వుండితీరాలి, దీనికొరకు ప్రయత్నము జరుగుచున్నది దానిని ఎపుడుసాధిస్తామో చెప్పలేము కాని ఒక ప్రమాదమున్నది చాలా Efficient Bureaucracy వున్నదనుకోండి Peoples' weak democratic institution వున్నదనుకోండి దాని ఫలితమేమిటి? Fascism ప్రభుత్వ యంత్రము గట్టిగావుంటే ప్రజల గౌరవాభిమానాలు ప్రభుత్వముపై వుంటాయి రాజకీయపార్టీలుగావున్న ప్రజాసంస్థలు కొట్లాడుకుంటూ చెడిపోయే సమయములో ప్రజలహృదయములో ఏమిబయలుదేరుతుంది? 'పోనీ Bureaucracyయే

అధికారాన్ని తీసుకోనీలేం అనిపిస్తుంది ఈ ప్రమాదమును ఇతరదేశాలలో మనము చూస్తున్నాము అందుకొరకే ఇక్కడ ఒక policy గా పెట్టుకొన్నాము అధికారులు ప్రజలదగ్గరకే రారు వారి సమస్యలను గుర్తించరు అధికారులతో schools open చేయడము, foundation stone వేయించడము ప్రతివిషయంలో కూడా అధికారులవైపు చూడడము ప్రజాసంస్థలవైపు కాని ప్రజానాయకుల వైపుకాని ప్రజలు చూడకపోవడము అనేదానిని కూడా గుర్తించినాము ఇది ప్రజాస్వామ్యానికి ప్రమాదము అందుచేత ప్రభుత్వయంత్రము ఎంత efficient గా పనిచేయడానికి తగివున్నదో అంతకంటే ఇంకా ఎక్కువగా ప్రజా సంస్థలు పనిచేయడానికి పూనుకోవాలి అని యీ బిల్లు ద్వారా సూచింపబడు తున్నది అపుడే ప్రజాస్వామ్యము నిలబడుతుంది ప్రజాస్వామ్యములో ప్రజలకు విశ్వాసముంటుందనే ఉద్దేశ్యముతో ఈ బిల్లును తీసుకొస్తున్నాము ఇందులో చెడు ఉద్దేశమేమీలేదు వాస్తవ పరిస్థితులు దృష్టిలో పెట్టుకోవాలి మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు సరిగా పనిచేయకపోయినా, పంచాయితీలలో తగాదాలువచ్చి పనేమీ జరుగకపోయినా వాటిమీద ప్రజలకు విశ్వాసము ఎలా వుంటుందో మీరే చెప్పండి ప్రజలు తహసిల్‌దార్ దగ్గరకు పోతారు ఈవేళ పాకిస్థాన్‌లోకాని ఇతర దేశాలలోకాని ఎంత గగ్గోలు జరిగినప్పటికినీ, Military Dictatorship వచ్చినప్పటికినీ వారెందుకు సహించి వూరుకున్నారు? ఈ వేళ పాకిస్థాన్‌లో ఏమిజరుగుతున్నా దానిని గురించి వ్యతిరేకంగా ఒక్క మాటకూడా బయటకు రావడములేదు సరికదా అక్కడినుంచి బయటకు వచ్చినవారుకూడా చెప్పడములేదు ఎందుకు? రాజకీయ పార్టీలుచేసే పోర పాటువల్ల ప్రజలలో reaction వచ్చి, పోని ఏ ప్రభుత్వమైతేనేమి ఇపుడువచ్చిన ప్రభుత్వము బియ్యముధర తగ్గించిందికదా అనేటటువంటి భావం కలుగు తుంది అది కలుగకూడదు మన తరములో ప్రజాస్వామ్యాన్ని ఇంకా పటిష్ఠం చేసే బాధ్యత మనమీద వున్నది అందుకు మనం అనేక precautions తీసుకో వాలి మనలోవున్న భేదాలు, చీలికలు, అధికార వ్యామోహము ఇవన్నీకూడా ప్రమాదానికి దారితీస్తాయి ఇటువంటి contingency రాకుండా ప్రజాసంస్థలకు ఒక స్వరూపము ఇచ్చి వాటికి పనిచేసే అధికారమిచ్చి వాటిలోని ప్రజా నాయకులకు గౌరవము కల్పించాలనే సదుద్దేశంతో తీసుకొస్తున్నామేకాని ఎవరినో మభ్యపరచి కలెక్టరును ఒక శాసనసభ్యుని నెత్తిన పెట్టడముకాని Block Development Officer ను Block సమితిమీద పెట్టడముకాని వుండదని స్పష్టంగా చెప్పుచున్నాను ప్రజాస్వామ్యాన్నిరక్షించాలని, perfect democracy ఇక్కడ వుండాలని మా ఆశయం Controlled democracy అంటే ఆమాటకు అర్థం నేనేమి చెప్పేది? మనమెంత ఆందోళన చేస్తేనో, ఎంతత్యాగము చేస్తేనో

బ్రిటిష్‌వారు, నైజాంవారు అధికారాన్ని వదలిపెట్టారు కాని యీవేళ రాష్ట్ర ప్రభుత్వము తన అధికారాన్ని ప్రజల హాస్తగతము చేయాలనే ఆందోళనను నేను కోరడములేదని మనవిచేస్తున్నాను ఇతరరాష్ట్రాలు ఎంత చేయగల్గుతవో నేను challengeచేయను ఎందుకంటేPolitics లో challenges చాలతప్పు కేరళ రాష్ట్రంలో వెరె ప్రభుత్వమున్నది వారుకూడా decentralisation ఎంతవరకు చేస్తారోకూడ చూడవలసియున్నది చాలమంది అంటున్నారు ప్రభుత్వము ప్రజలను నమ్మడములేదని వారేమి తప్పులు చేస్తారోనని భయపడుచున్నారు ప్రజలను నమ్మనపుడు అధికారం ఎందుకిస్తారు ? నమ్మితేనే యివ్వండి ఇక్కడ మంత్రులైనవారికి training యివ్వలెదు కాబట్టి తప్పులు చేసివుండవచ్చు నాకు బాగా జ్ఞాపకము నేను 1950 సంవత్సరము జూన్ నెలలో Minister ఐనప్పుడు swearing in ceremony అయి ఆఫీసుకు పోగానే పెద్ద files వచ్చినవి వాటిని ఏమిచేయాలో నాకు తెలియదు Secretary ని అడుగుదామా అంటే గౌరవానికి లోటు Sudden గా Cabinet లోనికి వచ్చాము తప్పులు చేశాము కాని తర్వాత అంతా తెలుసుకొన్నాము ఎప్పుడైతే మనము from a scrap పైకి వచ్చినామో, యీ Democracy లో ప్రజలు అంతమాత్రము పైకి రాలేరా ? కాబట్టి అటువంటి motive ను ప్రభుత్వానికి అంటగట్టవద్దని మనవిచేస్తున్నాను ప్రజలపై నమ్మకము వాండ్లకు లేకకాదు ప్రజలలోనుంచి వచ్చినవారము ప్రజలను నమ్మకపోవడమనేది ఎలా వుంటుంది? ప్రజలలోనుంచి వచ్చినవారు opposition party వారేనా? మేము రాలేదా? కనుక motive ను గురించి మీరు చెప్పవద్దు Welfare State లో 20—30 కోట్లు ఖర్చుపెట్టబడిన Administrative machinery ని పాటించకుండా వారినందరిని ప్రక్కకు పెట్టి పంచాయితీ సమితి ప్రెసిడెంటే work orders యిస్తాడా, అది నాకు అర్థము కావడములేదు సభ్యులు బిల్లును చదువలేదు అనే అనుమానము నాకు కలిగినది Block Development Executive Officer అంటే ఏమిటి ? ఆయన పనేమిటి ? మన శాసనసభలో 3 వందలమంది సభ్యులున్నారు అసలు వీరికి ఏమి అధికారముందో చెప్పండి వ్యక్తిగతంగా ఏమి అధికారం లేదు మనకేదైనా అధికారముంటే సమిష్టిగా వుంది We are a sovereign body Individual గా ఒక చప్రాసీని appoint చేయగలమా?ఒక స్కూల్ టీచరును dismiss చేయగలమా ? ఇది Block సమితి President యొక్క ధర్మమా ? ఆయనకు day-to-day duty ఇదేనా ? ఆయన full time office hours attend ఔతారా? ఆయన files లో సంతకాలు పెట్టుతూ వుంటాడా ? ఒకవేళ అధికారమిచ్చినా అనుకోండి. ఆయన ఒక Teacher ను dismiss చేస్తాడనుకోండి సమితి సభ్యులకు ఇష్టము లేదనుకోండి It amounts to a no-

confidence motion కనుక మనము Executive actions కు పంచాయితీ అధ్యక్షుని బాధ్యునిగా చేయరాదు మనము Executive functions చేయించే అధికారము తీసుకొందామా, లేక Executive చేసే పనిని తీసుకొందామా? సభవారే తేల్చండి అక్కడ cabinet system లేదు Executive functions కొరకు ఒక body వున్నది అందుకని Block Development Officer ను Executive Officer అన్నారు ఆయనను Block సమితి క్రింద పనిచేయమన్నాము మీ రెక్కడైనా చూడండి B D O కు అధికారాలు ఇచ్చామేమో బాధ్యతలు పెట్టాము He is responsible to implement all the resolutions of the Block Samithi President వచ్చినపుడు B D O కుర్చీనుంచి లేచి నిలుచోవాలి ఆయన పోతూవుండగా సలామ్ పెట్టాలి ఇవన్ని వ్రాయమంటారా?

The Block Development Officer is responsible to implement the resolutions and he has to work under the Block Samithi. It is not advisable to give such responsbility to him

ఇది నాకు అర్థముకావడములేదు కాని సభ్యులయొక్క ఉద్దేశము కనుక పంచాయితీ అధ్యక్షుడు Executive Officer హోదా కలిగివుండాలనుకొన్నట్లయితే అది fundamental గా విచారించవలసిన విషయము దానికి ప్రభుత్వం తయారుగాలేదు ఒక non-official ను తీసుకవెళ్ళి contract service మీద మనము ఉద్యోగము ఇచ్చినట్లుగా ఉద్యోగమిస్తామా? అది President గారవానికి లోపము నేను Executive orders ఇచ్చుకుంటూపోతే దానికి tenders accept చేస్తూ పోతే నేను contracts మీద సంతకాలు పెట్టుతూ పోతే దానికి మోక్షములేదు ఇవన్నీ Secretary చేసే పనులు

"కలెక్టరును ఎందుకు పెట్టారు?" అన్నారు ఆ విషయములో భేదాభిప్రాయాలు వుండవచ్చు దీనిమీద ప్రభుత్వము తీవ్రముగా ఆలోచించింది. కాని కొన్ని సౌకర్యాలవల్ల శాసనము ఈవిధముగా పెట్టవలసివస్తుంది ఇది Welfare State అని మరల మరల చెప్పనక్కరలేదు Police State కాదు పన్నులు వసూలుచేయడము, ఆస్తులను కాపాడడము, Security Services ను Provide చేయడమే కాదు Welfare State activities, State యొక్క ముఖ్యమైన activity గా వుండాలి సోషలిస్టు సమాజము ఇవి లేకపోయినట్లయితే నిలువదు అనే దృక్పథముతో మనము వున్నాము ప్రతిఉద్యోగిని development activities వైపుకు త్రిప్పుతున్నాము తహసీలుదారును తీసుకొని వచ్చి development పని చేయమంటున్నాము వెనుకటిరోజులలోని తహశీలు

దార్లకు ఈ రోజులలోని తహసీలుదార్లకు వున్న తేడాను చూడండి ఈ development department కు Revenue department నుంచి 60 మందిని transfer చేస్తున్నాము సర్వీసులన్నీ development సర్వీసులవైపుకు త్రిప్పుతున్నాము State machinery వద్దు, ఇదంతా మేమే చేసుకొని ముందుపోతాము మీరు వెనుకరండి అనడం మంచిదికాదు ఇది Welfare State యొక్క concept లో అసంభవము Administrative machinery యొక్క బాధ్యత ప్రజల అభిప్రాయాలకు అనుకూలముగా నడవడం వారి ఆజ్ఞలకు లోబడి నడవడంకాని State mychinery replace చేసి non-official కి ఒప్పచెప్పుతామనేమాట అబద్ధము బ్లాక్ సమితులు autonomous అయిపోవు నట్లుగా full powers ఇవ్వడానికి వీలులేదు Agricultural Programmes కాని, Irrigation Programmes కాని వున్నవి అనుకోండి వీటివిషయంలో District Head కు గాని Head of the Department కు గాని సంబంధము వుండాలి శాసనసభ్యులుచేసిన విమర్శనలను దృష్టిలో పెట్టుకొని నేను మాట్లాడుతున్నాను Programme execution వరకు ఈ సమితులకు అధికారమిచ్చినాము జిల్లా పరిషత్తులకన్న బ్లాక్ సమితులు ఎక్కువ ప్రాముఖ్యత కలిగివున్నవి ఎందుచేత నంటే అది Executive body జిల్లాపరిషత్తులు Executive bodies కావు నరసింగ రావుగారు చెప్పినట్లు కొంతకాలము వరకు diarchy system వుంటుంది మొత్తము programme అయ్యేటంతవరకు కొన్ని పనులు వారు చేస్తూ వుంటారు ఏదయినా inter block లో పనివుంటే చేస్తూవుంటారు ఈ పంచాయితి సమితి, బ్లాకులోపల జరిగే పనులన్నీ District Head కు గాని Departmental Headకు గాని సంబంధంలేకుండా చేద్దామంటారా, నేనుఒప్పుకొంటాను దాని risk తీసుకొని నడపగలరా అని అడుగుతున్నాను 20 జిల్లాలలో 447 blocks లో Heads of Departments కు సంబంధము లేకుండా నడుపుతా మంటారా ? It is a parallel Government అట్లాకాదు Administrative machinery ని peoples' representatives కలిపి పనిచేయించాలని మా ఉద్దేశము ఒక single agency ని తయారుచేయాలి Agricultural Demonstrator మీదకూడ control Head of the Department కు వుంటుంది Disciplinary Control తీసిపారేసి అన్ని powers block సమితులకు ఇచ్చివేసి, మీ జీతాలు మీరేఇచ్చుకొనండి, promotions మీరే యిచ్చుకొనండి, Transfers మీరే చేసు కొనండి, అని అన్నట్లయితే ఫలితా లెలా వుంటాయో మీరే ఆలోచించండి Controlling Power Head of the Dept. చేతుల్లో వుంచుకొని సక్రమముగా నడపవలసివుంటుంది ఒక complicated work వుంది Estimate తయారు అయింది Technical Control లేకపోతే అది దేనికి మార్గము తీస్తుందో చెప్ప

లేము **Block** సమితి క్రింద పనిచేస్తున్న **services** అన్నీ గవర్నమెంటు సర్వీసులే జిల్లా బోర్డు సర్వీసులు వున్నవి వారి **finances** అంతా వారి బాధ్యత **State Government finances, technical advices** అన్నీ బ్లాక్ సమితుల అధీనము చేసినపుడు వారి బాధ్యతలు ఏమిటని అడుగుతున్నాను వారిమీద పెద్దభారము ఏమి పెట్టడంలేదు కొన్ని **funds** ఇస్తున్నాము **Programme** ఇస్తున్నాము అన్నిసహాయములు యిచ్చినతరువాత వాటిని నడపమంటున్నాము అట్లా అన్నాకూడ అన్నము పెట్టినతరువాత పప్పు వేయలేదు, పప్పు వేసినతరువాత నెయ్యి వేయలేదు, నెయ్యి వేసినతరువాత తాంబూలము ఇవ్వలేదు అన్నట్లు వాదించడం సబబుకాదు ఇది దానము ధర్మముకాదు ప్రజల సహకారము ప్రభుత్వమునకు వుండవలెనంటే వాస్తవిక పరిస్థితులను దృష్టిలోపెట్టుకొని నడవాలి **Collector presiding authority** గా వుంటాడు జిల్లా కలెక్టరు **preside** చేస్తున్నపుడు శాసనసభ్యులు కూర్చోవడం తమ గౌరవానికి భంగము అని అనుకొంటే తప్పక ఆ **sentimental objection** ను ప్రభుత్వము గుర్తించడానికి తయారుగావుంది కాని ప్రభుత్వానికి మాత్రం అధికారము వీరి నెత్తిమీద పెట్టాలనిలేదు ఇది **experts** ఆలోచించవలసినవిషయము ఏపద్ధతిలో పోతే **development work** సాధిస్తాము అనే విషయము ఆలోచించవలసిందేకాని, ఇందులో రాజకీయాలుగాని, రాజకీయ సిద్ధాంతాలుగాని ఏమీలేవు జరుగుతున్న **development works** పాడైపోకుండా ఇంతకన్న ఎక్కువగా జరగాలి **Head of the dept** లేకపోయినట్లయితే ఏవిధముగా పనిచేస్తుందో ఆలోచించండి ఒక **non-official** నే **President** గా చేస్తే 50, 60 మంది సభ్యులను **control** చేయగలిగి వుండాలి అంటే **president** గారు **full time worker** గా వుండాలి అప్పుడే ఆయన గుర్తించగలుగుతారు **Block Development Officer** కు **instructions** ఇచ్చి వారిక్రింద పనిచేయమని ఎందుకు చెప్పకూడదని మీరు అంటారు' ఆలోచించి చూచినట్లయితే సమితి క్రింద పనిచేయాలని వుంది సమితి **meet** కానపుడు సమితి **symbol** గా అధ్యక్షుడుగారే వుంటారు కాని వారికి అనుమానం ఎందుకు కలిగినదో నాకు అర్థము కావడములేదు సమితిని **sabotage** చేస్తాడు అనేమాట ఉపయోగించారు నాకు అర్థము కావడములేదు **He has got access to all papers Public interest** లో, సమితి **interest** లో ఏదయినా **document** సమితి అడిగినట్లయితే కలెక్టరుకు వ్రాసి ఉత్తర్వులు పొందవచ్చును అని వుంది ఇటువంటివన్నీ చిన్న విషయాలు

ఇంక emergency powers విషయము ఒక చెరువు గండిపడి నీరుపోతున్నది అనుకోండి అది పూడ్పించడానికి పంచాయితీసమితి sanction చేయాలి సమితి, Standing Committee కలుసుకోవు వెంటనే ఆయన emergency powers ఉపయోగించి ఆ గండి పూడ్పిస్తాడు అది తప్పా ? ప్రభుత్వములో red-tapism, delay wastage ఎక్కువని, నిద్రపోతూవుంటారని విమర్శన చేస్తూవుంటాము చెరువు గండిపడినపుడు, రోడ్లు పాడైపోతున్నపుడు అవి బాగు చేయించడానికి Executive Officer కు emergency powers లేకపోతే ఎట్లాగ ? ఈ బిల్లును కొందరు గౌ సభ్యులు పక్షపాత దృష్టితో చూశారేమోనని నాకు అనుమానము కలుగుతున్నది కొండను త్రవ్వి, ఎలుకను పట్టినట్లుగా కొండంత ఆశ చూపించారు పంచాయితీ సమితులకు కొన్ని అధికారాలు యిచ్చినందుకు నిరాశ నిరుత్సాహము కలుగుతోంది అన్నారు ఇన్నాళ్ళు మాట్లాడిన మాటలలో ఏమి ఇస్తామని చెప్పినామో నాకు తెలియదు ఇంతకన్నా ఎక్కువ ఇవ్వడానికి అవకాశం వున్నట్లయితే తయారుగావున్నాము Working procedure లో ఈ బిల్లువల్ల ఆటంకాలు వస్తవని తోచినట్లయితే Select Committee stage లో ఆలోచించవచ్చునని మనవిచేస్తున్నాను

మనకు శక్తి ఎంతఉన్నదో అంతవరకే తీసుకోవాలి మనముఉన్న వాతావరణములో మనము risk తీసుకుంటే వచ్చేబాధ్యతనుకూడ దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది Risk అంటే ప్రజలు తప్పుచేశారనికాదు ఒకరకం administrative machinery, ఒక bureacracy అనేది వందలకొలది, వేలకొలది సంవత్సరాలుగా మన దేశములో పనిచేస్తూవచ్చింది ఇక్కడ మన దేశములో Hierarchy వుంటూ వచ్చింది అది ప్రతిదేశములోను మొట్టమొదట ఉన్నది మన ప్రజలను అందులోనుంచి తప్పించి ప్రజాసేవకులుగ తయారు చేయటానికి ప్రయత్నిస్తాము Development activitees లో ఆ పనిచేసే బాధ్యత వారిపైన పెట్టియున్నాము వారు ఆ పనిచేస్తున్నారు ఒకపర్యాయము State administrative machinery ని అంతా వెనుకకు నెట్టివేసి, ఈ పనులన్నీ మేమే execute చేయిస్తాము అని వారి స్థానమును మనము ఆక్రమించుకోటానికి ప్రయత్నించినట్లైతే, అది పొరబాటు అవుతుందని నేను భావిస్తున్నాను లేదూ అట్లా జరుగుతుందని అంటారా ? జరిగితే మంచిదే లేదు ఈ నలభైమంది ఆఫీసర్లు అంటే, B D O లు, Collectors, Panchayat Samithies, జిల్లా పరిషత్తులు అన్నీ autonomous bodies గా చేసి వారిని transfer చేయమంటారా? అధికారమంతా వారికి ఇచ్చివేయమంటారా ? వారందరు గవర్నమెంటు

సర్వీసులో ఉన్నవారుగనుక ఒప్పుకోరు They are only deputed for that purpose ఈ B D O s ను, Extension Officers ను ఒక, చోటునుంచి ఇంకొక చోటుకు, ఒక బ్లాకునుంచి ఇంకొక బ్లాకుకు transfer చేయడములో Departmental Heads కు అధికారము లేకపోతే ఎట్లా ? లేకపోతే ఈ transfers, వగైరాలు అన్నీ ఆ Block సమితి ప్రెసిడెంటే చూచుకోవాలంటే, it will be only building walls between Block and Block రాష్ట్రములోఉన్న Blocks ను తునకలుచేసి గోడలుకట్టబోతున్నామన్నమాట ఇది ప్రభుత్వం ఉద్దేశ్యము కాదు Development కార్యక్రమాలు ప్రజల అభిప్రాయముల కనుగుణ్యముగచేస్తే, అవి త్వరలో అవుతాయి ఆపనులలో ప్రభుత్వం జోక్యం కలిగించుకోకూడదు. ఇవి అన్నీ satisfy కావాల్సి ఉంటుంది తరువాత Select Committee stage లో clause by clause తీసుకున్నప్పుడు తప్పకుండా ప్రభుత్వ పక్షమున మేము చెప్పగలుగుతాము ఏవి అయితే కుదించామో అవి మేము incorporate చేయగలుగుతామని చెప్పగలుగుతాము ఇందులో ఏమైనా పొరబాట్లు ఉన్నప్పటికినీ, లేకపోతే procedural matters లో ఆటంకాలు ఉన్నప్పటికనీ, ఆ విషయములలోకూడ మేము మొండిపట్టు పట్టుకొని కూర్చొదలచుకోలేదు సభ్యులుకూడ ఇదే view తీసుకుని ప్రభుత్వంతో సహకరించమని ప్రార్థిస్తున్నాను గౌ సభ్యులు అనేక విషయాలు చెప్పారు అనేక సూచనలు చేశారు ఇప్పుడు వాటికన్నింటికి సమాధానములు చెప్పటానికి సమయము చాలదు బల్వంతరాయ్ మెహతా కమిటీవారు చెప్పినట్లుగా మేము చేస్తామని చెబితే వారు చెప్పినదానికి విరుద్ధముగ పోతున్నామని చెప్పారు నరసింగరావుగారు కూడ అదేవిధముగ భావించారు అసలు బల్వంతరాయ్ మెహతాగారి main recommendations ను వేటినికూడ అతిక్రమించకుండా వాటిని మేము incorporate చేస్తామని నిరూపిస్తున్నాము వారుఇచ్చిన recommendations మూడుఉన్నవి అందులో మొదటిది-

(1) The Panchayat Committees should be constituted by indirec elections by Village Panchayats (2) The Technical officers of the Samithi should not be under the technical control of the corresponding District Level Officers but under the administrative and operational Control of the Chief Administrative Officer i e, the Block Development Officer to ensure necessary co-ordination between the Panchayat Samithes, and the Zilla Parishad The Zilla Parishad should be Constituted consisting of the Presidents of the Samithis, M L A s and M P s representing the area and the District Level Officers also as Members

District Level Officers ను మొట్టమొదట మేము తయారుచేసిన Draft Bill లో ఉంచాము అది యిప్పుడు తీసివేశాము మొట్టమొదట జిల్లా ఆఫీసర్లుకూడ జిల్లాపరిషత్తులో సభ్యులుగా ఉండాలని అనుకున్నాము తరువాత వారందరినీ అనధికార సభ్యులతో మెంబర్లుగ ఉంచడము మంచిది కాదేమోనని, అది తప్పేమోనని తలంచి ఇప్పుడు వారిని అందులోనుంచి తొలగించాము బల్వంతరాయ్ మెహాతా కమిటీవారి recommendations లో జిల్లా ఆఫీసర్లుకూడ జిల్లాపరిషత్తులో సభ్యులుగా ఉండాలని ఉన్నది అది చదువు తాను వినండి

"The Collector will be its Chairman and one of his officers will act as Secretary" అని వున్నది. ఇది ఇట్లాగే ఉంచమంటారా ? మేము దీనికంటే యింకా ముందుకేవెళ్ళాముగదా ! బల్వంతరాయ్ మెహాతా కమిటీ వారు చేసిన సూచనలుకాని, ప్రభుత్వం publish చేసిన White Paper ద్వారా యీసభముందు చేసిన సూచనలుగాని, Interruption

ఒక గౌ సభ్యుడు శాసనసభ్యులు ప్రజలచేత ఎన్నుకోబడినవారు కదా? వీరిని ఓటింగు హక్కు లేనటువంటి మెంబర్లుగా చేస్తామని చెప్పటానికి కారణ మేమి ?

శ్రీ వి బి రాజు ఇది ఒక పెద్ద policy matter కాదు శాసనసభ్యులకు అందులో ఓటింగుహక్కు కావాలంటే శాసనసభ్యులను అందులో చేర్చివారికి ఆహక్కు లేకుండా అగౌరవపరచడము ఎందుకు ? అయినను జిల్లాపరిషత్తులో శాసనసభ్యులకు ఓటింగుహక్కు కావాలని అంటూ, వీరే ఇక్కడ యీబిల్లుకు అంగీకారముయిస్తే ఈ రెండింటికి పరస్పర విరుద్ధముగా ఉంటుంది అందువల్ల అసలువారందరిని Block సమితిలో ఉంచకూడదు అని మేము అనుకున్నాము కాని ఆయా Constituencies లో నుంచి ఎన్నికఅయివచ్చిన M L A లు గనుక, ఆ ఏరియాతో వారికి సంబంధముఉండాలి అక్కడ ఏమి జరుగుతున్నదీ వారికి తెలియవలసిఉంటుంది గనుక వారికి అందులో మెంబర్లుగాఉండే అవ కాశము మేము కలుగజేశాము అట్లాకాదు అక్కడకూడ వారికిఓటింగు హక్కు ఉండాలి వారినికూడ పంచాయితీసమితికి అధ్యక్షులుగ ఎన్నుకోటానికి హక్కుఉండాలి అంటున్నారు కాని ఒక సారిఓటింగుహక్కు ఇచ్చినతరువాత శాసనసభ్యుడు పంచాయితీసమితి అధ్యక్షుడు అయ్యే అధికారము వచ్చి తీరుతుంది కాని ప్రభుత్వంయొక్క ఉద్దేశము ఏమిటో గౌ॥ సభ్యులతో చెబు తున్నాను శాసనసభ్యుడు పంచాయితీసమితి అధ్యక్షుడుగ ఉండడము ఏమంత

మంచిదికాదేమోనని అనుకుంటాను Administrative Control అంటే అర్ధము అందరికి తెలుసు Operation, execution అని ఉన్నది ఈ మాటలు అన్నింటికీ ఒకే అర్ధము ఏపని అయితే చేయదలచారో ఆ పనిలో సంపూర్ణస్వేచ్ఛ ఉన్నదని తెలుగు భాషలో దానికి అర్ధము చెప్పగలను

*Sri K. Subba Rao* Under the Chief Executive Officer?

*Sri V. B Raju* No Sir I entirely repudiate that allegation I am very clear about it

*Sri K Subba Rao* Then please make it clear.

శ్రీ వి బి రాజు English wording లో పొరబాటు ఏమైనా ఉంటే, దానికి నన్ను మన్నించండి, తప్పు దిద్దుకుంటాను కాని the meaning of it is this–"The B D O should work under the Panchayat Samiti' అని ఉన్నది అంటే ఇప్పుడు ఒకటి, రెండు అధికారములు యివ్వటములేదు ఈరోజున ముఖ్యమంత్రిగారు, మేము ఇతర మంత్రులు Cabinetలో ఉన్నప్పటికినీ, we are all subordinate to the Assembly ప్రతి B D O కూడ ఆ బ్లాకు సమితికి లోబడి ఉండాలి ఆ బ్లాకు సమితి క్రిందనే పనిచేయాలి ఇక అంతకంటే ఏమి చెప్పమంటారో నాకు అర్థం కావడంలేదు లేకపోతే ఇందులోనే స్పష్టముగా వ్రాయమని అంటారా! చెప్పండి ఈ బ్లాకు సమితిపక్షమున ప్రెసిడెంటు వ్యవహరిస్తూ ఉంటాడు అన్ని విషయములలోను execution జరపటానికి అవకాశము ఉన్నది Tenders call for చేయడములోకాని, అవి accept చేయడములోగాని, contracts ఇవ్వడములోగాని, అన్ని అధికారములు వారి చేతిలోనే ఉన్నవని చెప్పవలసిఉంటుంది అప్పుడు అది ఎంతదూరము పోతుందో ఆలోచించండి కాని ఏ ఒక్క వ్యక్తికి కూడ individual గా యీ అధికారము ప్రభుత్వం యివ్వదలచుకోలేదు Samithi కి గాని, సంస్థలకు గాని collective body గా మేము అధికారము ఇవ్వదలచుకున్నాము కాని individual గా మాత్రము అధికారము ఇవ్వదలచుకోలేదు ఇదే democratic decentralisation Decentralisation అంటే State headquarters లో ఉన్న అధికారమును decentralise చేసి జిల్లాలకు తరలించడము అన్నమాట కాని అది ఎవరిచేతిలో ఉంచాలి అన్నదే ప్రశ్న కలెక్టరుకు ఇవ్వడము కాదు Block Development Officer కు ఇవ్వడముకాదు పంచాయితీ సమితికి, జిల్లా పరిషత్తుకు ఇస్తున్నాము వీటి రెండింటికి మధ్య functions ను divide చేసి అప్పజెప్పుతున్నాము ఈసంగతినిగురించి ప్రభుత్వం

యొక్క అభిప్రాయము స్పష్టముగా ఉన్నది శాసనసభ యొక్క అభిప్రాయము కూడ అదే ఈ సభలో యీ బిల్లును గురించి గౌ సభ్యులు చేసిన సూచనలు అన్నీ విని నేను అర్థము చేసుకున్నాను సభ్యుల యొక్క కోరిక ఏమిటో పూర్తిగ గుర్తించటానికే ఈ బిల్లులో ఇది ఇమడ్చబడియున్నది తరువాత direct and Indirect elections గురించి చెప్పారు ఇప్పుడు చేసేది Development work కాని శాసనములు చేసే బాధ్యత వారిపైన ఏమీలేదు గౌ సభ్యులు ప్రతి ఒక్క విషయములోను ఎన్నికలు కావాలంటారు నా ఉద్దేశ్యములో ఎన్నికలు ఎన్ని ఎక్కువ చేస్తే తగాదాలు అన్ని ఎక్కువగా ఉంటాయి అదితప్ప మరేమి లేదు మన మందరము ప్రజాప్రతినిధులము ప్రజాప్రతినిధులను ఎన్నిక ద్వారా ఏర్పాటుచేసుకోవడము ఎవరివెనుక ప్రజలు ఉన్నారు అనేదానిని తెలుసు కోటానికే నిజానికి ఎన్నిక అనేదే మనము ప్రాధాన్యముగ భావించ రాదు Democracy కనబడేది ఎన్నికలో కాదు What election means is just to know who is the representative of the people అది తెలుసు కోటానికే పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు దగ్గరనుంచి ఎన్నికలు జరుపు కుంటూ వస్తున్నాము అన్నిటికినీ ఎన్నికలు కావాలి జిల్లాపరిషత్తులోనికి ఎవరైనా రావాలంటే ఆయన ముందు పంచాయితీ ward లోనుంచి సభ్యుడుగా ఎన్నిక కావాలి అటుతరువాత పంచాయితీబోర్డుకు అధ్యక్షుడుగా ఎన్నిక కావాలి అటుపిమ్మట పంచాయితీ సమితిలో మరల అధ్యక్షుడుగా ఎన్నిక కావాలి ఇన్ని జరిగితేనే ఆయనకు జిల్లాపరిషత్తులో స్థానముఉంటుంది కాబట్టి ఇన్ని విధములుగ filteration జరుగుతున్నప్పుడు అందులో నుంచి తప్పించుకుని రావాల్సిఉంటుంది ఇలాంటి ప్రజాస్వామ్యపు పద్ధతులు అన్నీ దాటివచ్చిన వ్యక్తి ప్రజాప్రతినిధి కాకపోతే ఇంకా వేరే ఎవరు అవుతారు? కాబట్టి ఇది ప్రజాస్వామ్య సిద్ధాంతానికి విరుద్ధము, విరుద్ధము, అంటే ఎట్లా? బిల్లులో democracy అనే పదములు ఉపయోగించారని అన్నారు అయితే మనము democracy ని అవలంబిస్తున్నప్పుడు ఆ పదము ఉపయోగించకపోవ డము ఎట్లా? ప్రతి చిన్న విషయములో కూడ election పెట్టమనేనా? ఇక ప్రతి దానికి ఆవిధముగా elections పెట్టుకుంటూపోతే, మన కార్యక్రమములకు ఉపయోగించవలసిన టైము కాస్తా వాటికే సరిపోతుంది ఇక మనకు బావులు రావు, చెరువులు రావు, రోడ్లు రావు, కుంటలు రావు, కాలువలు రావు ఏవీ కూడ రావు కాబట్టి ప్రజాప్రతినిధిగా వచ్చి జరిగే కార్యక్రమము అంతా తెలుసుకోటానికి ఇది ఒక మార్గముగ ఏర్పాటుచేశాము అట్లా కాదు, ప్రతి విషయములోనూ చిన్నదైనా పెద్దదైనా Direct Elections కావాలని సభ్యు లందరు కోరడము అంటే—అది వారి యొక్క అభిప్రాయము అయితే కావచ్చు—

శ్రీ కె యల్ నరసింహారావు ఒక్క చౌకా్కరావుగారు తప్ప తక్కిన పార్టీల సభ్యులందరు elections కావాలనే కోరుతున్నారు

శ్రీ వి బి రాజు ఎన్నికలు అనగానే అన్ని రాజకీయపార్టీలకు full engagement అక్కడ వుంటుంది పార్టీలలో ఇప్పటికె విభాగాలు అయినవి ఇక యీ ఎన్నికలలోనికి రాజకీయ పార్టీలు ఎప్పుడైతే వచ్చాయో, అవి అప్పుడు విభాగాలు అయినట్లే ఉండాలి ప్రతిచోట విభాగాలు అవుతూపోతే ఇక Development కార్యక్రమాలు రాజకీయ దృక్పథమువల్ల పాడైపోతా యనే భయం ఉన్నది అవి రాకూడదనికాదు ఈరోజున ఎసెంబ్లీలో ఏ division అయితే ఉన్నదో దానిని గ్రామాలదాకా పాడిగించవలచగలమా ? ఈ దినము ఈ పార్టీ fragmentations, compartmentalisation గ్రామాలలో తగాదాలు కల్పించటానికి మనము ఉద్దేశించడములేదు దానికి నేను వ్యతిరేకిని సాధ్యమైనంతవరకు మనము ఈ రాజకీయపార్టీలను గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు దూరముగ ఉంచినట్లైతే అక్కడ ప్రజాశక్తి సంపాదించడానికి వీలుంటుంది రాజకీయ పార్టీలను దూరముగ ఉంచి, గ్రామాలలో ప్రజాశక్తిని సమీకరించటానికి ప్రయత్నించండి దానికి ఈ method of elections ఉపయోగపడుతుంది Direct Elections ద్వారా యీ mass elections లో 51% రావాలనడము సందేహమే నలుగురు నిలబడితే అందులో మొత్తము ఓట్లు వచ్చినవాడే నిలుస్తాడని చెప్పలేము 25% ఓట్లువచ్చి గెలిచినవారుకూడ వున్నారు కొద్దిఓట్లతో గెలిచివచ్చినవాడు ప్రజలందరియొక్క ప్రతినిధి అని చెప్పుకోగలడా ? కాబట్టి యీ system of Electoral Law ఆ విధముగ ఉన్నదిగనుక దానిని మనము ఒప్పుకోక తప్పడములేదు

Direct Elections పెడితేనే ప్రజాస్వామ్యం అవుతుందని, indirect elections పెడితే ప్రజాస్వామ్యం కాదని చెప్పడం సమంజసంగా ఉండదు గ్రామాలలో పంచాయితీబోర్డు అధ్యక్షులకన్న బాధ్యతగల మనిషి ఎవరు ఉంటారు ? అని అడుగుతున్నాను "The village is a unit" అనేది ఈ బిల్లులో ఉన్నటు వంటి ముఖ్యమైన సూత్రం దానిని మరచిపోవద్దు కమ్యూనిస్టు పార్టీనుంచి ఒక సూచన వచ్చింది 4, 5 గ్రామాలను కలిపి ప్రతి 5, 6 వేలమంది ప్రజలలో నుంచి ఒక ప్రతినిధిని పంపించాలి అని ఒక village నుంచి వచ్చిన మనిషి పంచాయితీ సమితిలో యింకో village ని గురించి ఎందుకు మాట్లాడుతాడు ? మాట్లాడడు దానివల్ల తగాదాలు వస్తాయి అందుకనే village ని unit గా చేసి ప్రతి village నుంచి ఒక representative పంచాయితీ సమితిలో ఉండాలని

ఏర్పాటు చేశాము ఇంకా ఎన్నో విషయాలు ఉన్నాయి అవన్నీ Select Committee stage లో విచారిద్దాం ప్రభుత్వానికి, opposition కు, యితర శాసన సభ్యులకు అందరికీ అంగీకారమైనటువంటి విషయం ఒక్కటే Head-quarters లో ఉన్న power ను జిల్లాస్థాయికి, బ్లాక్‌స్థాయికి తరలించడం అక్కడి ప్రజాసంస్థలకు ఆ అధికారాన్ని అప్పజెప్పడం అంతవరకు అందరికీ అంగీకారమే Chairman కు ఏమి అధికారం ఉండాలి? Standing Committees కు ఏమి అధికారం ఉండాలి? B D O లకు ఏమి అధికారం ఉండాలి?' అనేటటువంటి powers and functions విషయంలో ఏవైనా భేదాభిప్రాయాలు ఉంటే ఉండవచ్చు అది ఏమంత పెద్దవిషయంకాదు, అవన్నీ Select Committee లో స్పష్టంగా తేల్చుకోవచ్చు శాసన సభ్యులందరు ఎక్కువ శ్రద్ధ తీసుకొని ఈ debate లో పాల్గొని సూచనలు యిచ్చినందుకు ప్రభుత్వం తరఫున నేను వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను

*Mr. Speaker* The question is

"That the Andhra Pradesh Panchayat Samithis and Zilla Parishads Bill, 1958 be read a first time"

The motion was adopted.

*Sri V. B. Raju* Sir, I beg to move

"That the Andhra Pradesh Panchayat Samithis and Zilla Parishads Bill, 1958, be referred to a Joint Select Committee, on which I have already moved a motion, consisting of 32 members, 24 members from the Assembly, namely -

1. Sri V. B Raju
2 ,, K. Brahmananda Reddi
3 ,, D Sanjiviah
4. ,, Y. Adinarayana Reddi
5. ,, A Chidambara Reddi
6. ,, M Venkata Raju
7. ,, T. V. Raghavulu
8 ,, R Lakshminarasimham Dora
9 ,, P Ranga Reddi
10. ,, Peta Bapiah
11. ,, Raja Sagi Suryanarayana Raju
12 ,, R. Narasimha Reddi

13 Smt Kanakaratnamma
14. Dr. A B Nageswara Rao
15 Sri P V Narasimha Rao
16 ,, Shahabuddin Ahmed Khan
17 ,, R. B Ramakrishna Raju
18. ,, C. V. Suryanarayana Raju
19 ,, Ravi Narayana Reddi
20 ,, Baddam Yella Reddi
21 ,, M. Nagi Reddi
22 ,, V Visweswara Rao
23 ,, Rajamallu
24. ,, Vavilala Gopalakrishnayya

and 8 members from the Council, that this Assembly recommends to the Council that the Council do join the said Joint Select Committee and communicate to the Assembly the names of the members appointed by the Council to the said Joint Select Committee."

*Mr. Speaker* Motion moved

(Pause)

*Mr Speaker* The question is

"That the Andhra Pradesh Panchayat Samithis and Zilla Parishads Bill, 1958, be referred to a Joint Select Committee consisting of 32 members, 24 members from the Assembly, namely

1. Sri V. B Raju
2. ,, K Brahmananda Reddi
3. ,, D Sanjiviah
4 ,, Y. Adinarayana Reddi
5. ,, A Chidambara Reddi
6 ,, M Venkata Raju
7 ,, T. V Raghavulu
8 ,, R Lakshminarasimham Dora
9. ,, P Ranga Reddi
10. ,, Peta Bapiah

11 Sri Raja Sagi Suryanarayana Raju
12 ,, R Narasimha Reddi
13 Smt Kanakaratnamma
14 Dr A B Nageswara Rao
15 Sri P V Narasimha Rao
16 , Shahabuddin Ahmed Khan
17 ,, R B Ramakrishna Raju
18 ,, C V Suryanarayana Raju
19 ,, Ravi Narayana Reddi
20 ,, Baddam Yella Reddi
21 ,, M Nagi Reddi
22 ,, V Visweswara Rao
23 ,, Rajamallu
24 ,, Vavilala Gopalakrishnayya

and 8 members from the Council, that this Assembly recommends to the Council that the Council do join the said Joint Select Committee and communicate to the Assembly the names of the members appointed by the Council to tne said Joint Select Committee

The motion was adopted

*Mr Speaker* The House now stands adjourned till 9 A M tomorrow

*(The House then adjourned till Nine of the Clock on Thursday, the 11th December, 1958)*